# ఉజ్జ్వల తరంగిణి





రచయిత

ఆర్షవిద్యాలంకార

కల్లూరి చంద్రమౌళి బి. యస్. సి. (ఎబర్డీన్)

ప్రమాదీచ ౧౯౭౩

శ్రీ ర్వి జ య తే.

శ్రీ వేంకటాద్రి నిలయః కమలాకాముకః పుమాన్ ।
అభంగుర విభూతి ర్న స్తరంగయతు మంగళమ్॥

# ఆ మో ద ము

మహావిద్వాన్, శ్రీమాన్ :

## వేదాన్తం జగన్నాథాచార్యులు

**తిరుమల తిరుపతి దేవస్థానముల ఆస్థానవిద్వాంసులు, తిరుమల.**

రాజకీయవేత్తలై అమాత్యవరులై సారస్వతకోవిదులై శ్రీ మద్రామాయణ సుధాలహరిని వెల్లివిరియించిన శ్రీయుత కల్లూరి చంద్రమౌళిగారు నేడు ప్రజ్ఞాపాటవమున నవసుధా ప్రవాహములను "ఉజ్జ్వల తరంగిణి" యందు సమావేశ మొన ర్చుట సారస్వతసేవాపరాయణుల భాగ్యము.

ఈ నవసుధాప్రవాహతరంగములు విభిన్న కాలికములై, విభిన్న దేశీయములై, విభిన్న రుచులతో విభిన్న మార్గముల బయలుదేరి విభిన్న దృక్పథములతో చరించువారల హృదయ కుహరముల ప్రవేశించి వారి నానంద తరంగములం దుయ్యేల లూపుచున్నవి.

ఆ నాడు మాధవసేవా న్తర్భూతమగు మానవసేవను – దేశసేవను గావించి, ఈనాడు సారస్వత సేవా న్తర్భూత మగు

సారస్వత మానవసేవను, దేశసేవను చేయుట పరార్థవ్యక్తులకు నైసర్గిక సౌందర్యాపాదకము.

అధికారిక దేవతావిశేషములవలె దేశసేవజేయుటకాక- అధికారానధికారముల పరిగణింపక మార్గాన్తరములచే దేశసేవనే కావించుట కడుంగడు విశేషము.

సర్వవిషయముల సర్వ సమయముల - ఉత్సాహశక్తిని ముందిడుకొని త్రికరణముల సమానసరణికి జేర్చి దేశారాధనమునకు పూనుట జన్మాంతరీయ సుకృత సముదయ సమావేశ మనక తప్పదు.

"మహాతాముదారతా" యనునట్లు వీరియందలి మహాత్మ్యౌదార్యముల సముచిత రమణీయతమ సమావేశము విజ్ఞానులకు ముదావహము, అజ్ఞానుల కభీష్టావహము నగుచున్నది.

మధురములై మృదులములై మాననీయములై అలరారెడి యిట్టి ఉజ్జ్వల భావతరంగములను గ్రంథరూపమున సంగ్రథించుచున్న యీ గ్రంథకర్తకు - ఆంధ్రలోకము ఋణపడియున్నది. ఇట్లు సర్వతోముఖముగ ప్రజాసేవజేయు సుదర్శన సూరి సత్సంతాన మగు శ్రీ చంద్రమౌళి మహోదయునకు సప్తాచలవాసియగు శ్రీ శ్రీనివాసదైవము సర్వాభీష్టములను సమకూర్చుగాక !!

॥ దివాకర్ల వేంకటావధాని ఎం. ఏ. (ఆనర్సు) పి. హెచ్‌డి.
ఆంధ్ర శాఖాధ్యక్షులు
ఉస్మానియా విశ్వవిద్యాలయము
హైదరాబాదు 23–6–73

ఆర్షవిద్యాలంకార సార్థకబిరుదాంకితులైన శ్రీ కల్లూరి చంద్రమౌళిగారు రచించిన 'ఉజ్జ్వల తరంగిణి' యను గ్రంథము నాద్యంతము పఠించి యానందపారవశ్యము నందితిని. అది ఉజ్జ్వల భావతరంగిణి. అందున్న తరంగము లాలు దేనికదే పవిత్రభావ శీకరముల కాకరమై పఠితల కపారమైన యాశ్వాసము నొసంగుచున్నవి. వారి గ్రంథములన్నియు భారతీయ సంస్కృతి సముద్రమునందలి యమూల్యరత్నములను వెలికిఁ దీసి వాని యుజ్జ్వల దీధితులచే నజ్ఞానతమోముద్రితములైన తెలుఁగువారికిఁ గనువిప్పు కలిగించునట్టివే. వారికృషి సర్వపండిత ప్రశంసాపాత్రము; సర్వజన శిరోధార్యము.

గీతావతరణ ముపనిషత్సార భూతమైన భగవద్గీత పరమార్థమును జక్కఁగాఁ బ్రకటించుచు, మానవధర్మమును బోధించుచు, మహిమాన్విత సందేశము నందించుచున్నది. గీత అర్జునుని కొక్కనికే యుద్దేశింపబడినదికాదు. అది విషణ్ణులైన మానవులందరికిని గర్తవ్యమును బోధించుచు వారిని గార్యాచరణోన్ముఖులను గావించుచున్నది. అర్జునుఁడందు జిజ్ఞాసువు

లకుఁ బ్రతినిధి. స్వార్థమును విడిచి స్వధర్మమును నిశ్చల చిత్తముతో నిర్వహింపుమను భగవానుని శంఖారావ మందుఁ బ్రతిపదమునను వినిపించును.

శ్రీ వైష్ణవము భక్తిప్రధానమైన యీ మత స్వరూపమును వివరించుచు, మూలమంత్ర – ద్వయమంత్ర – చరమ శ్లోకముల యాంతర తత్త్వమును – గంభీరార్థమును విశదీకరించుచున్నది. వైష్ణవధర్మ సిద్ధాంతము లిందు సరళ సుందరముగా ప్రవచింపఁబడినవి. గీతా శ్రీమద్రామాయణములనుండి యిందొసంగబడిన యుదాహరణ శ్లోకములు శ్రీ చంద్రమౌళి నిరంతర పఠన తత్పరత్వమును బ్రకటించుచున్నవి.

ఆండాళ్ వైభవ మామహాభక్తురాలి మధురభక్తిని, ఆమె రచించిన పాశురములందలి భావసంపత్తిని రమ్యముగా వ్యక్తముచేయుచున్నది. ఆండాళ్ నిజముగా వాడని, పరిమళము పీడని యొక నిచ్చక్రొత్త 'కోదై' పూలగుత్తి. అందుండి వెలువడు సౌరభము సంసారతారకమైనట్టిది.

తిరుప్పావై, తిరువెంబావైలు గోదామాణిక్య వాచకరుల భక్తివైభవమును వారి రచనలందలి వివిధదృష్టి వైఖరులను వెల్లడిచేయుచున్నవి.

భగవన్నామ సంకీర్తనమునందు భగవన్నామము నిర్మలములైన స్పర్శలను వ్యాప్తముగావించి భక్తుల కమూల్యము

లైన ఫలములందిచ్చునని చెప్పఁబడినది. నామినామ, శేష శేషి తత్త్వముల రహస్యమిం దుగ్గడింపఁబడినది.

ఉజ్జ్వల నదీముఖము రామకృష్ణ వివేకానందుల జీవిత రహస్య మధుధారా స్రవంతి. వారు తమ జీవితాదర్శములచే, ఉపదేశోపన్యాసములచే భారతసంస్కృతి తరంగిణిని నల్గడల బ్రవహింపఁజేసిన మహనీయులు. వారి యుపదేశములు భారత జాతికి తరణోపాయములు.

ఈ గ్రంథమునందలి శైలి సరళమై, స్పష్టమై, సరసమై, సర్వసుబోధమై చదువరులకు భారతీయసంస్కృతి నిధానమును చూఁబలిచ్చుచున్నది. పవిత్రములైన భావములు, లలిత మధురములైన పదములు, రమ్యమైన ప్రబోధము అను త్రివేణులకుఁ గూడలియైన అక్షరప్రయాగ – ఈ యుజ్జ్వల తరంగిణి.

కళాప్రపూర్ణ, కులపతి
శ్రీమాన్ తి. గు. వరదాచార్యులు
నారసింహ సంస్కృత కళాశాల స్థాపకులు
చిట్టిగూడూరు, మచిలీపట్నము 25—6—73

ఈ తరంగిణిని ఆమూలనదీముఖము ఆలోకించితిని. ఇది అనల్ప విశేషప్రదర్శకము, ఆహ్లాదకము, ఆకర్షకమునై అత్యంత తృప్తి నొదవించినది.

ఈ మహాతరంగిణి గీతావతరణము, శ్రీవైష్ణవము, ఆండాళ్ళ వైభవము, తిరుప్పావై - తిరువెంబావై, భగవన్నామ సంకీర్తనము, ఉజ్జ్వల నదీముఖము అను ఆరు పాయలుగ ప్రవహించి ఆదినుండి నేటిదాక భారతదేశమున విశిష్టతనొందిన ఆర్ష సంస్కృతి స్వరూపమును కన్నులకుగట్టి చూపుచున్నది.

అనాది కాలమునుండియు, తాము తీర్ణులయి, తారణో పాయములను పరులకుద్బోధించు సత్సంకల్పముగల తపోధనుల కాటపట్టు మన ఆర్యావర్తము.

ఏనాటివారో మంత్రద్రష్టలయిన ఋషిపుంగవులు మొదలు నిన్న మొన్నటి వివేకానందుని దాక మన పుణ్యభూమి నవతరించి సత్పథ ప్రవర్తనమును సంసారవిముక్తి సాధనములను ఆత్మాచరణ పూర్వకముగా అఖిలమానవ కోటికిని ఉపదేశ

ములు గావించిన మహాత్ముల ప్రభావమును, వారివారి జీవిత ప్రవృత్తులను, ఆంధ్రుల చిత్తములకత్తించి ఈగ్రంథము దేశమునకు మహోపకారకము కాగలదు.

ఇందు ప్రతిపాదితములయిన విషయముల పవిత్రతయు, రచనాశ్రితమయిన ప్రసన్నగంభీరశయ్యా సుకుమారతయు ఒకదానినొకటి మించి చదువరుల కాకర్షకములు కాదగియున్నవి.

కింబహునా? ఆంధ్రులలో ప్రతివ్యక్తియు అందుకొనదగినది ఈసరళ సుకుమార గ్రంథరత్నము. చంద్రమౌళి శిరోంతర ప్రదేశమున కొలదికాలము నెలవుకొని కళానిధి సాహచర్యముచే శీతలత్వము నలవరించుకొని కాలక్రమమున భూమండలమున ప్రవహించిన ఈ నిర్మల తరంగిణిలో నిష్ఠతో, నియమముతో, నిమజ్జనము గావించి పరిశుద్ధచిత్తులై పావనచరిత్రులై మహాక్లేశసంపాదితమైన మానవత్వమునకు సార్థకతను సంపాదించుకొని మనవారు భారతదేశస్వరూప మహత్త్వమును సుప్రతిష్ఠితము కావింతురుగాత.

"ఇత్యలమతివిస్తరేణ"

శ్రీమాన్ నేలటూరి భక్తవత్సలము యం. ఏ., బి. ఓ. యల్.
ఆంధ్రశాఖాధ్యక్షులు
వివేకానంద కళాశాల, మద్రాసు-4.

27-6-73

ఆర్ష విద్యాలంకార శ్రీకల్లూరి చంద్రమౌళిగారు ఈ (1973) ప్రమాదీచలో ఆంధ్రమహాజనుల విశిష్ట భాగ్యపరిపాకమున, వారిని శైత్యసౌరభ్య మాధుర్య పావనతాంచితమైన 'ఉజ్జ్వలతరంగిణి' లో ఓలలాడించినారు. ఇందు గోదా దేవ్యష్టోత్తర శతనామస్తోత్రమును మంగళాశాసనశ్లోకత్రయమును గాక (1) గీతావతరణము (2) శ్రీవైష్ణవము 3) ఆండాళ్ వైభవము (4) తిరుప్పావై తిరువెమ్పావై (5) భగవన్నామ సంకీర్తనము (6) ఉజ్జ్వలనదీముఖము – అను ఆఱు వ్యాసరాజములు గలవు. మొదటి వ్యాసమున భగవద్గీత ఒకానొక కాలవిశేషమున అవతరించినను దాని విలువ సార్వకాలికము నిత్యనూతనము అనుట రంజక ధోరణిలో సుస్పష్టమొనర్పబడినది. ద్వితీయ తృతీయ చతుర్థవ్యాసములు దక్షిణభారత శ్రీవైష్ణవ సంప్రదాయార్థ నిధానములైన గీర్వాణ ద్రావిడ గ్రంథములందలి విషయవిశేష లఘుపరిచితిని ఆంధ్రులకు సమకూర్చి చరితార్థములగుచున్నవి. ఐదవ వ్యాసమున భగవన్నామసంకీర్తన ప్రభావమును విజ్ఞానశాస్త్ర మార్గములో

నిరూపించిన తీరు ఉపపన్నమై, కౌతస్కుత ప్రవణులగు అధు నాతన జిజ్ఞాసువులకు చక్కని సమాధానము కూర్చునదై అపూర్వమైనను అమోఘమై నిరుపమమై దీపించుచున్నది. ఉజ్జ్వలనదీముఖమనెడి చరమప్రకరణమున నవ్యభారతవిధాతయు ప్రాక్ప్రతీచీ సంధాతయు మహాత్ముడును మహర్షియు మహా త్యాగియు మహాయోగియునగు వివేకానందుని విశిష్టతయు ప్రతిభయు సిద్ధులును – దివిజగంగా ప్రవాహవేగాతీతధాటీ మండితమైన యుపన్యాసఫణితిలో ప్రస్తుతింపబడినవి. ఈ వ్యాసములందలి ధారావాహియైన సుందర మధురాంధ్రశైలి అద్యతన గద్య రచయితల కందఱికిని మేలుబంతిగ శిరోధార్యమై యున్నదనుట అతిశయోక్తి కాదు.



వైద్యరత్న
శ్రీమాన్ రత్నాకరం శ్రీనివాసాచార్యులు
సత్తెనపల్లి.

# నివాళి

భగవద్గీత స్వయంబుగా వినిచె నా పార్థున్ స్వకృత్యంబునన్
తగ నిల్పన్ నిగమార్థవేదియును నార్తత్రాణ దీక్షాపరుం
డగు శ్రీకృష్ణుడు యుద్ధభూమి నొక దివ్యక్షేత్రమున్‌జేసి యా
భగవచ్ఛాస్త్రి ప్రభావమున్ దెలుపు నీ ప్రారంభవ్యాసం బహో !

ఆర్యులలో ననార్యుఁడు ద్వయం బను మంత్రము ప్రేమపూరితౌ
దార్యముతోడ సర్వులకు దాన మొనర్చిన శుద్ధ వైష్ణవా
చార్యుఁడె పూజనీయుఁడగు సద్గురువర్యుఁ డటంచు ధాత్రిఁ బ్రా
చుర్య మొనర్ప వ్రాసెను సుశోభిత వ్యాసము వైష్ణవం బనన్.

ప్రాతఃకాలమునందు మేల్కొని తిరుప్పావై లలిన్ గోపికా
వ్రాతంబే తమ బృందమంచు మది సంభావించి నృత్యంబు సం
గీత ప్రాభవ మొప్ప జేయుచును భక్తిన్ బాడు గోదా - సఖుల్
ప్రీతిన్‌గోరి పరిగ్రహించుత కృతిన్ శ్రీ విష్ణు చిత్సూక్తిగాన్.

అందమునందు ఆత్మబలమందు సనాతన ధర్మబద్ధమౌ
హిందుమత ప్రవక్తగను నీప్సిత సాధనయందు నొజ్జ కా
నందము గూర్ప దేవియె కనంబడుదాక స్మరించుటందునన్
వందితుఁడౌ నరేంద్రుని స్వభావము వ్రాసె నదీముఖం బనన్.

చక్కని భావనాపటిమ శబ్దములన్ పరిపుష్టి శాస్త్రమం
దెక్కువ మక్కువన్ గలిగి యిట్టి కృతిన్ రచియించె మిత్రు డిం
దొక్కొక వ్యాస మొక్కొక సముజ్జ్వల మైన తరంగ మౌచు ఋ
గ్వాక్కు వలెన్ సనాతన ప్రభావఝరిన్ ప్రవహించుగావుతన్.

ప్రథితమౌ భారతీయుల ప్రతిభ మొదలు
నుజ్జ్వల తరంగిణి వఱకు నొక్కొక కృతి
మించు భావంబులను వెలయించె చంద్ర
మౌళి సాహిత్యసేవ నివాళు లంద.



బృందావనం రంగాచార్యులు
ప్రధానాంధ్ర పండితులు
యార్లగడ్డ రామన్న ఉన్నతపాఠశాల
పరుచూరు.

# పసిడి పూలు

సముదాత్త వైఖరిక్ వి
శ్వమె విస్మయపడగ భరతజాతి విశిష్ట
త్వమునందె నరయ దత్సా
రము ప్రవహించినది "ఉజ్జ్వలతరంగిణి" యై.

దేశదేశాలకు దివ్య సందేశమ్ము
నందింపజాలిన యట్టి నేల
వేద ధర్మమ్ముల వెలుగులో కమనీయ
కాంతిరేఖలబంచ గలుగు గడ్డ
ఆర్ష తేజమ్ముల యనుపమ శక్తితో
పులకింప నేర్చిన పుణ్యభూమి
స్తవనీయ సంప్రదాయ విశేష మహిమచే
తరియించి ధన్యతన్ వరలు ధరణి

యగు భరత సీమకున్, కళాప్రగతి సహిత
మగుచు రాణించు భారతీయ ప్రతిభకు,
మురిసి వినయాతిశయమున శిరమువంచి
జోతలిడుచుండు సకల ధరాతలమ్ము.

భారత భావనారుచిర భాగ్యములన్ వివరింపనెంచి-వి
స్తారముగా శ్రమించి - మన సంస్కృతికిన్ గల మాన్యతల్ నవా
ధార విశేషశోభల ముదమ్ము ఘటింప రహించి మించె క
ల్హారమువోలె "ఉజ్జ్వల తరంగిణి" తాత్త్విక దివ్యదీప్తితో.

ప్రవిమల భావనాబల మపారముగా గల యోగిచంద్రు లి
య్యవని పయిన్ సుధల్ గురియ నవ్యయ మానసిక ప్రసన్న వై
భవమును బంచి - ఉజ్జ్వల శుభమ్ములుగూర్చి - హితమ్ము బెంచినా
రవుర ! తదీయదీక్ష సకలార్థములన్ విరియించె జాతిలో.

సుప్రథితా శయమ్మునకు, సుందరకావ్య కళా సరస్వతీ
ప్రప్రథమో దయమ్మునకు, బంధుర సాంస్కృతిక ప్రశస్త స
త్య ప్రభకున్, సమున్నతికి, ధామము భారత శేముషీ విశాల
ప్రతిభా సమన్విత తరంగిణి - వాస్తవమున్ వచించినన్.

మోదమ్మున్ ఘటియించి నిర్మల యశమ్ముగ్గూర్చి సర్వప్రజా
హ్లాదమ్మున్ సృజియించి సాత్త్వికగుణవ్యాలోల తత్త్వమ్ములో
నీ దేశమ్మును యోగ్యతా శిఖరిపై నిల్పెన్ ప్రసన్నమ్ములై
వేదమ్ముల్ గణనీయ గౌరవకళా విస్ఫూర్తి దీపింపగన్.

ఉజ్జ్వల తరంగిణికి ముదమొప్ప విమల
రూపకల్పనజేసి నిరూఢకీర్తి
సంతరించెను కల్లూరి చంద్రమౌళి
విబుధ వరువాణి శుభములు విరియజేసి.

చిరకాలమ్ముగ రాజకీయములనే సేవించి భావించుచున్
సురభాషా రమణీయ లీలలకు వశ్యుండౌచు సాగించె సు
స్థిర సాహిత్య మహావ్రతమ్మును నవోత్తేజముతో "చంద్రమౌ
ళి" రసోపాసకుడై - తదీయరచనా రీతుల్ ప్రశంసార్హముల్.

జననమా ! పరిపూర్ణ సంస్కార భావనా
ధనుడైన యా సుదర్శనుని యింట
దీక్షయా ! పావన దేశాభ్యుదయ నయ
శీల సంపద పెంపుసేయు పట్ల
నేస్తమా ! ప్రాక్తన నిరుపమ సంస్కృతి
సంపన్నులయిన సజ్జనులతోడ
అభిరుచియా ! సంస్కృతాంధ్ర సాహిత్య వి
శేషమ్ము లెరిగి పచించుటందు

తృప్తియా ! తెలుగు సొగసులు తెలియునెడల
గాగ, నిత్య వినూతన కర్మయోగ
మర్మము లెరింగి చరియించు ధర్మశీలి
సాధు నుత గుణశాలి ! ఈ చంద్రమౌళి.

ఆయన యూహాబలమౌ
రా ! యనిపించినది "ఉజ్వల తరంగిణి"యై
శ్రేయమ్ము గూర్చి నూత్నా
ధ్యాయమ్మగు గాక ! సుకవితా లోకమునన్.



# అంతర్భావన

ప్రపంచశాంతిని, కళ్యాణమును పరమ లక్ష్యములుగా భావించి నిరంతర నిష్కామకృషిని గావించిన మన మహర్షులు సర్వదా స్తవనీయులు. తపస్సంపన్నులై తమ దివ్యసంకల్పములను సఫలము లొనర్చుకొన్న పరమపావనులు భారతీయ ముని కుల తిలకులు. తాత్త్వికదృష్టితో, ధర్మజిజ్ఞాసతో, న్యాయ చింతనతో, నియమనిగ్రహసంపత్తితో, బ్రహ్మచర్యవ్రత నిష్ఠా పాలనా పరాయణులై వారు సాగించిన కృషి జగన్మంగళమును సంఘటించినది. జాతికి చరితార్థతను ప్రసాదించినది. వారి నుడులు పవిత్రశీల వైభవమునకు గుడులు. వారి యడుగులు ధరణీతలమునే తరింపజేయు దివ్యసంప్రదాయ సరళికి మాననీయములగు మడుగులు. వారి విసిర్మల మనోరథములు జాతీయుల కభినందనార్హములగు తారకపథములు. వారి యాశ్రమ వాటికలు భగవత్తత్త్వ వైభవమునకు పేటికలు. ఒక్కమాటలో చెప్పవలెననిన విశ్వమునకే వారు ధ్రువతారలు. మానవాళికే వారు శాంతిసందేశ దూతలు.

వారినోట వెలువడిన యీ యార్ష సందేశము విశ్వవిశ్వాన్తరాళముల గాఢముగ ప్రసరించి మానవాళి మనఃఫలకములపై చెరగని ముద్రలను వైచినది. తరగని కాంతిని వెల్లివిరియించినది. అది మన జాతి యదృష్టము. అది మన మాతృదేశ మహాభాగ్యము.

భగవదనుగ్రహము నార్జించుటే మానవులకు పరమ లక్ష్యమై యుండవలయునని మహర్షులు బహుముఖముల నుద్ఘోషించినారు. ఆత్మోత్తేజమును ఘటింపజాలిన వేదధర్మముల వంకకు జనుల యూహలను ద్రిప్పుటే వారి యభిమతము. తదనుగుణమైన వ్యవహారము నంతయు వారనురక్తితో నిర్వహించిరి. పురాతనకాలమునుండియు భారతీయజీవనపథమును పునీతమొనరించు నిమిత్తమై మహోద్ధతితో ప్రవహించుచు వచ్చుచున్న సనాతన ధర్మసంస్కృతి స్రవంతి యొకటి కలదు. జాహ్నవీధారాపరంపరలవలె ఆ సంస్కృతి సర్వమును పవిత్రీభూతమొనరింపగలదు. గౌరీశంకర శిఖరమహోన్నతివలె నది యొక యత్యున్నతస్థానమున నిల్చి, తనయంత యెత్తున కందరిని పెంచగలదు. ఈ దివ్యసంస్కృతి యంతయు వేదసరస్వతీ ముఖోద్గతమైనట్టిదే! వివేకసంపత్తిని బంచియిచ్చి నరులను విధేయతానావభూషితులనుగ బరివర్తింప జేయగల మహత్తరశక్తి ఈ పరమపావన ప్రాక్తన భారతీయ సంస్కృతికి మాత్రమే కలదు. ప్రాజ్ఞు లంగీకరించిన నగ్నసత్య మిది. ఈ దివ్యత్వమును ప్రజా

జీవితమునం దంతర్వ్యాపినిగా విలీన మొనరించి, సకల భారత మును నాడు ప్రదీప్త మొనర్చిన తేజస్సంపన్ను లీ సంయమి చంద్రులే.

ఋషివాక్కు ప్రభుశాసనముగ పరిగణింపబడిన రోజు లలో - భూపతులు సైతము యతికులశేఖరుల యాజ్ఞ నొదల వహించి యాచరణమునకుం దెచ్చిన తరుణములో - ఈ దేశ గౌరవపు టంతస్తు గణనీయముగనే వన్నె కెక్కినది. ప్రపంచ మున గురుస్థానమునే యలంకరించినది. తనవారు పెరవార లనెడి తారతమ్యమునకు కించిన్మాత్రమేని తా వీయక - కష్ట సుఖముల గణన సేయక, నిర్దుష్టమయిన నీతిపథమును విడనాడక, న్యాయ మార్గము నధఃకరించుటకు సాహసింపక, సత్యకథన విశిష్టతను విస్మరింపక, సర్వేశ్వరార్పణదృష్టితో సర్వము నిర్వహించి, సకల జనశ్రేయమును త్రికరణశుద్ధిగ గాక్షించుచు జీవనయాత్రను కొనసాగించిన మహాత్ములే యీ భారత వసుంధరాతల వ్యావ హార సర్వస్వమున కొక యొరవడి దిద్దియున్నారు.

ఆత్మబలోపేతు లయిన వారి యాదర్శ బలమువలన పర మార్థమును గుర్తింపజాలినంత కాలము - గుర్తించి అనుసరించి అనుష్ఠించినంత కాలము దేశము సస్యశ్యామలముగను సర్వవిధ వైభవ సమన్వితముగను ప్రవర్ధమానమాయె ననుటలో లవలేశ మేనియు సంశయము లేదు. పండువెన్నెలలో రాచబాటల యనమము సాగించువారి గమనమున కభ్యంతర మేమియుండును?

ఆ గమనమున నవాంఛనీయమైన మార్పు వచ్చుటయే ధర్మగ్లాని యేర్పడెననుటకు ప్రబల సాక్ష్యము. "ధర్మము భ్రష్టమయిననాడు నేను భూలోకమునం దవతరింతు ననియు, ధర్మమును సముద్ధరింతు" ననియు గీతాచార్యులవారి ప్రబోధము. పవిత్ర పుణ్యాభావజలధి భగవద్గీత. ఈ పావనభావగంగాప్రవాహ వేగోద్ధతిని మనము భగవద్గీతా గ్రంథ గగనమున తిలకింపగలము. నరుని హృదయమున గల కాలుష్యమును గడిగివైచి దివ్యవేదాంత సిద్ధాంత తేజోలహరితో సర్వవేళల దళతళలాడున ట్లొనర్పగల మహామహిమాన్విత ప్రచుర ప్రబోధమును శ్రీమద్భగవద్గీతామాత విశ్వమునకు పంచిపెట్టినది. మానవుడు సర్వసాధారణముగ సంశయాకులచిత్త ప్రవృత్తి గలవాడు. నిరంతర సంఘర్షణప్రకృతి నెదిరించి నిశ్చల భావోద్దీప్తిని సంతరించుకొనుటకై యతడహరహము సతమతమగుచున్నాడు.

అతని యంతర్వేదన యంతరింపవలయును. చిక్కుముడులు విప్పి చీకాకులనుండి తప్పింపగల మనోదార్ఢ్యమును మానవు డెల్లప్పు డాకాంక్షించుచుండును. కాని, మమతల కతడు దాసుడు. లౌకికలంపటల కుంపటిని గుండెలనుండి దింపుకొనుట కత డనుమతింపడు. ఆ వేడిమికి దట్టుకొని భరింపదగిన శక్తియా! అతనికడ తగినంతగ గన్పట్టదు. స్వపర తారతమ్యదృష్టివలన గోల్పోయిన విశాలాశయములను వివేకబలమున పోగుచేసికొనుటకు జతన మొనరింపనేరనివాడతడు. కర్మదీక్షితు

డగుటకు కఠోరప్రతిజ్ఞ బూననేరనివాడు కర్మఫలానుభూతికై ప్రాకులాడుట మాత్రము మానడు. డోలాయమానమానసుడై హేలగ కాలమును వెళ్ళదీయు నిమిత్తమే ఎప్పటికప్పుడు సర్దుబాటు మన స్తత్వముతో సంచరించుట కత డభిలషించుచుండును. ఈ స్థితి మనుగడను సర్వవిధముల చరితార్థమొనర్చుటకు సాయపడ దనెడిమాట ప్రత్యక్షర సత్యము. లోకసహజమయిన యీ వైఖరినుండి జీవాత్మలకు విముక్తిని బ్రసాదింప పరిపూర్ణ కరుణవహించిన పరమాత్మయే గీతావాక్యమును ప్రసాదింపవలసి వచ్చినది. అశాశ్వతమైన భౌతికసంబంధ బంధములనుండి శాశ్వతము, నిత్యము, నిరపాయమునగు సత్యపథము వంకకు నరుని నడిపింప దలచినాడు నారాయణుడు. పార్థుడు నిమిత్తమాత్రుడు. బ్రహ్మాండమైన సంక్షోభమునకు, ప్రబల రాజ్యాకాంక్షకు, ప్రధన భావతాండవమునకు ప్రత్యక్ష ప్రతిబింబమైన భారతమహా యుద్ధము కలిసివచ్చిన సన్నివేశము. ఒకానొక జగన్మంగళకర మహాక్రతు కలాపమునకు నిరుపమాన నిలయముగ నిలిచిన ధర్మక్షేత్రము కురుక్షేత్రము. క్షేత్ర క్షేత్రజ్ఞ పరిజ్ఞాన ప్రాభవముతో మానవుడు మాధవునితో కలసిన దిచటనే. నరుని నారాయణుడు తీర్చిదిద్దిన దిచటనే. శ్రేయోమార్గ సమవగాహనతో- అచంచల కర్తవ్య నిర్వహణ పరాయణతతో - జీవాత్మ పరమాత్మను సర్వ శరణ్యునిగ గుర్తించి ఆయనలో సంవిలీనమైన దిచ్చటనే. గీతావతరణము జరిగినదిచ్చటనే. ఈ ప్రబోధ సంపదను నాటివారికి మాత్రమే సొంత సొత్తుగ నెంచరాదు. నేటి

వారి - రేపటివారి సర్వప్రాంతముల గలసర్వ మానవుల సంక్షే మార్థము - దయాజలధియైన సర్వేశ్వరునిచే పుణ్యభారతమున నిక్షిప్తము గావింపబడిన నిధియిది. ఈ నిధికి వారసులమగుట మన మహాభాగ్యము. ఈ పవిత్ర సంపత్తికిగల అనంతశక్తిని సర్వదా సంస్మరించుచు సద్వినియోగ మొనర్చుట మన పరమ కర్తవ్యము.

గీత దేశ విదేశములన్నింట భక్తిభావముతో నిత్యపారా యణమును గావించుటకు యోగ్యతను బడసిన పవిత్ర గ్రంథ రాజము. ప్రాచీన నవీన కాలపరిగణన దీని విషయమున పాటింప బడలేదు. పాటింపబడదు. ఆర్ష సంస్కృతి సంభరితమైన-మహో జ్జ్వల దివ్యభావ దీప్తమైన - ఈ గీతా వైభవమును భువన వ్యాప్త మొనర్చిన పుణ్యపురుషు లెందరో గలరు. మహోద్ధ తితో సర్వప్రపంచమును చకిత మొనరించుచు, గంభీరమధుర ఘోషలతో గాన మొనర్చిన మహనీయు లెందరో గలరు.

ఈ భగవత్సందేశ సుధను మానవకోటిలో గల ప్రతి వ్యక్తికిని అందజేయ వలయుననెడి తహతహతో విశిష్టాద్వైత మత విశిష్ట లక్షణములను - లక్ష్యములను నిర్వచించుచు జనా దరణమును జూరగొనినట్టిది శ్రీ వైష్ణవమతము.

సులభముగ నరులను భగవదర్చనా పరులను - భగవ న్నామ సంస్మరణ తత్పరులను గావించుటకు శ్రీ వైష్ణవము సాగించిన కృషి అసాధారణమైనట్టిది. జీవలోకమునకు తారకము

పరమాత్మ కైంకర్య మొక్కటే. మూలమంత్రి ద్వయమంత్రి చరమ శ్లోకములు శ్రీ మహావిష్ణు కైంకర్యమున ప్రాధాన్య మును వహించుననియు శరణాగతి ఈసిద్ధాన్తమున అగ్రస్థానము నాక్రమించిన విశిష్ట విధానమనియు శ్రీ వైష్ణవము సకల ప్రజల కుద్బోధించి వివరించినది. సకల జనాభినందన పాత్రములు-సర్వజనాకర్షణ దక్షములు నగు నియమ నిబంధనములను నిర్దుష్టముగ గర్భిత మొనర్చుకొని శ్రీ వైష్ణవము భారతీయుల తాత్త్వికదృక్పథమునకు మంచి జవమును, జీవమును, తేజస్సును, ఓజస్సును దండిగ సమకూర్చినది.

మహత్తర భక్తిభావ పరిపూర్ణ చిత్తవృత్తితో రంగనాథ స్వామిని సేవించి - ఆ స్వామిలోనే లీనమైన ఆండాళ్ జీవిత వైభవమునుగూడ శ్రీ వైష్ణవ దివ్యసిద్ధాన్త ప్రాశస్త్యమునకే ప్రబల సాక్ష్యము. ముప్పది పాశురములు రచించి శ్రీవైష్ణవ భక్తి పారవశ్యమున జన్మచరితార్థమునకై శ్రమించిన మహాత్మురాలు-శ్రీరంగనాథుని యంతరంగ భక్తురాలు ఆండాళు. ఆమె వైష్ణవ భక్తశ్రేణిలో నగ్రేసరురాలు. ఆండాళ్ వలెనే వేద ధర్మ క్రమమును గౌరవించుచు - పలువురు మహనీయులు పలు తెఱగుల మానవకర్తవ్య ప్రబోధమునకు గడంగి జగద్భద్రతకు సముద్యుక్తులయిరి. వారిని మహాప్రవక్త లనవచ్చును. మహాకవులనవచ్చును. వారు ప్రవచించిన వాక్కులలో భావ శుద్ధి - వైదిక ధర్మానుష్ఠానపరత - భగవచ్చింతనానురక్తి

పుష్పములుగ వెల్లివిరిసినవి. కమనీయ కావ్యములుగా - రమణీయ ప్రబోధములుగా జనగణముల నలరించిన-అలరించుచున్న ఈ దివ్య చైతన్య సంవిలసిత సారస్వత ఖండములన్నియు సాధక లోకమునకు స్తవనీయములే కాగలవు.

శ్రీరామకర్ణామృత - శ్రీకృష్ణకర్ణామృత - ముకుంద మాలాదులవలె కేవల పరమేశ్వర సంస్తుతికే పరిమితములై యుండక మానవ వైఖరులను తీర్చిదిద్దుటకు పలుతెఱగుల నుపకరించెడి తిరుప్పావై - తిరువెంబావై యనునవి తమిళనాట నిత్యస్మరణీయములై నిలిచిన పవిత్రగ్రంథములు. తిరుప్పావై మానవులలో అవిచ్ఛిన్నభక్తి భావధారను పొరలింపజాలిన వస్తుమహిమ గలది. అకుంఠితనిష్ఠను - నైతికదీక్షను - న్యాయతత్పరతను - నిత్యకృత్య నిర్దుష్టతను మానవునిలో నెలకొల్పు నిమిత్తమే ఈ గ్రంథమున మహోజ్జ్వల ప్రబోధము సంఘటింప బడెననుట నిర్వివాదాంశము.

అన్న ధర్మోద్ధరణ మొనరించి - అనుపమానమైన ఆత్మశక్తిని సమకూర్చి - ప్రాక్తన సంస్కారబల సమన్వితులను గావించి - నరులను తరింపజేయుటకు తిరుప్పావై - తిరువెంబావై వంటి గ్రంథములు భగవద్దత్తములుగా మనకు లభ్యమైనవి. అవి మనకు లభింపజేయుచున్న సందేశబలము గణనకందునది కాదు. తత్త్వచింతనలో తనువులను ధన్యము గావించుకొని భవసఫలత నార్జించిన యోగమయ హృదయ శిఖరసీమలనుండి భూతలమున కురికిన పుణ్యగంగా జలాధారలవి.

"కలౌతు స్మరాణాన్ముక్తిః" అనెడి సూక్త్యను సారముగ నీ కర్మభూమి యందు తొలుత నుండియు భగవన్నామసంకీర్తనము పట్ల సాధకులొక ప్రత్యేకభక్తినే ప్రదర్శించుచు వచ్చిన మాట సత్యము. సంకీర్తనానందామృతము నాస్వాదించి పారవశ్య మున తరించిన వారెల్లరు భగవదనుభూతిని జూరగొననేర్చిన ధన్యులే. ఈ గడ్డపై బహుకాలము నుండియు దైవసంకీర్తనము పట్ల విజ్ఞులలో శ్రద్ధ క్షణక్షణము ప్రవర్ధమానమేమైనది. ఈ దేశీయులకు గల వైభవోపేత విశిష్ట లక్షణ మిది. నామ సంకీర్తన మొనర్చుచు - దివ్యానుభూతిని పొందుచు-సుఖానంద ముల ననుభవించుచు - దివ్యశక్తి నావిష్కరించిన పుణ్యాచరితు లెందరో యున్నారు. వారి యున్నత ప్రవృత్తి వలననే యీదేశ గౌరవాభ్యుదయ చరిత్రమున నూతనాధ్యాయము లారంభింప బడినవి. వారు సర్వవిధముల పవిత్రులుగ వ్యవహరించిరి. పలువురను పవిత్రులను గావింపగల వైఖరి నవలంబించి వ్యవహ రించిరి. నిర్దుష్టమైన వారి జీవనసరళి మానవాళికి మార్గదర్శక ముగా నిలిచినది. నీతిమార్గమున నరులను నడపుటకు సర్వదా హెచ్చరికవలె నుపకరించినది. ఈ దృష్టితో వ్యవహరించినంత కాలము భారతదేశము తన ప్రత్యేకతను తాను నిలుపుకొన గలిగెననుట నిక్కమే.

మహోద్ధతితో సర్వప్రపంచమును చకిత మొనరించుచు, గంభీరమధుర ఘోషలతో - ఈ ఉజ్జ్వలనదీముఖమును దురాశా

దాహదావానలముచే దపించుచున్న పశ్చిమఖండముల వంకకు ప్రవహింపజేసి - అచటి ప్రజల దప్పికను దీర్చి - తనియింప జేసిన పవిత్రభారత యోగికులచంద్రుడు వివేకానంద సంయమీంద్రుడు. భౌతికవాదవహ్ని జ్వాలల తాపముచే వాడియున్న అమెరికా సామ్రాజ్యలక్ష్మికి, పాశ్చాత్యప్రపంచమునకు ఈ యుజ్జ్వలనదీప్రవాహమే నవచైతన్యమును కలుగ జేసినది. ప్రజ్ఞానామృత ప్రసాదమును పంచిపెట్టి దాహశాంతిని కలిగించినది. దివ్యకాంతిని గన్పట్టజేసినది. భావపథమున మెదలినంతనే పారవశ్యమును సమకూర్చెడి - పావనత్వమును ప్రసాదించెడి దర్శనీయ దివ్యదృశ్యమది. ఆ మహాద్భుతపావన సంఘటనము భారతీయులయాధ్యాత్మిక జీవితచరిత్రయందే సువర్ణాధ్యాయము.

సనాతన ధర్మానురక్తితో - ఆధ్యాత్మిక దివ్యదృష్టితో సంచరించి నంతకాలము, భారతప్రజ తన ప్రత్యేకతను తాను నిలుపుకొనగలిగెననుట నిక్కువమే. ఈ యూహా నవహేళన మొనరించెడి వికృతస్థితి యేరీతిని ఎప్పుడిట నవతరించెనో ఇదమిత్థమని యెవ్వరు నిర్ణయింపగలరు ? మొత్తము మీద నేదో యొక అవాంఛనీయ పరిణామము వంకకు జాతిగమనము సాగించుటారంభించినదని విజ్ఞులు - అభిజ్ఞులు అయినవారు విశదీకరించుటకు వెనుకాడుటలేదు.

నరుని మనస్సు కోరికల పుట్టకావచ్చును. కోరికలుండ వలసినదే. కాని, వానినొక హద్దున నిలువరింపగల యాత్మబలము

సముచితమవసరము గదా! అంతయు ధన మహిమయే యను కొనుట వివేకవంతమయిన పనియా? మానవాతీతమైన యొక మహత్తరశక్తి యీసకల దిక్చక్రవ్యవహారసరళి నవలీలగ ద్రిప్పుచున్నదనియు – నరుడాదివ్యశక్తిముందు నతమస్తకుడై, మనుగడను మాన్యమొనరించుకొనవలయుననియు గుర్తింప వలదా? అట్టి భావన వలదా? ఈరంగమున నీయావద్వృత్తాంతముపై మనపుణ్యభూమి యందు కొనసాగిన కృషియేమి? ఫలసిద్ధి యెట్లున్నది? మొదలయిన యంశములనొక్క పరిపాఠకుల దృష్టికి దేవలయుననియే యీప్రయత్నమునకు గడంగితిని.

సకల ప్రాణికోటిలో మానవుడు విశిష్టుడు. యుక్తాయుక్త విచక్షణాజ్ఞాన మతనికున్నది. అతడన్నియును వినవలసినదే! విన్నవానిలో ఎన్నికగన్న యంశములపట్ల మన్ననజూపి, యోగ్యమగు తెన్నున జనుటకతడుద్యుక్తుడు గావలయును. ఈ యోచన నేటి భారతమున కెంతయో యవసరము.

ఈ ఆర్ష భావధారను పునరవలోకన మొనర్చుకొనుటకు సావకాశముగ బూనుకొనవలసిన తరుణమిది. ఈ దివ్యసందేశ లహరిలో సుస్నాతులై జాతీయులు చైతన్యమును మరల పుంజుకొనవలసిన సమయమాసన్నమైనదని కోవిదులెప్పటినుండియో యుద్ఘోషించుచున్నారు. ఈ 'వెలుగు దివ్వెలు" మాలిన్యసంకలితములగుట మానవతకే మహాపచారము. పరమ రమణీయమైన ఈ పవిత్ర ప్రబోధము వాడ వాడల ప్రతిధ్వనింపకున్న-

ఆత్మతేజము కలిగినదై జాతి ఆర్ష ధర్మపాలనకు కంకణము నెట్లు పూనగలదు ? ఈ 'సనాతన ధర్మజ్యోతి' వెలుగులో మనకపారలు మటుమాయము గావలయును. ఈ 'చైతన్యవాణి'ని ఎల్లరు శ్రవణ మొనర్చి మహోజ్జ్వల ప్రాక్తన సంస్కృతి సంప్రదాయ గౌరవాభ్యున్నతి కొరకై సాహసాత్మక కృషి నారంభింప నుద్యుక్తు లగుదురుగాక ! భావ కేదారములలో రుచిర తేజః ప్రపూర్ణములగు "పసిడిపంటలు" పండింతురుగాక ! పండించిన పంటలను క్షుధార్తులకు, పీడితప్రజానీకమునకు సముచితముగ నందించి, అతిథి సత్కార దృష్టితో ప్రేమపూర్వకముగ నాదరింతురుగాక !

నిస్తులమైన దయావిశేషముతో నిఖిల జగద్రక్షణార్థము బాధ్యత వహించిన నిగమధర్మ నిక్షిప్త నిధికి ఏనాటికేని నిజమైన వారసత్వము భారతీయులదే. ఈ "నిత్య సత్యవాణి"ని దిగ్దిగంతముల మారుమ్రోగింప భారతీయులు మరల దీక్షవహింతురు గాక !

యుగయుగములనుండి - తరతరములనుండి మాన్యులు పరమేశ్వరానుగ్రహ పాత్రులునగు మహర్షి పుంగవులు వెల్లివిరియించుచు వచ్చుచున్న యీ "ఉజ్జ్వల తరంగిణి"ని సర్వవిధముల సంరక్షించుట మనలను మనము రక్షించుకొనుటయే కాగలదు. ఈ పరమార్థము మన భావనా పథమున నిరంతరము నిలుచుగాక ! ఈ సందేశ భారతి" సర్వజన సంక్షేమ

ములు ప్రసాదించి, విశ్వమునే పునర్నవచైతన్య సంవిలసిత మొనర్చుగాక! భావికాల భారతపౌర భావసంక్రాన్తిరేఖలలో శాంతిజ్యోత్స్న సర్వదా సముద్భాతమై, స్థాయి - హాయి సాక్షాత్కరించుటకు వర్తమానకాల కృషి వజ్రసదృశ పథకమై ప్రకాశించుగాక !

సకలయోగములకు పుట్టినిల్లుగ విలసిల్లెడి గీతావతరణ ముతో ప్రారంభింపబడిన యీ "ఉజ్జ్వలతరంగిణి" వైష్ణవమత ప్రాశస్త్యపు పొంగులతో విశ్వరూపమును దాల్చినది. శైవ వైష్ణవ భక్తి సంప్రదాయముల లోతులను కడముట్ట తడవి చూచి భగవన్నామ సంకీర్తనామృత మహిమల నిగ్గులను దేల్చి సమీచీనదృష్టితో సమన్వయము గావించినది. తరతమ భావములకు తావులేని పరిధుల నేర్పరచి విస్పష్టగ విశదీకరించినది.

ఇట్లు వర్థమానదశనందుకొని తిరిగి భక్తి జ్ఞాన కర్మధ్యాన యోగముల కలయికతో పూర్ణయోగముగ పరివర్తితమైన - గీతాయోగమున లీనమైన-ఉజ్జ్వల నదీముఖ సదృశముగ రాణిం చిన వివేకానందుని దివ్యజీవిత వైభవ ప్రాభవముతో పరిస మాప్త మగుటొక విచిత్రము. ఇది యిట్లగుటయు సర్వేశ్వర సంకల్పమే. ఉత్తుంగ పవిత్రభావ భంగిమల కాకరమై-సర్వాంగ సుందర సనాతన సంస్కృతి కాస్థానమై వెలుగొందిన భార తీయుల తాత్త్వికోజ్జ్వల భావతరంగిణి యిది.

ఈ సృష్టి యొనరించుటెట్లు ? ఈరచన సాగించుటెట్లు? అఖండజ్యోతిగ ప్రదీపించెడి యీభావ సంపత్తికొక క్రమము నేర్పరచి, యెంత యుదాత్తముగ వివరింపనెంచినను ఫలితము నెంతవరకందు కొనగలమో ?

ఎంత వివరించినను మరెద్దియో మిగిలిపోయి యుండు ననెడి యసంతృప్తి యెవ్వరినేని వదలజాలదు. అయినను క్షణ క్షణ పునఃపునః పరిశీలనము గావించుకొనుచు తగినంత శ్రద్ధ వహించి యీ భావచిత్రణ మొనరింప కృషి సాగించితిని. నా యత్నమున నేనెంతవరకు సఫలీకృతుడనైతినో ! కోవిదులు నిర్ణయింపవలసియున్నది. నేను తొలుత పేర్కొనిన పగిది – ఈ దేశమునందేర్పడవలసిన మహత్తర ప్రయోజనసాధనలో – నా యీ గ్రంథరచన కొలదిగనేని, యుపయోగకారియై నిల్చుచో – ఇంక నాకు వాంఛింపదగినదేమున్నది ? "ఉజ్జ్వల తరంగిణి" అట్లుపకరించుగాక ! భారతీయులతాత్త్విక దృక్పథ విశదీకరణలో నావాక్కు గావించెడి సేవ ధన్యమగుగాక !

భారత భారతి పవిత్ర సంభారభారమున సర్వదా భాసుర మగుగాక !

కోరినంతనే "ఉజ్జ్వలతరంగిణి"ని ఆమూలాగ్ర ముగ పఠించి, వారి యూహలతో నిందలి వస్తువిశేషమునగల యౌచిత్యమును వివరించుచు తమ యమూల్యాభిప్రాయముల నందించిన పండితులు – కవులునగు మహాశయులు శ్రీదివాకర్ల

వెంకటావధాని, శ్రీమత్తిరుమలగుడిమెళ్ళ వరదాచార్యులు, శ్రీమాన్ నేలటూరి భక్తవత్సలం, శ్రీమాన్ రత్నాకరం శ్రీనివాసాచార్యులు, శ్రీమాన్ బృందావనం రంగాచార్యులు గార్లకు నాహృదయపూర్వక వందనములు. గ్రంథరచన సాగుచున్న కాలమున శ్రోతలుగనుండి – సముచితములయిన సవరణలు సూచించుచు సర్వవిధముల నీ గ్రంథసముద్దీపనకు సహకరించిన సహృదయమిత్రులు – ఆయుర్వేద వైద్యులు – అమృతహస్తులు – శ్రీమాన్ రత్నాకరం శ్రీనివాసాచార్యులు గారు (సత్తెనపల్లి), నిరంతరము నారచనలకు సన్నిహిత సహాకారము నందించుచు సర్వవిధముల తోడ్పడుచున్న మహాపండితులు, మధురకవి శ్రీమాన్ బృందావనం రంగాచార్యులు గారు (పరుచూరు) :– వీరిరువుర మైత్రీభావనకు నాహృదయపూర్వక ధన్యవాదములు.

ఈగ్రంథ ముద్రణము నిర్దుష్టముగ కొనసాగుటలో విసుగుజూపక – విశ్రాంతిని గోరక – నిర్విరామముగ శ్రమించి సహకరించిన మిత్రులు పండితులు శ్రీ తుమ్మల వెంకటరత్నం గారికి నాహార్దికాభినందనములు. సమర్థవంతమగు వారి కృషియే లేకున్న నీ గ్రంథ మీరూపమును దాల్చెడిది గాదేమో! నాయెడగల ఆదరాభిమానములతో స్వీయకార్యమును గూడ విడిచిపెట్టి వారు గావించిన నిస్స్వార్థ కృషికి కృతజ్ఞుడను.

చిత్తుప్రతిని ముద్రణానుకూలముగ వ్రాయుటలో - ప్రూఫులు దిద్దుటలో - సహనముతో సహకరించుచు-ఈగ్రంథ ముద్రణము పూర్తియగువరకు సర్వవిధముల నాకు చేదోడు - వాదోడుగనున్న చి॥ కొడాలి లింగయ్యకు (మోపర్రు) నా ఆశీస్సుల నందించుచున్నాను.

ఈగ్రంథమును త్వరలో-చక్కగ ముద్రణచేసి యిచ్చిన జూపిటర్ ప్రింటింగ్ ప్రెస్, (అరండల్ పేట 7వ లైన్) అధినేతలు శ్రీ ముదిగొండ చంద్రమౌళిశర్మగారికి నాహృదయపూర్వక కృతజ్ఞతను వెలిబుచ్చుచున్నాను.

"ఇతి శమ్"





భగవద్భక్తులు - ఆదర్శ గృహస్థులు

గ్రంథకర్త జననీ జనకులు

**వెంకమాంబా సుదర్శనార్యులు**

ఓమ్

"సంకీర్త్యమానో భగవా ననంతః
శ్రుతానుభావో వ్యసనం హి పుంసామ్
ప్రవిశ్యచిత్తం విధునోత్యశేషం
యథా తమోఽర్కోఽభ్రమివాతివాతః"

# గీతావతరణము

భగవానుని వరప్రసాదఫలముగ సకలప్రాణికోటిలో సర్వోత్కృష్టముగ విలసిల్లునది మానవ జీవితము. దయామయుడైన పరమేశ్వరుడు తదితర భూతజాలమున కలభ్యమైన మహత్తర జ్ఞానధనమును, చైతన్య భాగ్యమును మానవాళి కందించినాడు. జ్ఞానచైతన్య బలవిషయమున నరులు పశుపక్ష్యాదులకన్న భిన్నమైన యొకానొక విశిష్టవిధానమున వ్యవహరించి లబ్ధమైన సదవకాశమును సద్వినియోగ మొనర్చు కొనవలసి యున్నది. మనుగడను ధన్య మొనర్చుకొనవలసి యున్నది. అట్లు

కానినాడు సర్వేశ్వరుడాదరణ భావముతో నొసగిన యీజ్ఞాన ధనము మానవుని చేతిలో— ఉన్మాదిహస్తమునగల కనక ఖండము వగిది నిరర్థకమే కాగలదు. చైతన్యము విచక్షణా దృష్టికి చిహ్నము. మానవునిలో విచక్షణా దృష్టిలోపించినచో వివేకవైభవము లుప్తమయినచో నతని కైవసముగావింపబడిన చైతన్యమర్థరహితమైనట్లే. కావుననే మానవుడు సర్వదా మానవతను పెంపొందింపు కొనుచు విలక్షణ గుణ గరిష్ఠుడై వ్యవహరించవలయును.

జీవితము సంకుల సంఘర్షణల కాలయమనెడి మాట వాస్తవమే. అరిషడ్వర్గము నిరంతరము మానవుని ప్రలోభ పెట్టుచుండు ననుమాటయు సత్యమే. తృష్ణాప్రవాహమున ఒడ్డు [illegible]నకు చేరజాలక మనుజులు కొట్టుమిట్టాడు చుందురనుమాటయు యథార్థమే. వీనిని కాదనజాలము. కాని వీనిని మించినది మానవతాధర్మపరిరక్షణ. ఆదృష్టిని నరుడెన్న డును గోల్పోవరాదు. ఆతత్త్వము నెప్పుడును విస్మరింపరాదు. అవధుల నెట్టి పరిస్థితులయందును నతిక్రమింపరాదు. ఇవి మానవుని ప్రత్యేక బాధ్యతలు. విధులనుండి వైదొలగి విచ్చల విడిగ విహరించుట వెఱ్ఱితనము. కర్తవ్యపథమున కేవల యాత్రి కునివంటివాడు మానవుడు. కర్మలను విసర్జించి, ధర్మము నతి క్రమించి చరించుట మనుగడను ప్రసాదించిన భగవంతునిపట్ల ద్రోహాపచారమే కాగలదు. కర్మభూమియు ధర్మసీమయునగు

భారతదేశమునం దనాదిగ నీసిద్ధాంతము పాదులుగట్టుకొని వ్రేళ్ళుదన్నుకొని వటవృక్షముపగిది నెదిగి యెల్లర దన శీతలచ్ఛాయల సేదదేర్చుచున్నది. తద్భావ ప్రచారమునకే యవతారపురుషు లుదయించిరి. తద్ధర్మప్రబోధమునకే మహాత్ములు నడుముగట్టిరి. తత్సిద్ధాంతవిస్తృతి కొరకే ఆర్షవాణి ప్రతిధ్వనించినది. తత్ప్రయోజనసాధనకే దివ్యగ్రంథము లెన్నియో ఆవిష్కృతము లయినవి.

భగవద్దత్తములుగా నర్చింపబడు వేదములు మొదలుకొని యెన్నియో గ్రంథము లార్షసారస్వతమున- గీర్వాణమున వెలుగులీనుచు యుగధర్మముల గాపాడుచు సకలమానవకోటిని సంరక్షించుచున్నవి.

మానవజీవితవికాసమే ధ్యేయముగా మానవుని ధర్మాచరణపరాయణుని గావించుటే పరమలక్ష్యముగా మానవత ఫలింపజేయుటే యేకైకాశయముగా మానవుని ధన్యతమునిగా పురుషోత్తమునిగా తీర్చిదిద్దుటే మహాదర్శముగా- భారతీయ సారస్వతజలధి పరవళ్ళుద్రొక్కినది.

మానవజీవితమును సర్వతోముఖముగ రాణింపజేయుటలో భగవద్గీతస్థానమగ్రగణ్యమైనట్టిది. ఉపనిషత్తులు వేదసారసర్వస్వముగా ప్రఖ్యాతినందుచుండ- గీత యుపనిషత్తుల సారముగా కీర్తింపబడుచున్నది. ఉపనిషత్తులు "వేదాంతము" అనుపేర సార్థకములైనట్లే ఉపనిషత్సారసర్వస్వమైన 'భగవద్గీత'

అనుష్ఠానవేదాంతముగ నభినందింపబడుచున్నది. గీతావతరణ మొకమహాద్భుత సన్నివేశము. పరమపావనసంఘటనము. మానవుని మానససరోవరమునుండి యావిర్భవించెడి తరంగములలో–ఆవేదన–భావము–ఇచ్ఛ– అనునవి యెన్నియో అంత ర్గర్భితములై యుండుననిప్రాచీన కాలముననే భరతఖండమున గల మనస్తత్వశాస్త్రవేత్తలు, తాత్త్వికులు నిర్ణయించి యున్నారు. తరంగబృందము కలిసియే ప్రవర్తించుచుండును. వీనిని విడదీయ వలనుపడదు. ప్రతితరంగమునందును పైన పేర్కొనబడిన – ఇచ్ఛ–ఆవేదన– భావము లనునవి హెచ్చు తగ్గు మోతాదులలో విధిగా నుండును. ఏతరంగ మెప్పుడు ప్రకోపించిన నపుడది యాపేరుతో వ్యవహరింపబడుచుండును. మనస్సునే విశేషముగ స్పృశింప జాలిన తరంగమును భావ మందుము. హృదయము నధికముగ స్పృశింపజాలిన తరంగమును ఆవేదనయందుము. అంతరంగమున హృదయమును, మనస్సును సమానముగ స్పృశింపజాలిన తరంగమును సంకల్పము లేక ఇచ్ఛ యనిపిలుచుచుందుము. తరంగము లనగా మానవ ప్రవృత్తిలో బాహ్యాప్రపంచమునకు ప్రకటన మయ్యెడికర్మలే. ఈ కర్మ లన్నిటికి జీవాత్మతో సంబంధముండును. కర్మలులేక తరంగములు–కొన్నిమాత్రము సర్వసాధారణముగ మనస్సుయొక్క– ఉపరితలమునుండియే వెలువడుచుండును.

మఱికొన్ని తరంగములు (ప్రవృత్తులు) అగాధమైన మనస్సునుండి వెలువడుచుండును. అవి మిక్కిలి బాధా

కరములు. వీనిస్థితి యట్టిది. ప్రకృతితో సంబంధము గలిగి యుండవలసిన జీవాత్మ ఆకాశహర్మ్యములలో నివసించుచు గగనసుమసుగంధమునాఘ్రాణించుచు, మధురమైన యూహా గాన మొనర్చుచు నిట్టితరంగములమధ్యనే జీవించుచుండును. జీవాత్మ యెన్నడును దుష్టభావసమన్వితముగ నుండరాదు. అట్లు జరిగిన సత్యాసత్యవివేకము జీవికి లోపించును; అహంకార మతిశయించును. కామక్రోధాదులయాట జోరుగ గొన సాగును. జీవు డప్పుడు సంసారసముద్రమున చుక్కాని లేని నావవలె నటునిటు సంచరించుచుండును.

నిజస్వరూపమునే మరచి చిక్కులలో దగుల్కొనును. సంసారపంకమున జిక్కువడి విధ్యుక్తధర్మమును విస్మరించి విశృంఖలముగ విఱ్ఱవీగును. పలుబాధలకు గుఱియగును.

ప్రాచీనకాలభారతదేశమున కఖండకీర్తి ప్రతిష్ఠ లొనగూడుటలో నెంతయో నిగూఢార్థమున్నది. దీనికెన్నియో కారణములు కలిసివచ్చినవి. పురాతనభారత వైభవప్రాభవ మట్లు మహోన్నతదశకు జేరుకొనుట కెందఱెన్నియో తెఱగుల పరిశ్రమించిరి.

నాడొకవంక ప్రసన్నప్రశాంత ఋష్యాశ్రమములు–మునిచంద్రుల దీర్ఘకాలతపోదీధితులు దేశము నేకాక విశ్వమునే విస్మయమునముంచి తేల్చుచుండెడివి. ప్రజ్ఞావంతమైన ప్రబోధ బలముతో శిష్యకోటుల నెల్ల సిద్ధపురుషులనుగా మలచెడి మహో

ద్యమమునకు కేంద్రములై విజ్ఞానభిక్షను గురుకులములు నాడొ
సగుచుండెడివి.

నిరంతరప్రవాహవేగమున ధరణీమతల్లిని పులకింపజేసి సస్యశ్యామలముగ కళకళలాడజేయుచు నలుగడలకు వలయు పంటసిరిని పుష్కలముగ నందించుచు జీవనోపాధికి గొఱత లేని తెఱగున లోటుదాని విధమున నదులు సాయపడుచుండెడివి. భౌతికవాంఛలపట్ల క్రమముగ నేవగింపును గలిగించుచు విశాల విశ్వప్రకృతిసౌందర్యదర్శనసంజాతపారవశ్యమున భగవద్భక్తి తత్త్వమును మేళవించి పాఠములు ప్రవచించుచుండెడివి. పుణ్యప్రదములయిన పవిత్రతీర్థరాజములు సకలకళ్యాణగుణపరిపూర్ణుడైన సర్వేశ్వరుని ప్రతిబింబములకు నిలయములై పవిత్రత నలవఱచి పాశవికతను కరగించి దివ్యత్వమును తేజరిల్లజేసి మానవులను మహర్షులనొనర్చి-చరితార్థుల గావించి-ఆనందసంధాయకములై యలరారెడివి దివ్యదేవాలయములు.

మహాద్భుత తేజోవిశేషమున మనుగడ సాగించుచు - భారతీయ దివ్యతత్త్వశాస్త్రసుధను దార్శనిక దివ్యదృష్టులను పలువురకు బంచియిచ్చు ప్రబోధకులై యాత్రలు సాగించుచుందురు మహాత్ములు. వీరెల్లరు నీ దేశ గౌరవాభ్యుదయమునకు పతాకలు. భారత మాతృ మహోజ్జ్వల మహిమలకు బ్రతీకలు. ఇవి యున్నియు నేడిట్లు యున్నవా! యనుట సందేహాస్పదము.

కొన్ని యదృశ్యములై పోయినను భాగ్యవశమున మఱికొన్ని మాత్రి మట్లే నేటికిని సుస్పష్టముగ గోచరించుచున్నవి.

గ్రంథము లున్నవి- దేవాలయము లున్నవి-తీర్థరాజము లున్నవి.- గురుకులముల ఛాయ లింకను గొన్ని యున్నవి. మహనీయులు కొలది సంఖ్యలో నింకను మిగిలియున్నారు. మనకు గల పవిత్రపుణ్యక్షేత్రములలో జ్యోతీశ్వర మొకటి. ఇది కురుక్షేత్రమునకు సమీపమునగల స్థానేశ్వరమునకు సుమారు మూడుమైళ్ళ దూరమునందున్నది. ఇందొక బ్రహ్మాండమైన వటవృక్షముగలదు. నేటికి నిది సజీవముగనే యున్నట్లు విజ్ఞు లనుచున్నారు.

'జ్యోతీశ్వర' మన- ఈశ్వరసంబంధ దివ్యతేజ మని సుస్పష్టముగనే యర్థమగుచున్నది. ఈ భూభాగమునకు పుణ్యక్షేత్రముల చరిత్రలో నొక ప్రత్యేకస్థానమున్నది.

శ్రీకృష్ణపరమాత్మ పార్థునకు గీతను ప్రబోధించిన పావన సీమ యిది. అర్జునుడు ఘోర తపోబల సంపన్నులైన సంయమీశ్వరులకే యలభ్యమగు శ్రీమన్నారాయణమూర్తి విశ్వరూపమును శ్రీకృష్ణానుగ్రహమున నిచటనే తిలకింపగల్గెను. తత్కారణముననే యీ దివ్యభూమి కొక యుజ్జ్వలస్థాయి చరిత్రిలో శాశ్వతముగ నిల్చియున్నదనుట సత్యము. ఈ క్షేత్రమునగల వటవృక్ష సమీపముననే నిర్మల జలపూర్ణమైన సరోవర మొకటి యనాదినుండియు సుప్రసిద్ధముగ నున్నది. ఈ

సరోవరమునందొక యనిర్వచనీయమహాతేజము సర్వదా కన్ప ట్టుచుండును. మహోజ్జ్వల విశ్వరూప ప్రదర్శనానుకూల పరమ పావన రంగస్థలముగావలసిన యదృష్టముండుటవలన సృష్ట్యాది నుండియు నీతేజమిట్లే యీ సరోవరమున వెలుగులీనుచున్నదో! కాక సకలలోక విభ్రాంతిజనకము – సర్వపాపహరణక్షమము – సమస్త ధర్మసంరక్షణచణము – సవ్యసాచి భాగ్యఫలమునగు 'విశ్వరూపము' ప్రదర్శింపబడినతఱి నా పరిసరముల బ్రసరించిన వెలుగువెల్లువలలో మునిగిన సరస్సు గనుక – విశ్వరూప ముపసంహరింపబడిన యనంతరముగూడ నాటినుండి యీ వెలు గట్లే నిలిచి పోయెనో! ఎవ్వరీరహస్యమును భేదింపగలరు? ప్రత్యక్షసాక్ష్యముగ నేటికిని నిలిచియున్న సరోవర దివ్యతేజము మాత్రము దర్శించువారి యెడందలలో నపూర్వ భక్తి ప్రపత్తు లను సర్వదా మొలకెత్తించుచునే యున్నది. ఈ కొలనిపై సూర్యకాంతియు ప్రసరింపజాలకుండు టొకవిశేషము.

కొందరు నవీనుల కివియన్నియు విడ్డూరములుగఁ దోప వచ్చును. కాని! వాస్తవాంశములను జెరిపివేయుట కెవరితర మగును? ఒక మహత్తర దివ్య సంస్కృతికి వారసత్వము వహించి మనుగడ సాగించుచున్న భారతజాతి యపూర్వ గౌరవాదర ముల నవనిపై నెల్లవేళల నందగల్గుటకు మాత్ర మిట్టి యుజ్జ్వల సన్నివేశములే కారణభూతము లనుట తథ్యము. సూర్యకాంతిని సైతము తనపై బ్రసారితము గానీయక స్వీయ దీధితులతో

నుత్తమోత్తమముగ వర్ధిల్లుచున్న యీ సరోవరచరిత్ర భారతీయులకు గర్వకారణముగాదా? శిరోధార్యముగాదా?

రాజ్యాధికారదాహము వెఱ్ఱితలలువేయ - దురాశతో సహోదరులనే సర్వనాశనముగావింప భ్రాతృమమకారమునకు తిలోదకములిచ్చి కురుచక్రవర్తి ఘోరసమరమునకు బూనుకొనినాడు. ప్రేమానురాగబంధములు తెగిపడినవి. దయాదాక్షిణ్యములు తిరోగమించినవి. గౌరవమర్యాద లంతరించినవి. మానవధర్మమే మంటగలసినది. సత్యము నిస్తేజమైనది. ఇట్టితఱి పదమూడేండ్లు కానల కడగండ్లపాలై భరింపరాని వ్యథలను ధర్మబలమున సహించి మరలివచ్చిన పాండవులు గత్యంతరము గన్పింపక - కానున్నది కాకమానదని యుద్ధసన్నద్ధులైరి.

ధర్మసంరక్షణకు దీక్షవహించిన శ్రీకృష్ణుడు సాగించిన ప్రయత్నములన్నియు విఫలములయినవి. సుయోధనుని రాజ్యాకాంక్ష హద్దులు దాటినది. పార్థునిచేత ధర్మధ్వజమెత్తింపదలచినాడు కృష్ణుడు. ఆ ధార్మికశక్తులనన్నిటిని సవ్యసాచిచే సూచకొత్త గోయింపదలచి సర్వసన్నాహములు గావించినాడు.

ఉభయ సేనాపారావారము లొడ్డులొరసికొని ప్రవహించినవి. అట్టితరి శ్రీకృష్ణుని రథసారథిగ నిడుకొని ధర్మదేవతకు గలిగిన విపత్తును దొలగించు నిమిత్తము దేవదత్త మొత్తి గాండీవమెత్తి కదనరంగమున కాలిడి అర్జునుడు తొలిసారిగా

ప్రతిపక్షుల నెల్లర గలచుజూచినది యీ కురుక్షేత్రమునందే- ఈ జ్యోతీశ్వరతీరమునసే.

రణరంగమున దనకభిముఖులుగనున్న వారెల్లరు నాత్మీయులే. అందఱు బంధువులే. వారిలో తనకు పూజ్యులున్నారు. ప్రేమభావమున జూడదగిన వారున్నారు. వాత్సల్య మొలికింప దగినవారున్నారు. తాత భీష్మాచార్యులు గురువు ద్రోణాచార్యులు ధనుర్ధారులై యున్నచోట తానుబాణమూనుటయా! వారి యనురాగమును దానెట్లు కొలువగలడు? వారి యపూర్వప్రేమప్రకటనకు దాను జూపెడి కృతజ్ఞత యిదియా? కనీసపు ధర్మమునేని గణుతించుటకు వీలుపడని తనకర్తవ్యమున కర్థమేమి?

ఇట్టి యాలోచనలు పాండవమధ్యమునిలో నుప్పొంగినవి. ప్రతిపక్షమునందున్న పెద్దలను బంధువులను సందర్శించినంతనే మేనెల్ల గగుర్పాటుగాంచినది. మనస్సునందొక యనూహ్యమైన యీ వేదన యావిర్భవించినది. స్వజనహననమును మనస్సు తీవ్రముగ వ్యతిరేకించెను. రాజ్యసిద్ధియనెడి యాశ వంకకు భావము పరుగులు దీయుటలేదు. శరీరము స్వాధీనమునందున్నట్లు దోచుటలేదు. ఎన్నడులేని - రాని - పిరికితనమేదియో తన్నావహించినట్లాయెను. దేహమున స్వేద మంకురించినది. హస్తమునుండి గాంఢీవము మెల్లగ జారినది. యుద్ధసన్నద్ధుడుగా నున్నవానిలో క్షణకాలమున నిట్లు యుద్ధపరాఙ్ముఖత యేర్పడినది. పదమూడేండ్లకాలపరిధిలో భావనకందని బాధ

లనుభవించుచున్న పాండవులపట్ల కౌరవుల కేర్పడని కరుణా-
కనుమూసి తెఱచునంతలో కౌరవులపట్ల గాండీవి కేర్పడినది.

దీనిని భారతీయ సనాతన ధర్మమహిమ యందమా? జ్యోతీశ్వర స్థానమాహాత్మ్య మందమా? నరనరములబట్టి జీర్ణించిపోయిన యుత్తమోత్తమమైన సంస్కృతి ప్రభావ మందమా? ఏమందము? ఏమనిన నేమి? పార్థుడు ప్రధనమునకు పరిపూర్ణముగ వ్యతిరేకియైనాడు.

తాను సకలబంధుహిత మారణకారణమైన రణమును గావింపనని నిశ్చితార్థమును బ్రకటించినాడు. అర్జునుడంతటితో నాగక - సమరము సముచిత కార్యము కాదని, గొప్ప విజ్ఞాని పగిది గోవిందునెదుట ధర్మముల నేకరువు బెట్ట గడంగినాడు.

శ్రీకృష్ణుని యెదుట దానట్టి యత్నమునకు బూనుకొనుట తగునా! తగదా! యనెడి విషయమును సైత మర్జునుడు విస్మరించినాడు. క్షాత్రధర్మవిరుద్ధమైన దౌర్బల్యము, విషణ్ణస్థితి పార్థునిలో స్పష్టముగ ప్రతిఫలించుట గని శ్రీకృష్ణుడు విస్తుపోయినాడు. తాదృశస్థితి అర్జునునిలో సముత్పన్న మగుటే యొక దీనాతిదీన పరిస్థితి కాగా - ఆస్థితి సంగ్రామరంగమధ్యమున సర్వము సంసిద్ధమైనతఱి నేర్పడుట శ్రీకృష్ణునకు లజ్జాకరముగ దోచెనేమో! లజ్జ యనువిషయము నట్లుండనిండు. శత్రుభయంకర సంకుల సమర నిర్వాహణ చతురుడు శరణాగత స్థితికి దిగజారుటే మిటి? జరుగవలసిన ప్రదర్శన మంతయు ముందే

యున్నది. పరిధానపాత్రధారియే రంగులు గడిగికొని పారిపోవ నుద్యుక్తుడైన నిక నాటకము చరమాంకమున కెట్లుచేరగలదు? ఫలితము నెట్లు సాధింపగలడు?

పదునెనిమిది యక్షౌహిణుల సంఖ్యగల వీరాధివీరులగు సైనికులతో నా ప్రాంతమంతయు భయంకరముగ గన్పట్టు చున్నది. అతిరథులు మహారథులు సర్వాస్త్రశస్త్ర విద్యానిపు ణులు సమర సన్నద్ధులై యుభయపక్షముల నిలిచియున్నారు. సైనికుల జయజయ ధ్వానములు సైన్యాధిపతుల శంఖారావ ములు వీరోచిత గాథాగానములు మిన్నంటుచు వినువారి గుండెల వ్రయ్యలొనర్చుచున్నవి.

సమయ మిది! సవ్యసాచిపరిస్థితి యది! సారథిగనున్న కృష్ణుడేమొనర్పవలెను? రథికుడుపూర్ణ విషాదమున మునిగి యున్నాడు. అర్జునవిషాద యోగమారంభమైనది. తాత్త్వికభావ గర్భితములైన పలుకులతో నర్జునుని భావోద్రేకము నుపశమింప జేయవలెనని కృష్ణుడు యోచించుచున్నాడు. ఉభయ సైన్యముల మధ్యరథము నిల్లెంతకాలము నిలిపియుంచుట? పరు లీవిషాద మును పసిగట్టిరేని భద్రత యుండునా ?

'పార్థా!' అని సంబోధించినాడు. ఈ సంబోధన మాతృ సంబంధమైనట్టిది. ఇది భావగర్భితమైన సంబోధన. తల్లిమాట గుర్తునకుదెచ్చి – ఇంతకాలమునుండి కుంతి యనుభవించుచున్న ఘోరకష్టములను సమూలముగ నీరణకారణముగా నిర్మూలింప

వలసిన బాధ్యత తనయుడవైన నీపై గలదనెడి హెచ్చరిక కీసంబోధన చిహ్నము. అర్జునుని మనఃప్రవృత్తిని హృదయ స్పందనస్థితిని స్పష్టముగ గుర్తించియే శ్రీకృష్ణుడిట్లు సంబోధించెను.

అఖండ పౌరుషవాహిని యింకిపోయి అర్జునునిలో అను కంపాస్రవంతి పెల్లుబుకుచున్నతరుణమది.

శ్రీకృష్ణుని సంబోధనమును వినియు విననట్లుగనే యర్జునుడు వ్యవహరింపదొడగినాడు.

"కృష్ణా! యుద్ధమొనర్పజాలను. విజయాభిలాష నాకు లేదు. భోగములు నాకు వలదు. సుఖమును నేను గోరను. జీవితాశయు నా కహితమే. కలిసిమెలసి జీవించుచు మనుగడ సాగించుటే నాకిప్పు డభిమతము. బంధువులను వధించెడి నీచ కృత్యమునకు నేనొడిగట్టజాలను."

తరువాత నర్జునునకు నోటమాటయే రాలేదు. మౌనము వహించినాడు. రథముపై కూలబడినాడు. కర్తవ్యనిర్ణయము గావింపలేని స్థితి యది.

యుద్ధరంగమునందిట్టి స్థితి ప్రమాదకరము. శరీరాంగ మొకటి శిథిలత జెందవచ్చును. యుద్ధరంగమున మహావీరునివలె మరణింపవచ్చును. కాని! యుద్ధరంగమున నియమములు వదలి, లక్ష్యమును మఱచి, వీరత్వమునువీడి, వ్యవహరించుట ఘోర ప్రమాదమునకు హేతువు.

అర్జునున కదియె సంభవించినది. ఇప్పు డర్జును డుద్ధరింప బడవలెను. రణరంగమునుండి రథము మరొకవంకకు మరలింప బడినది. పార్థసారథి సవ్యసాచికి జీవితరథసారథియై నిలిచినాడు. కేవలరథసారథి మాత్రమే కాక అర్జునునకు శ్రీకృష్ణుడు మార్గ దర్శకుడు గూడ.

యుద్ధరంగమునందే కాక జీవితరంగమునగూడ శ్రీకృష్ణు డర్జునకు మార్గదర్శకుడే. కృష్ణు డర్జునున కాప్తబంధువు. జీవిత మనెడి యుద్ధభూమిలో - అరిషడ్వర్గముతో పోరాడుచు జయమునందజాలక శ్రమించువారి కందఱికి, నమ్మినవారి కందఱికీ శ్రీకృష్ణుడు మార్గదర్శకుడే.

ఆయనమార్గము ననుసరించి సర్వవిధముల భక్తిశ్రద్ధ లతో సంచరించువారి కందరికి నతడాప్తబంధువే.

కావున నర్జునుని విషాదము నంతరింపజేయవలసినదే యనెడి నిర్ణయమునకువచ్చినాడు శ్రీకృష్ణుడు. అట్టి మహో దాత్తసదాశయముతో భగవద్గీతావతరణము జరిగినది. అది యర్జునికే కాక క్లిష్టసమస్యలనెడి లంపటలలో దిక్కుదోచక చిక్కుపడియున్నవారి విషాదముల నన్నింటిని దుడిచివేయ జాలినది.

సకలధర్మశాస్త్రములసారమై సకలోపనిషత్తుల సారమై సర్వధర్మమర్మప్రబోధకమై శ్రీకృష్ణముఖపద్మమునుండి వెలు వడిన గీతామకరందధార సర్వకాలములందు-సర్వమానవులకు

సర్వవిధక్లేశముల దొలగించి-విషాదముల నిర్మూలించి-కర్తవ్యమును ప్రబోధించి నిత్యనవీనమై విరాజిల్లుటలో నబ్బురమేమున్నది ?

సవ్యసాచి దీనాతిదీనదృక్కులతో శ్రీకృష్ణునిఁ దిలకించుచు-మెల్లగ 'అచ్యుతా !' అనినాడు. ఈసంబోధన శ్రీకృష్ణునియొక్క నాశనరహితస్థితిని-నిత్యతను వెలువరించుచున్నది. నాశనరహితుడైన శ్రీకృష్ణుని నమ్మినవారి కెన్నడును నాశనము గల్గదు. నిత్యవిజయశ్రీ వారికి సిద్ధించును. నిత్యోల్లాసము వారిని మురిపించును.

ధర్మము నలక్ష్యము సేయక సత్క్రమపథమున సంచరించుచు పరులనుగూడ ధర్మమార్గమున పయనింపజేయగల దక్షత శ్రీకృష్ణునకే కలదు. అనుపమానశక్తిసామర్థ్యసమన్వితుడాయన. తన భక్తుల నాయన యెట్టి పరిస్థితులయందును పరిత్యజింపక వాత్సల్యభావమున గాపాడుచుండును. శ్రీకృష్ణుని ఆపద్బాంధవునిగా నెల్ల రభినందించుటెందువలననే. భక్తుడైన రథికునకు సారథ్య మొనర్ప సమ్మతించిన భగవానుడాయన. విషాదపరిస్థితులలో మునిగి తేలుచున్న పార్థుని యదృష్టమునకు పార్థునివదలివైచి యూరకుండగలడా ? రథికుని ప్రమాదపరిస్థితిని గుర్తించి సారథి యాదుకొని ప్రబోధింపనుంకించుటతివిచిత్రము. పార్థుని నీరసస్థితి కృష్ణుని బాధింప సాగినది. ఈరూపమున పార్థునకేగాక ప్రపంచమునకే విషాదమనెడి మహారుగ్మతను

నివారింపగల దివ్యౌషధమును ప్రసాదింప నెంచినాడు శ్రీకృష్ణుడు. నారాయణుడు నరున కుపదేశించిన గీత నరలోకమున కుపదేశించినగీతగనే వ్యవహరింపబడుచున్నది. భక్తులు విపత్తులో నున్నవేళ భగవంతు డూరకుండునా? తటస్థభావమును వహింప దగిన తరుణమా యది? తనను నమ్మిన వ్యక్తి యాపదలో నున్నప్పుడు కృష్ణు డుపేక్షాభావమును వహించి యుండగలడా? తనను మనసార విశ్వసించి సేవించుట కారంభించిన భక్తుడు దైన్యస్థితిలోనున్న తఱి భగవంతు డెట్లు సహింపగలడు? అతనిని కర్తవ్యనిర్వహణకై ప్రోత్సహింపవలసిన బాధ్యత తనపై గల దని శ్రీకృష్ణుడు భావించెను.

నిరంతరసాంసారికయాతనాపరంపరల మధ్య జితేంద్రియత్వ సిద్ధి నందలేక కామక్రోధాదులతో పోరుచున్న మానవాళిని కర్తవ్యపథమున నడిపింపవలసిన బాధ్యత తనపై గలదని అవతారపురుషుడైన శ్రీకృష్ణు డుద్దేశించెను.

కావుననే! అర్జునుని నిమిత్తమాత్రునిగ బెట్టుకొని - అర్జునుని విషాదపరిస్థితిని హేతువుగ నిడుకొని అర్జునునకేగాక యెల్లరకు శ్రేయమును గూర్పజాలిన దివ్యోపదేశమును సలుప శ్రీకృష్ణుడు పూనుకొనినాడు. శ్రీకృష్ణపరమాత్మ భక్తలోక శరణ్యమైన గీతను సవ్యసాచి కుపదేశింప నుద్యుక్తు డగుటతో భగవద్గీతామహావతరణ ప్రారంభోత్సవము జరిగినది.

శ్రీకృష్ణముఖోద్గతమైన దివ్యవాణి భగవద్గీతాస్వరూప మును దాల్చి కురుక్షేత్రవీథులనుండి బయలువెడలి యావద్భా రతమున బ్రవహించి – విశ్వమున విస్తరించి – సమస్తమానవుల బోధించినది. నేటికిని బోధించుచున్నది. భావికాలములవారిని గూడ బోధింపగలయనంతశక్తి భగవద్గీత కున్నది.

మహోత్తేజమును – మహానందమును – బ్రసాదింపగల యొక మహత్తరశక్తి భగవద్గీతకు గలదు. నిత్యసంక్లిష్టజీవిత సమస్యలకు నిరంతరపరిష్కారమార్గములను మానవు లింందరయు వచ్చును.

మానవు నావేశించి దౌర్బల్యమును ఘటించెడి – క్రుంగ దీసెడి – యేవేవో దుర్బలభావములకు ప్రతిబంధకమైన యౌషధము గీత యొక్కటే. సకలశాస్త్రసారముగ భాసించి సర్వవిధముల మానవాళికి సముద్దీపనము నందించి, భగవద్దర్శ నానుకూలపథములఁ జూపగల్గునది భగవద్గీతయే. గీతవలన కాని దేమియును లేదు. గీతయందు లేనిదేమియును లేదు. గీతావ తరణము మానవజాతిమహాదృష్టఫలమని వాకొను టిందువలననే.

భగవద్గీతకు నుపనిషత్తులతో రూపసామ్యము గుదురకు న్నను, తత్త్వసామ్యము గుదురును. ఉపనిషత్తులను పాడియావు లనుకొన్నచో నవి కుంభవృష్టిగ బిదికిన క్షీరధారలే భగవద్గీతా సూక్తులు. నిరాకారపరబ్రహ్మనుగూర్చి యుపనిషత్తులు సుస్పష్టమొనర్ప – సాకారపరబ్రహ్మను గీత స్పష్టముగ మనకు సాక్షాత్కరింపజేయును. ఆదర్శపథము నుపనిషత్తులు ప్రబో

ధింప – అనుష్ఠానవిధానమును గీత విశదీకరించును. భావసరళికి నుపనిషత్తులు నిర్మలతను సమకూర్ప, సఖునివలె హృదయ నిర్మలతను జేకూర్చి గీత మానవుని వికాసదశకు గొంపోయి మహానందమధురిమల రుచిజూపును.

శ్రీకృష్ణు డర్జునుని విశేషముగ ప్రేమించినాడు. పూర్ణ విశ్వాస మనుంగు మఱదిపట్ల నుండుటకతననే యిట్టిప్రేమ శ్రీకృష్ణునిలో వెల్లివిరిసినది. కావుననే పలుతెఱగుల బహు విషయముల నర్జునున కాయన యుపదేశించినాడు. పరిపూర్ణ ప్రేమ యున్నపుడే యొకరు మరొకరి క్షేమమునుగూర్చి ప్రత్యేకశ్రద్ధ దీసికొనుటయు పలురీతుల ప్రబోధించుటయు జరుగును. అర్జునునిపట్ల శ్రీకృష్ణునకుగల విశేషప్రేమ – అఖిల మానవలోకమునకే శ్రేయోదాయక మైనది.

"నీసుఖమును గోరి – నీవిజయమును గోరి నీకిట్టి సుదీర్ఘ ప్రబోధమును గావించుచుంటి"నని శ్రీకృష్ణు డర్జునునితో స్వయముగ బల్కినాడు. సత్యవచన మది.

అర్జునవిషయికమైన శ్రీకృష్ణమహాప్రేమవాహినియే పార్థసారథిహృదయమునుండి యురికెడి పావనగంగయై తత్ప్రవాహమున భక్తిశ్రద్ధలతో మజ్జన మాచరించువారి పాపములను క్షాళన మొనర్చి, పవిత్రతను జేకూర్చి భగవద్గీతాసుధాలహరిగా ప్రఖ్యాతి గాంచినది. ప్రశాంతప్రసన్నపరిస్థితులకు మూలకేంద్రమై వన్నెకెక్కినది.

తత్త్వశాస్త్రముగ విఖ్యాతి గాంచిన భగద్గీత ఆస్తికభావ నిలయమై నీతిని, రీతిని ప్రదర్శించి చూపగల దర్పణమై శాశ్వతత్వమును సమార్జించుకొన్నది. భగవద్గీత నొక భవ్యవేదాంత సౌధరాజముగ భావించినచో - అందలి యర్జునవిషాదయోగమును ముఖద్వారముగ నెంచవచ్చును. నరున కేర్పడిన విషాదము సహజముగ లోకమున భగవచ్చింతనానురక్తిని గూర్చుట తిలకించుచున్నాము.

గీతలో నరుడు విషాదయోగపరివృతు డయినతఱి నారాయణుడే శరణ్యుడైనాడు. తత్సంస్మరణమే నరునిలో నావిర్భవించిన విషాదమును రూపుమాపి, దివ్యపథము నందించినది. నరుల విషాదములకు గూడ నీలోకమున భగవద్గీతయే యుపశమనౌషధము కాగల్గినది.

"మానవజీవితము దుఃఖమూల నిలయము. అది నిత్యము గా"దని గీత ప్రబోధించి నిత్యము, సత్యము నైన పరమాత్మని నమ్ముకొని జ్ఞానవిజ్ఞానయోగము నాశ్రయించి-ధ్యానయోగము నారాధించి, కర్మయోగమునువహించి-భక్తియోగమునలీనమై అక్షరపరబ్రహ్మసాక్షాత్కారసిద్ధి నందుకొని యానందింపుడని యుద్ఘోషించుచున్నది.

"మా మేకం శరణం వ్రజ అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః" అనెడి సర్వేశ్వరుని ప్రియాతి

ప్రియవచనామృతమును భగవద్గీత మన కాస్వాదయోగ్యముగ నందించుచున్నది.

"అనన్యా శ్చింతయంతో మాంయే జనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభి యుక్తానాం యోగ క్షేమం వహా మ్యహమ్"

అనెడి భగవంతుని యుభయమును నరునిద్వారా నర లోకమున కంతటికి నొసగుచున్న పవిత్రసనాతనధర్మగ్రంథము భగవద్గీత.

పాశ్చాత్యవిద్వాంసులుగూడ బహుభంగుల నిద్దానిని ప్రశంసించుటకు హేతు విదియే. "స్కోపెన్‌హోయర్" భగవద్గీతా దివ్యసందేశమునకు ముగ్ధుడాయెనట. ప్రమోదప్రదనవ్య జీవితమును ప్రసాదించి నరుని అమరుని జేయఁగలది భగవద్గీత.

'ఇంద్రియసుఖములు తాత్కాలికములు, మానవజీవిత వికాసమున కవరోధకరము లని విజ్ఞులైనవారు గుర్తించి వాని యందు వైముఖ్యమును గల్గియుందురని గీత వక్కాణించుచున్నది. నిర్మలతమమైన యాధ్యాత్మికజీవితమధురిమ నాస్వాదించుపట్ల నరుని కభిరుచిని బెంచగల్గుచున్నది గీత. ఆరోగ్యము, సంపద, కుటుంబము, సంఘము, సహకారము, మొదలైన యంశము లన్నియు భౌతికజీవితమునకు సంబంధించి నట్టివి. ఇవి యల్పఫలములను మాత్రమే ప్రసాదించును. విశేషఫలముల నొసగుశక్తి వీనికి లేదు. విశిష్టఫలము నాధ్యాత్మికజీవితనిర్వాహణమున మాత్రమే మన మందుకొనఁగలము. తన్నిర్వాహణమునకు

వలసిన యాత్మబలము భగద్గీత వంటి యసదృశసనాతనధర్మ ప్రబోధకగ్రంథములవలననే జాతికి సిద్ధించును. కావుననే దేశ విదేశవిభేదరహితముగ సకల ప్రజానీక మిట్టి గ్రంథరాజముల నారాధించుచున్నది.

ఆరోగ్యశాస్త్రమునందో! ఆర్థికశాస్త్రమునందో! యెవరేని పట్టభద్రులు గావచ్చును. ఫలితముల నున్నతస్థాయిలో బడయవచ్చును. కాని యాధ్యాత్మికవిద్యాపట్టభద్రులు కాదల చినవారికి శ్రీకృష్ణపరమాత్మవంటి గురుదేవుడు కావలయును. విశ్వరూపదర్శనానంతర మర్జునునిలో నేర్పడిన స్థితప్రజ్ఞావిశే షము లభ్యపడవలయును. గీతవంటి పాఠ్యగ్రంథము దొరక వలయును. గీత అనుష్ఠానవేదాంతవిద్య. ఆచరణము నందిడ జాలినపుడే యేవిద్యయేని సత్ఫలము నీయగల్గును.

ఆరోగ్యమును రక్షించుకొను ప్రయత్నములో ద్రవ్యము విశేషముగ వ్యయమగును. ఆరోగ్యము లేనినాడు ద్రవ్యము నకు విలువలేదు. ద్రవ్యము లేనితఱి నారోగ్యమునకు వృద్ధి సున్న. పరస్పరవిరుద్ధవిషయము లివి. జీవితము నందెదు రయ్యెడి యిట్టి యెన్నియో సమస్యలకు పరిష్కారమును జూపెట్టజాలి మానవుని స్థితప్రజ్ఞునిగ, మోహవిముక్తునిగ జేయజాలిన దీగీత.

యుద్ధమొనర్చుట అర్జునుని విధ్యుక్తధర్మము. తదర్థ మాతడు సన్నద్ధుడై సమరరంగమునకు వచ్చి స్వజనమును గాంచి హననకర్మకు పూనుకొనలేక విషాదచిత్తుడై కర్తవ్య

పరాఙ్ముఖుడై ధర్మమును విస్మరించినాడు. గురుబంధుమిత్రజనముల పట్ల గౌరవప్రేమాభిమానములే యిందుకు గారణములు.

సాంఘిక ప్రయోజనసాధకుడైన మానవుడు బంధుమిత్ర మమకారదూరుడు గాక తప్పదు. స్వార్థమును విస్మరింపకున్న స్వధర్మము నతడు నిర్వహింపలేడు. నిశ్చలచిత్తుడు గాజాలనిచో కార్యసాధన మొనర్పలేడు. నియమనిగ్రహములు కార్యసాధనలో ప్రధానభాగములు.

"పౌరుషజ్ఞానకీర్తుల బరగ నేని
వాని జీవిత మొక పూట యైన జాలు"

మహాభారతము ప్రవచించిన పసిడిసూక్తి యిది. పౌరుషరహితజీవితమునకు పార్థుడు గురి గానున్న తరి భగవద్గీతావతరణము జరిగినది. మానవధర్మములు ప్రబోధింపబడినవి. మహిమాన్వితసందేశము లందింపబడినవి. దానితో విజయుని జీవితమున మరల వెలుగులు వెల్లివిరిసినవి. క్షత్రియధర్మమును శిరసావహించినాడు. క్రూరనారాచముల గుప్పించి, కురువంశనిర్మూలన మొనర్చి కురుక్షేత్రమును ధర్మక్షేత్ర మొనర్చుటకు దీక్ష బూనినాడు. గాండీవమును కరమున దాల్చినాడు. దేవదత్తమును భూనభోంతరాళము లదరున ట్లొత్తినాడు. విజయకేతనము నెత్తినాడు. ధర్మదేవతకు పట్టము గట్టినాడు.

ఈపరివర్తనము సకలమానవులలో సందర్భపడినపు డెల్ల యవసర మగుచుండును. ఈపరివర్తనము మోహము నష్టమై

నపుడే వచ్చును. జ్ఞానబలమున గాని మోహ మంతరించదు. చైతన్యము వృద్ధినందిన గాని జ్ఞాన ముదయింపదు. గీత సకల భూతవ్రాతమునకు నిత్యచైతన్యప్రదాయిగ విలసిల్లు పరమాధ్యాత్మికరసాయనము.

తద్రసాయననిరంతరసేవనమువలన మోహవిముక్తులై నరులు నరునివలె కర్తవ్యపథమునం దడుగిడి జీవితధ్యేయముల నార్జించి, విజయదుందుభుల మ్రోగించి, విస్తృతఫలముల సాధించి విశాలకీర్తిని గడించగలరు.

పరమపావనమై పరమయోగిజన సంసేవ్యమై - మానవ జీవితరీతులను కలుషరహితములుగ నొనర్చి కమనీయ కాంతి పుంజములను సర్వత్ర విరియించి యీగీత జగతికి ధన్యతను ప్రసాదించుగాక ! ఆర్ష సంస్కృతికి మాన్యతను ఘటియించుగాక !

విశ్వవ్యాప్తముగ ప్రచారప్రబోధములలో నిలిచి - సహజసరళవిషయపరంపరల ప్రశస్తివలన పండితపామరజన సర్వస్వమునకు సమాదరణ పాత్రమై సంక్షేమ సంధాయకమై యీగీత నిఖిలపాతక విఘాతినిగా నిత్య శుభములను మానవాళి మనుగడయందు నెలకొల్పుగాక !

కులమతవర్గ విచక్షణారహితమైన యుత్కృష్టధర్మపథమున - జిజ్ఞాసువులైన యధ్యయనతత్పరుల యనుష్ఠానమున వెలుగులీని వారినెల్లరనీ గీత యానందధాముల నొనర్చుగాక !

జగత్కల్యాణదాయకమై, సత్పురుష హృదయోల్లాస వికాసవిరాజమానమై, సాధకజనామోద ప్రమోదములకేకైక కారణమై శోభిల్లెడి శ్రీకృష్ణబోధామృతమైన యీగీత యింటింట శాంతిమయసుఖముల పంటలను బండించుచు – భారతీయాధ్యాత్మిక జీవితరంగమున జేగంటలను మ్రోగించు గాక !

స్వధర్మమును నిర్విఘ్నముగ నిర్వహించుటకు – పరమ ధర్మమును భక్తిశ్రద్ధలతో శిరసావహించుటకు – దీనత్వహీనత్వ ములను రూపుమాపుటకు – ధీరత్వవీరత్వములను మానవకర్తవ్య పథమున వెలయించుటకు – దివ్యజీవనమును గడుపుటకు – ప్రశాంతప్రసన్న ప్రబోధమై శ్రీకృష్ణభగవానుని అమరగానమై వర్ధిల్లిన యీగీతయే – తారకమంత్రమగుగాక ! ధర్మపతాకలను రెపరెపలాడించుగాక ! తత్త్వసుధను వెదజల్లుగాక !

— ఓం తత్ సత్ —

ఓమ్

ధ్యాయన్తి యే విష్ణు మనన్త మవ్యయం
హృత్పద్మమధ్యే సతతం వ్యవస్థితమ్
సమాహితానాం సతతాభయప్రదం
తే యాన్తి సిద్ధిం పరమాంచ వైష్ణవీమ్.

# శ్రీ వైష్ణవము

అనాదినుండి భారతదేశము ఆస్తికత్వమున కాలయము. ఆధ్యాత్మికమున కాటపట్టు. ఆతిథ్యమున కన్నపూర్ణ. పుణ్యదేశమని విశ్వవిఖ్యాతిని బడసినది. భగవంతు డొక్కడే యని భారతీయుల పరిపూర్ణ విశ్వాసము. భగవదనుభూతిని పొందుటకు నిత్యము కృషిని సాగించు పావనచరితులు వారు. ప్రసన్న ప్రతిభను భద్రంకరమైన భావనాపాటవమును సర్వతోముఖముగ నుద్దీపింపజేయగల యాధ్యాత్మిక దివ్యకాంతిరేఖాప్రకాశములో దేదీప్యమానముగ వెలుగొందువారు మహర్షులు, మహా

యోగులు. ఇట్టి పరమహంసల జీవితములు సర్వదా పావనములుగనే యలరారుచుండును. ఓజస్సు, తేజస్సు నిత్యనూతనముగ వర్ధిల్లుచున్న దివ్యశక్తికి కేంద్రములు. సర్వజనాకర్షణైకదక్షములు. సుఖశాంతులకు సౌశీల్యసౌజన్యములకు ప్రేమౌదార్యములకు పట్టుగొమ్మలు. ఇది వారి సహజసిద్ధమగు సదాచారము; విశిష్టలక్షణము. సత్యసంకల్పసంభావితము.

తాదృశులైన మహనీయుల జీవితగాథావిశేషములత్యద్భుతముల కాలవాలములు. స్వపరతారతమ్యభేదభావనకతీతులైన యాపుణ్యమూర్తుల యూహాలు ధర్మపుగనులు. వశీకరణశక్తిసమన్వితులైన యామాన్యులెల్లరు భవ్యదివ్యతపోధనులు. పరార్థపరమార్థసాధనలకే జీవితముల నంకితమొనర్చిన యీయోగికుల తిలకులే- ఒక్కమాటలో నిర్వచింపవలెననిన భారతీయధార్మికజీవితవ్యవస్థకు మూలపురుషులు. ప్రపంచకళ్యాణసాధనకు హేతుభూతమైన పరమపూజనీయ జీవితప్రణాళికకు స్రష్టలు.

భౌతికభోగానుభూతుల వంకకు హృదయమును పరుగెత్తనీయక – ప్రచండశిలాపాతమును, ప్రసన్నసుమవృష్టిని సమతాదృష్టితో – మమతావైఖరితో నోర్వగలిగిన దివ్యతాత్త్వికద్రష్టలు మంత్రద్రష్టలైన మహర్షులు. పునీతశక్తిస్తోమతులను భూవలయమున కంతటికి నుదారముగ బంచిపెట్టి సదాశయస్రవంతులపై భావితరము భ్రాంతులను ముదావహముగ దేలి

యాడింపజేయుటకై యోగబలమును గడించిన కరుణామయులు వారు. క్షామబాధారహితముగ - క్షేమకల్యాణమహితముగ- ప్రేమతత్త్వసహితముగ ఈభువి దివిగ మారవలయునని ప్రగాఢముగ కాంక్షించిన ధర్మభావనులు వారు. పవిత్రభారతవసుంధరాతలము నంతయు నట్లు మార్చవలయునని కలలు గన్న ధన్యజీవనులు వారు. కలలను కలలుగా మాత్రమే కరుగనీక ఫలింపజేయనేర్చిన పావనులు వారు. అందువలననే భారత సంయమిచంద్రుని భావజ్యోతియే నిఖిలవిశ్వము నావరించిన నిబిడాజ్ఞానతమస్సును నిర్మూలింపగలిగినది. కావుననే సకల లోకములలో సార్వజనీనమైన, సార్వకాలీనమైన సుసత్యాగ ఆర్యావర్తప్రబోధశంఖారావము నిల్చిపోయినది. ఉన్నతోన్నతస్థానమున భారతయతిరాజు నిల్పిన త్యాగపూర్ణసనాతన సంస్కృతిపతాక రెపరెపలాడుచునే యుండగలుగుచున్నది. స్తవనీయసత్య మిది. గణనీయరహస్య మిది. సమాదరణీయ సంప్రదాయ మిది.

పరమభాగవతులుగ భగవత్సదృశులుగ భారతీయులచే పూజింపబడిన మహర్షివరేణ్యుల మనోబలవైభవము మీదనే మననాగరికతాసంస్కృతుల విశిష్టత, గౌరవము నిల్చియుండె ననుట రెండువాదములకు తావులేని మాట. వారు సూచించిన మార్గము లున్నవి. వా రుపదేశించిన ప్రబోధము లున్నవి. వారు నిగ్గుదేల్చి నిర్ణయించిన సిద్ధాంతము లున్నవి. వా రాచ

రించి ఫలమును సాధించి చూపిన పథకము లున్నవి. వా రాదల పహించి యభినందించిన ప్రమాణము లున్నవి. వారు గడించిన పూర్ణానుభవమును మిళిత మొనర్చి అంతర్వీక్షణశక్తితో నందఱికి నన్నివేళల నుపయోగపడునట్లు రచించిన గ్రంథము లున్నవి. ప్రజాకల్యాణమును దేశనిరుపప్లవస్థితిని ఉద్దేశించి వారు శాసించిన సూత్రము లున్నవి. కనుగొలుకులలో ఎట్టి జీరలు దోబూచు లాడుచుండ విశాలఫాలఫలకమున మహై శ్చర్యకరమహోద్ధృతశక్తి విస్పష్టముగ వ్యక్తమగుచుండ నిరంతర నిష్ఠాగరిష్ఠ మన స్తత్త్వముతో చిన్ముద్రాలంకృతుడై గహనసీమల కాననమధ్య భాగముల నేకాకిగ నేకాగ్రతతో చీకులెఱుగని చింత లెఱుగని చిదానందమయజీవితయాత్రను సాగించిన మన భారతీయ యోగిపుంగవుని మనము మనమునం దొకసారి స్మరించినచో నొడలు పులకరించును.

ఏమి త్యాగశీలము! ఎట్టి కఠోరకర్మదీక్ష! ఎంతటి విశాల తాత్త్విక చింతన! ఎటువంటి అవిచ్ఛిన్నపావనభావధార! ఎట్టి సుపవిత్రసుందరమూర్తివిశేషము! వింటిమా! ఈతీరు నేజాతి చరిత్రమునందైనను? కంటిమా? ఇట్టి పవిత్రప్రవృత్తినే సామాజిక ధోరణియందైనను? దర్శించితిమా! ఇంతటి అఖండత్యాగసముజ్జ్వలచైతన్యసంభరితరీతి నేయితరచరిత్రము నందైనను? ఇది యిచ్చటనే వెల్లివిరిసినది. ఇది యీతావుననే తావులు గుబాళించినది. ఇది యీనేలమీదనే సహజసిద్ధ

మహామహిమగా రాణించినది. ఇది ఈగడ్డ యదృష్టము. ఇందు నిరంతరముగ ప్రవహించెడి జీవనదుల జలధారాప్రభావ వైభవము. ఇది యీసీమలో ఊపిరి పీల్చుకొనెడి మహా భాగ్యము నందుకొన్నవారు తరాలనుండి – యుగాలనుండి నోచుకొన్న నోములపంట. కావుననే యిది ఆర్షవసుంధర. కావుననే యిది ఆర్షసంస్కృతి. కావుననే మనది ఆర్షసంప్రదాయము. భారతీయ లక్షరాక్షరముగ నదృష్టవంతులు. ఇది మనము గళమెత్తి గంభీరముగ – ఆనందముగ పాడవలసిన పాట. ఇది పెక్కురు విదేశీయు లసూయాపరవశు లయ్యును విధిలేక చేసిన స్తుతి. భారతీయుల జీవితమును వర్ధించిన విస్తరిగ మార్చిన పుణ్యము మునిశ్రేష్ఠులకే దక్కినది. ఆచారసత్వమును మనము మన్నింపవలెను. వారి యాదర్శములను మన మాదరింపవలెను. వారి స్థిరనిర్ణయములను మనము శిరసావహింపవలెను. ఒక్కమాటలో చెప్పవలెనన్న – వారికి వారసుల మనిపించుకొనుట కైన కనీసపుటర్హతలు గలవారముగా వర్తింపవలెను. వడ్డించిన పదార్థములను భుక్తమొనర్చుకొనగల నేర్పరులముగనైన తయారు కావలయును. లోకముదృష్టిలో బ్రహ్మాండమైన సంస్కృతిని పెంపొందించిన మహనీయులుగ – విశ్వాభ్యుదయ ప్రదాతలుగ వినుతిగన్న మహర్షుల యడుగుజాడలలో తడబడక నడువగల శక్తిమంతులముగ మనము తయారు కావలయును. పూనిక – ఉత్సాహము వారినుండి మనము పుణికిపుచ్చుకొని వర్ధిల్లజేసికొనవలసిన దివ్యలక్షణములు. అసహనము, అహం

కారము, అత్యాశ, అనృతకథనము. ఆడంబరానురక్తి - మహర్షుల పావన చరిత్రలను సమగ్రముగ నాకళింపునకు దెచ్చుకొనిన వారి దరికి జేరవు. అణువణువున మహత్త్వము పరివర్ధిత మొనర్చుకొని - క్షణక్షణము జగత్కల్యాణమునే కాంక్షించి ప్రపంచభద్రతకొరకే పలవరించి - శ్రమించి - ఫలితమును గడించి - తరించిన ధన్యులా ఋషిసత్తములు. ఇది వారికి సర్వసాధారణప్రవృత్తి. మన మాదివ్యవైఖరిని సాధన మొనర్చి, మహితభావనను విశ్వవ్యాప్త మొనర్చి, భారతీయుల యార్ష భావబలవైభవము పట్ల కించిన్మాత్రపు కృతజ్ఞతనేని వెల్లడించు కొనుట ప్రథమకర్తవ్యము.

భగవంతుడు సర్వజ్ఞుడు; సర్వశక్తిమంతుడు; సర్వవ్యాపకుడు; సృష్టికర్త. ఆయన ఆవిష్కరించిన విజ్ఞానము వేదము. కావున నది అపౌరుషేయము; స్వతఃప్రమాణము. పరమేశ్వర నిశ్వాసములుగ ప్రశస్తి వహించిన వేదసంపదయే విశ్వాభ్యుదయమునకు, జగత్కళ్యాణమునకు హేతుభూత మని ప్రగాఢముగ విశ్వసించి-భజించి-తరంచిన దేశము భారతదేశము. అట్టి వేదములను భారతీయులు పరమప్రమాణములుగ నిడుకొని సనాతన ధర్మమును స్థాపించుకొనిరి. కాలక్రమముననీ సనాతన ధర్మమహావృక్షమున శాఖోపశాఖలుగ పెక్కుమతము లుద్భవిల్లినవి. ఆయామతములకు చెందినవారు తమతమ యిష్ట దైవముల నారాధించుకొను నాచారమున కలవడిరి. భగవ

దనుభూతిని పొందుటకు పెక్కురూపుల వానిని సేవింతురు. పెక్కు నామములతో వానిని గీర్తింతురు. అయ్యును అఖండ తేజస్సుతో దివ్యముగ వెలుగొందుచుండు భగవంతుడు మాత్ర మొక్కడే. "ఏకం స ద్విప్రా బహుధా వదన్తి" అనునదే పవిత్రవేదవాక్కు. ఈ యేకైకభగవానుని జేరుటయే భారతీయుల పరమలక్ష్యము. ఇందులకు భిన్నమార్గములు గలవు. భిన్నరీతుల బయనించినను నేకలక్ష్యమగు భగవంతుని సాక్షాత్కారమే వీరి ధ్యేయము. దీనిని సాధించుటకు జ్ఞాన ధ్యాన కర్మ భక్తి యోగములనునవి రాజమార్గములు. భక్తియోగ మార్గాభినివిష్టులు భాగవతులు. ఇందు విష్ణువు నారాధించువారు వైష్ణవులు.

సకలలోకశరణ్యుడైన శ్రీమన్నారాయణుని దివ్యపాద పంకేరుహాసేవాభాగ్యమున కువ్విళ్లూరు టొక్కటే భక్తలోకమునకు పరమధ్యేయము. సకల ప్రాణికోటికన్న భిన్నముగ విశిష్టజ్ఞానచైతన్యమును ప్రసాదించి యుక్తాయుక్తవిచక్షణాశీలసంపన్నునిగ నరుని శ్రీమన్నారాయణు డనుగ్రహించినాడు. అపారకృపాజలధి యైన యా దేవదేవు నెట్లు స్తుతించిన, నెంతగ సేవించిన, నెన్ని తెఱగుల భజించిన నరుడు కృతార్థుడు కాగలడు? ఋణవిముక్తుడు కాగలడు? నరుడు చరితార్థుడగుటకు — సఫలమనోరథు డగుటకు — లక్ష్యసాధకు డగుటకు మూలము — ఆధారము గూడ నాసర్వేశ్వరుడే. నిష్కర్షగ జెప్పవలయుననినచో

జీవునకు సర్వవిధముల గమ్యము భగవంతుడే. ముక్తికి సాధనము సైతము భగవంతుడే. ఫలానుభూతియు భగవంతునిదే. ఈ బహిరంగసత్యమును విస్మరించిన మరుక్షణమునుండియే నరుడు పతనదశ కరుగుట ప్రారంభమగును. లక్ష్యశుద్ధి లేక – సత్యసమవగాహన లోపించి – వివేకము కొఱవడి విహరింప సాగుట కర్థమేమి? జీవునకు పరమాత్ముడు దయతో నొసగిన జ్ఞానధనము దుర్వ్యయపఱుపబడుచున్న దన్నమాట. తన సొత్తు రిత్తగ వ్యర్థమగుట కెవ్వరేని సమ్మతింతురా! అన్నింటికి కర్తయైన భగవంతుడిట్టి యవివేకుల నెట్లు క్షమించును? మానవుడు తానే సర్వకారణ కారణభూతుడ నని విఱ్ఱవీగిన ఫలమేమి? యథార్థము నరసిన వ్యక్తమగున దేమి?

జీవాత్మ – ఉపాయము – ఫలానుభూతి అనెడి మూడును భగవంతునకు జెందినవే యని స్పష్ట మగును. మార్గము లెన్నియైనను కేంద్ర మొక్కటియే. వాదన లెన్నియైనను పిండితార్థ మొక్కటియే. రుచులెన్నియైనను తృప్తియొక్కటియే. విషయము లెన్నియైనను పరమార్థమొక్కటియే. అట్లే జీవాత్మ యని – ఉపాయ మని – ఫలానుభూతి యని అంశము లెన్నియైనను ఉద్దిష్టమైన – లక్ష్యభూతమైన భగవత్స్వరూప మొక్కటియే. ఈ విభాగములలో గల వివిధవిశేషములను – రహస్యములను, సరళముగ – సుబోధకముగ – చమత్కారజనకముగ – చిద్విలాససమన్వితముగ చిత్రించి – వివరించి – గమ్యము

నుద్బోధించి మానవులను జాగరితుల గావించుటకే శ్రీవైష్ణవ ముద్భవిల్లినది. ఆత్మశుద్ధిని. భావపవిత్రతను, జీవితఫలసిద్ధినిగడించి పెట్టి తమ కర్తవ్యమును సమగ్రముగ నిర్వర్తింపగలిగితి మనియు తమధర్మమును నైతికప్రయోజనసమన్వితముగ నెర వేర్పగలిగితి మనియు సంతృప్తి నందుటకే వైష్ణవాచార్యులు దీక్షాకంకణమును ధరించిరి.

శ్రీవైష్ణవ మీవిశిష్టసంప్రదాయమునే యవలంబించి సర్వోత్కృష్టపథమును సర్వమతముల వారికిని సమర్థవంతముగ నిరూపించినది. సమంజసవైఖరిలో ప్రబోధించినది. సముచిత ధోరణిలో విశ్వమున కంతటికిని తన ప్రబోధపువిలువల నెఱుక పఱచి యోగ్యతమస్థితిని బంచిపెట్టినది. దార్శనిక, పారమార్థిక సత్యస్వరూప ప్రాభవమును వేనోళ్ల జాటినది. శ్రీమన్నారా యణుని దివ్యపాదపద్మ సంసేవనమునే — సందర్శనమునే మానవాళిలో నిరంతరము ప్రదీపింపజేయు మహితశక్తిని శ్రీవైష్ణ వము తొలుతనుండియు బ్రదర్శించుచు వచ్చినది. అనంతకాల ప్రవాహమున నిరంతరముగ తృణగణము పగిది కొట్టుకొని పోయెడి జీవాత్మలు పరమాత్ముని సాన్నిధ్యమును జేరుకొని నపుడే ప్రశాంతిని — పరమసుఖమును పొందగలవని విశదముగ వివరించుటకు — సోదాహరణముగ నుద్బోధించుటకు శ్రీవైష్ణ వము సల్పిన నిరుపమానకృషి. నిఖిలజనసమారాధ్యమై నిలిచి గెలిచినది.

ఆశాపాశబద్ధచిత్తప్రవృత్తితో నుక్కిరిబిక్కిరి యగుచు ధ్యేయమైన భగవచ్చింతనాపరతను నిర్లక్ష్య మొనర్చి నరు లేరీతి నిక్కట్లపాలగుదురో సమయము మించినతఱి, బుద్ధివికాసము స్తంభించిన యనంతరము, కరచరణశ్రవణనయనాదులు తమతమ పనులను మానివైచినతఱి, వార్ధక్య ముఱిమియుఱిమి పైబడువేళ, భగవంతుని స్తుతించి, ఫలమును గడించి తరించ వలయునని ప్రాకులాడెడివారి కృషి యెట్లు హాస్యాస్పద మగునో స్పష్టీకరించుచు మృదువుగ – లాలనగ శ్రీవైష్ణవము నరులకు సల్పిన హితబోధయే తత్సిద్ధాంతప్రాశస్త్యమునకు ప్రబలకారణ మని యెల్లరంగీకరించిన సత్యము. ఆయేకాగ్రతను, దృఢతమ నిష్ఠను సమగ్రముగ నలవఱచుకొని సిద్ధాంతరహస్యసారము నవగాహన మొనర్చుకొని ధర్మసూక్ష్మముల నన్నింటిని గ్రహించుటకు న్యూనాధిక భేదభావము లేదని శ్రీవైష్ణవము ధ్రువీకరించినది. కులమత వర్గ వైషమ్యముల కతీతమైన యొక బృహత్ప్రథకము స్త్రీ పురుషుల విచక్షణను పరిగణింపని యొక విశిష్టస్థితి ముక్తి నభిలషించు జీవాత్మ లందరిని ప్రియమార చెంతకు జేర్చి – అక్కున బెట్టుకొని – యాదరించి యొకానొక దివ్యరీతి శ్రీవైష్ణవమును సకలజనాభిమానపాత్రము గావించినది.

శ్రీవైష్ణవమహాసిద్ధాంతముపై పెనుతుపానులై వీచుచు నిపడెడి కువ్యాఖ్యల బారినుండి – విషమవిమర్శల యుద్ధతి

నుండి - శ్రీవైష్ణవమును కవచమువలె కాచి రక్షించిన దాయపూర్వవిధానమే.

స్నానసంధ్యాది నిత్యనైమిత్తిక విధులను ప్రతిదినము సభక్తికముగ నిర్వర్తించెడి సదాచారసంపన్నులు - మంత్రమును ప్రాణప్రదముగ నిశ్చల నిస్తుల నిష్ఠతో జపించు భక్తులు- విష్ణుభగవానుని కమనీయ దివ్యమంగళ విగ్రహ లావణ్యశోభను దర్శించి - పులకించి - దీప ధూప నైవేద్యార్చనారాధనాది వివిధ కైంకర్యములను చిత్తశుద్ధితో సక్రమముగ నిర్వహించుచు తమ సర్వస్వమును- వేయేల- తమనుగూడ భగవంతున కర్పించుకొని వాని నారాధించెడి యనుష్ఠానప్రియులు- పావనచరితులు- పరమభాగవతులు - శ్రీవైష్ణవులు.

దేవదేవుని యాలయమును దివ్యశోభావిలసితముగ నుంచుటకు - సమ్మార్జనాది కైంకర్యములతో సంతృప్తినందుటకు- వారు పడెడి తహతహ - అనురక్తి గమనించినచో శ్రీవైష్ణవము నరుల నరముల కెట్లు పట్టినదో! తన్మహిమ వారి నెట్లు ముగ్ధులను గావించినదో! తదనుభూతి వారి నెట్లు దాసానుదాసులనుగ మార్చినదో! మనకు వ్యక్తమగును. "దాసోఽహమ్" శ్రీవైష్ణవతత్త్వసమారాధనాపరుల నిరంతరము వినిపించెడి దివ్యవాక్కు. అహంకారరాహిత్యమును హృదయనిర్మలతను గురుభక్తిని వృద్ధులపట్ల - జ్ఞానులయెడ అఖండగౌరవమును నరులలో నిత్యము పెంపొందించుటకు చిహ్నముగ నీ 'దాసోఽ

హమ్' శ్రీవైష్ణవమతమహాద్వారవిజయఘంటికారావమై నిల్చి నది.

పూలతోటలకు నీరుపోసి పెంచువారు - అందమైన మాలలు నిర్మించి యర్పించువారు - మధురాతిమధురఫలముల మనసార సేకరించి సమర్పించువారు - నతు లొనర్చువారు - నుతులు గానము చేయువారు- సర్వాలంకారములతో స్వామిని భుజస్కంధములపై నిడుకొని మోయువారు - నగల నర్పించు వారు - వస్త్రముల నిడువారు - భగవత్కథాశ్రవణమున పర వశత్వమునందువారు - స్వేచ్ఛముగ భగవద్గుణగణగానము సల్పునారు - భజించువారు - మంత్రము జపించువారు - మౌన ముగ తపించువారు - వీనిలో నేయొక్క సేవయు జేతగాక కాంక్ష తీరక ద్వాదశోర్ధ్వపుండ్రములను మేనినిండ ధరించి 'నేను నాస్వామికి కింకరుడ నైతి'నని సంతృప్తినందువారు - వివరింప బూనిన నిట్లెంద రెందరో ఎన్నెన్నియో రీతుల శ్రీ మహావిష్ణు దివ్యకారుణ్యసిద్ధికై అహోరాత్రములు పరితపించుచు శ్రీవై ష్ణవబృందములలో మనకు దర్శన మిచ్చుచుందురు.

ఒకనాడు శ్రీవైష్ణవము విశ్వమున తన మహోన్నతస్థితికి సూచకముగ నెగురవైచిన విజయపతాకలవంటివారు వీరందరు. ఒకనాడు శ్రీవైష్ణవమునకు సార్వకాలిక దివ్యమతముగ శాశ్వ తస్థాయిని గల్పించుటకై మహనీయులైన వైష్ణవ ప్రబోధకులు ఆచార్యులు దీక్షతో సల్పిన మహోజ్వలకృషికి దివ్యచిహ్నము

లవంటివారు వీరందరు. అనుష్ఠానప్రియులుగ - పావనచరితు లుగ - పరమభాగవతులుగ - శ్రీవైష్ణవ సంప్రదాయ నిరంత రోజ్జీవన కారకులుగ - ఖ్యాతిగన్న మహనీయులనే శ్రీవైష్ణవు లందురు.

ఇతరసాధనముల నన్నింటిని వీడి - భక్తియను నుపాయ మును చేపట్టి - విష్ణుప్రాప్తియను దివ్యఫలమును బడసి - తమ సర్వస్వమును విష్ణుభగవానునికే హృదయపూర్వకముగ సమ ర్పించు ప్రపన్నులు శ్రీవైష్ణవులు. ఇట్టి విష్ణుభక్తిపరాయణులే తదనుభూతిలో మునిగితేలుచు పారవశ్యమున తన్మయులై తాం డవించు పావనభాగవతోత్తములే పన్నిద్ద రాళ్వారులు. వీరిలో అంటరానివారని చెప్పబడు పంచములు, ఒక స్త్రీయు నుండుట గమనార్హమైన విషయము. ఇది వైష్ణవమునకు గల ప్రత్యేక పవిత్రలక్షణము. ఆళ్వారుల యడుగుజాడలలో పయనించుచున్న భాగవతు లెందఱో గలరు. వీరిలో నాథముని, యామునాచా ర్యులు ప్రధాన శ్రీవైష్ణవులు. యామునాచార్యుల విశిష్టదివ్య భావరత్నములను బాగుగ జీర్ణించుకొని ప్రజలకు సరళముగ ప్రబోధించిన ప్రాజ్ఞులు - పరమభాగవతులు శ్రీరామానుజాచా ర్యులు. ఈమహనీయుడు విశిష్టాద్వైతరూపమున శ్రీవైష్ణవ మును సుస్థిరదివ్యపీఠము నలంకరింపజేసెను. ఈమహామహుని మూలమున శ్రీవైష్ణవము సర్వత్ర వ్యాప్తమై విశ్వవిఖ్యాతిని బడసినది. పరిపూర్ణ ప్రజాదరణమును పొందినది. శ్రీరామా

నుజాచార్యులు సంకుచితభావములకు స్వస్తి చెప్పెను. శాఖా విభేదములను విస్మరించెను. తార్కికవాదమునకు నిలయమగు-పట్టుగొమ్మగనుండు - మనోబద్ధహేతువును సక్రమస్థానమునం దిడెను. దాని కతీతముగ - దివ్యముగ దీపించు హృదయార్ద్రితతో సిక్తమైన ప్రేమసుమమును వికసింపజేసి యాదివ్యకాంతిని సర్వత్ర వ్యాప్త మొనర్చెను. కుటిల కులతత్వమును కూకటి వ్రేళ్లతో గూల్చి వైచెను. ఈయన సమభావమును సాధించి పరార్థమునకు పాటుపడిన ధన్యజీవి. పరమార్థమునకు పట్టము గట్టిన పవిత్రసన్యాసి. సకలప్రజావళిని దివ్యభావ శీతల తరుచ్ఛాయల సేదదేర్చి విశ్రాంతి నందించిన సంయమిచంద్రుడు. తారక మంత్రము నెలుగెత్తి చాటిన యతిరాజు. శ్రీవైష్ణవమును ప్రజల కందజేయను నుచితముగ బంచిపెట్టి వారి హృదయము లను చూఱగొన్న పుణ్యమూర్తి; ఉత్తమదేశికుడు.

శ్రీమద్రామానుజాచార్యుల యనంతరము శ్రీవైష్ణవ మును నిర్దుష్టముగ సరళభాషలో నిర్వచించి ప్రచారమునకు దెచ్చిన యుద్దండపండితుడు వెంకటనాథుడు. ఈపావనచరిత్రుని వేదాంతదేశికుడను అన్వర్థనామముతో బిలుతురు. వంశపారం పర్యముగ నిర్మలగంగాప్రవాహమువలె శ్రీవైష్ణవము ప్రజలకు తన దివ్యప్రసాదమును సదా అందించుచునేయున్నది. ఇట్టి శ్రీవైష్ణవమును గూర్చి కొంత విపులముగ విస్పష్టముగ విశదీకరింతము. విశాలభావముతో పరిశీలించి పరిశోధింతము. నిగ్గుదీసి యెల్లరకు పంచిపెట్టుదము. దీని విశిష్టసుందరరూపమును

కేవలబౌద్ధిక సంబంధముననే గాక ఆధ్యాత్మికానుభవమును, దివ్యత్వమును సాధించుటకు, జీవాత్మ పరమాత్మను పొందుటకు, అత్యుత్సాహముతో నిర్మలభక్తితో విష్ణువును దర్శింపజేయుటకు వలయు కొన్ని ప్రధానాంశములను గూర్చి ముచ్చటింతము.

వేదాంత దేశికులు రహస్యత్రయసారము అను ఉత్తమ గ్రంథమును రచించెను. ఇందు రహస్యత్రయమునుగూర్చి సరళమగు భాషలో వ్యాఖ్యగావించెను. సాధకుల కవసరమైన మూడు రహస్యములకు సంబంధించిన వివరణమును చూపెట్టెను. ఇందు మొదటిది జీవాత్మకు పరమాత్మతో గల సంబంధమును గూర్చి అరమరిక లేని తెఱగున నెఱుకపరచును. రెండవది భగవంతుని సన్నిధికి సులభముగ జేరుటకై స్వామిని సర్వశరణ్యునిగ దలంచి ప్రపత్తిమార్గమున సంచరించుటను జూపును. ఇక మూడవది నిండుభక్తితో నమ్మి – సర్వస్వమర్పించి 'నిన్నే నమ్మితి, నీవే గతి' అని ఆత్మార్పణ మొనర్చి తన కరుణాకటాక్షవీక్షణప్రసారము నాకాంక్షించుచున్న ప్రపన్నుడైన భక్తునియొక్క యోగక్షేమములను తానే వహించి – తననే యాశ్రయించుకొనియున్నవాని సర్వభారమును భగవంతుడే తనపై వైచుకొను ననెడి సిద్ధాంతమును స్పష్టీకరించును. రహస్యత్రయసారగ్రంథమును మథింపగా వెలువడిన నవనీతము ముత్తెఱగుల నిట్లు వ్యక్తమాయెనని చెప్పవచ్చును. తాత్త్విక మానసిక దార్శనిక విషయములను తఱచితఱచి మథన మొనరింపగా వెలువడెడి విశిష్టా

ద్వైతసారరూప మధురామృత మదియే. తత్త్వము-హితము-పురుషార్థము అనునవి రహస్యత్రయసార గ్రంథమునందలి మూలసూత్రములు. ఇట తత్త్వము శ్రీమన్నారాయణుడుగా-జీవాత్మలకు పరమాత్మగా - సృష్టిస్థితిలయ కర్తగా- పరంధాముడుగా నిరూపింపబడెను. ఆ పరమాత్ముడే భక్తులకు సాధనము, సాధ్యమును. శ్రీమన్నారాయణుని అనుభూతికి వెచ్చుకొని నిత్యానందలోలు రగుటకు తత్త్వము సాధనముగా - ఆధ్యాత్మికదివ్యప్రయత్నము హితముగా నిర్వచింపబడెను. ఇక పురుషార్థము:- సత్యమును దర్శించి - జీవితసర్వస్వముగ భావించి మనుగడను సఫలీకృత మొనర్చుటకై సాగించెడి కృషియే పురుషార్థము. ఇందు 'మూలమంత్రము, ద్వయము, చరమశ్లోకము' అనునవి రహస్యత్రయమని యెఱుకపఱచబడెను,

మూలమంత్రము:- దీనిని దీక్షామంత్రమనవచ్చును. "ఓం నమః నారాయణాయ" అను అష్టాక్షరములతో నిబద్ధమై యుండుట వలన దీనిని అష్టాక్షరీమంత్ర మనియు పిలుతురు. ఇందు మొదటిది: ఏకాక్షరమగు 'ఓం'. ఇందు మూడు భాగములు గలవు: 'అ-ఉ-మ్'. రెండవది: 'నమః'. నమః అనగా భగవంతున కర్పణము. మూడవది: 'నారాయణాయ' అనగా నారాయణునకు ప్రణామము. భక్తుడు తనను సమర్పించుకొనుట 'ఓం'. అనగా నారాయణునకు నన్నర్పించుకొందు ననిభావము. ఈ మూలమంత్రమే- అష్టాక్షరీమంత్రమే-తిరుమంత్రము.

ద్వయమంత్రము:– "శ్రీమన్నారాయణచరణౌ శరణం ప్రపద్యే। శ్రీమతే నారాయణాయ నమః॥" ఇందు రెండు భాగములు గలవు. 'సదా శ్రీతో గూడియున్న నారాయణుని పాదపద్మములను శరణు వేడుదును' అనునది మొదటిభాగము. శ్రీతో గూడియున్న నారాయణునకు నమస్కరింతును' అనునది రెండవ భాగము.

చరమశ్లోకము:– "సర్వ ధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ। అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః॥ (భగవద్గీత: అధ్యా–18, శ్లో–66) "అన్నిధర్మములను విడచిపుచ్చి నన్నే శరణుపొందుము. సర్వపాపములనుండి నిన్ను నేను విముక్తుని జేయుదును. దుఃఖింపకుము". ఇవి రహస్యత్రయము నందలి విశిష్టభావములు. వీనిని భగవంతున కాత్మార్పణము గావించుటను వివరించువిషయము లనవచ్చును. ఇట్టి యీపరమ పవిత్రరహస్యతత్త్వములను శ్రోత్రియు డగు పరమగురువుసన్నిధిని శిష్యుడు సక్రమమార్గమున నెఱుకకు దెచ్చుకొనవలెను. తదుపరి దీక్షగ ధ్యానించుచు, నిష్ఠగ నాచరించుచు పరమార్థమును సాధింపవలెను.

## విశిష్టాద్వైత ప్రత్యేక సిద్ధాంతము

భగవంతుడు 'శరీరి', 'జీవులు (చేతనులు) ను జడప్రకృతియు' శరీరము అని విశిష్టాద్వైతము మనకు వినిపించు విలక్షణమగు ప్రబోధము. భగవంతుడు శరీరి గదా. ఆయనకొఱకు

జీవించు శరీరమునకు ఆయనయే రక్షకుడు - పోషణకర్త - అధినేత. అనగా భగవంతుడు శరీరమును తన స్వాధీనమునందిడుకొని దానిని నడపు పరమపురుషుడు. ఇక జీవాత్మయు జడపదార్థమగు ప్రకృతియు తమ యునికిని ఆయన యిచ్ఛానుసారము వర్తింపజేయును. 'శేషి-శేష' భావమన నిదియే. వైష్ణవసిద్ధాంతమున కీ 'శేషి-శేష' భావము ఆయువుపట్టు; పునాదివంటిది. ఇందు శేషపదవాచ్యులు పరార్థజీవులై యుందురు. 'శేషః పరార్థత్వాత్'. పతిపరాయణయైన స్త్రీ యలంకారములను భర్త యానందించుటకొఱకే ధరించును. తన యతిశయమును ప్రకటించుకొనుటకు గాని - తన సంతృప్తికొఱకు గాని - ఆమె యెన్నడు నేదియు జేయదు. కాబట్టి శేషు డొనరించు ప్రతికార్యము పరార్థమునే యుద్దేశించును. పరునియం దతిశయము నాధానముచేయు కోరికతో నుపాదేయత్వము స్వరూపముగా గలవాడు శేషుడు. పరుడు శేషి యనబడును. "పరగతాతిశయాధానేచ్ఛయా ఉపాదేయత్వ మేవ యస్య స్వరూపం స శేషః, పరః శేషి" పరునకు ప్రయోజనము గలిగించుటయే యెవనికి పరమప్రయోజనమో యతడు శేషుడు. "యస్య పరప్రయోజన మేవ పరమప్రయోజనం స శేషః." (రామాయణ సుధాలహరి - యుద్ధకాండ - పుట 1021) ఇది సదసత్తులకు భగవంతునితో గల సంబంధమును జూపును. ఆత్మార్పణసిద్ధాంతమునకు ప్రధానకీలకముగూడ నిద్దియే. శేషి ప్రయోజనమునకు జీవాత్మ, జడప్రకృతి శేషులుగ ఆయనలో తమ యునికిని

గలిగియుండును. భగవంతు డగు శేషి తన ప్రయోజనము కొఱకు శేషుని పోషించి రక్షించుచుండును. జీవాత్మ, ప్రకృతి ఇవి తమ యునికిని - జీవితసారమును భగవంతునినుండియే పడయును. ఆయన సంకల్పముపైననే యాధారపడియుండును. జీవాత్మ పరమాత్మల యిట్టి యన్యోన్యసంబంధము జీవాత్మ మానసికతత్త్వముపై ప్రత్యేకప్రభావమును గలిగియుండును. జీవాత్మ భగవంతునితో నెడతెగని సంబంధమును గల్గియున్న దన్న - తనపరమలక్ష్యము నెడ ఆకాంక్షను గల్గియున్న దన్న- ఆ లక్ష్యమును సాధించి యనుభవించుటకు ప్రత్యేకోపాయమును గల్గియున్న దన్న - వీనికి మూలాధారము శ్రీమన్నారాయణుడే; శేషియే. ఈయనను నియంత యని చెప్పనొప్పును. పైన చూపెట్టిన సర్వభావములకును త్రిభాగములు గల యేకాక్షర మగు ఓం కారమే బీజము. ఇక మూలమంత్రమందలి నారాయణశబ్దనిర్వచన మెద్ది? 'నారాః అయనం యస్య సః' మానవులు నారాయణునకు శయనించుస్థానము, లేదా 'నారాణాం అయనం' నరులకు శయనించుస్థానము అని చెప్పవచ్చును. అనగా జీవాత్మ తన యునికిమనుకులకు నారాయణునే యాధారముగ బడసియున్నది. ఆయనచేతనే యావరింపబడియున్నది. ఇక 'ఓం, నమః' అను పదములు 'జీవాత్మ తన యునికిని భగవంతునికొఱకే కలిగియున్నది. తన సర్వస్వమునకు ఆయనపైననే యాధారపడియున్నది' అని తెలుపును.

ఇక ద్వయమంత్రము మంత్రరత్న మను నన్వర్థనామముతో గీర్తింపబడుచున్నది. జీవునకు భగవంతుడు తక్క వేఱొండు రక్షకుడు లేడని యిది స్పష్టముగ నిరూపించు చున్నది. ఇంతే కాదు. నారాయణుని ప్రయోజనముకొఱకే తనయునికిని గలిగియున్న దనియు దెలియబఱచుచున్నది. ఇక మూడవ రహస్యము ఆధార - ఆధేయభావమును గూడ జూపెట్టును. ఇట్లు శరీరి - శరీర భావమును, శేష - శేషి భావమును, ఆధార-ఆధేయభావమును గురువు శిష్యునకు వివరించిన తదుపరి అర్థపంచకమును ప్రబోధించును. చూడుడు :—

"ప్రాప్తస్య బ్రహ్మణో రూపం ప్రాప్తుశ్చ ప్రత్య గాత్మనః
ప్రాప్త్యుపాయం ఫలం చైవ తథా ప్రాప్తివిరోధి చ"

(హారీతసంహిత)

ఇదియే అర్థపంచకము. ఇందలి నైదు భావములను గాంచుడు ! 1. ప్రాప్యస్వరూపము :— మనము పొందవలసిన చరమలక్ష్యమగు భగవత్స్వరూపము. 2. ప్రాప్తృస్వరూపము:- బ్రహ్మమునే శరీరిగ గుర్తెఱిగి దాని నన్వేషించు జీవాత్మ స్వరూపము. 3. ప్రాప్త్యుపాయము :- భగవంతుని జేరుటకు ప్రధానసాధనములగు సిద్ధోపాయము, సాధ్యోపాయము. ఇందు శ్రీమన్నారాయణుడే సిద్ధోపాయము. ఇది స్వయంప్రకాశమాన మగు సహజసాధనము. భక్తిప్రపత్తులే సాధ్యోపాయము. 4. ఫలప్రాప్తి :- భగవదనుభూతి లభించు ఫలము. నారాయణుని ప్రత్యక్షముగ గాంచుచు ఆయన సన్నిధిని నిత్యా

నందము ననుభవించుచుండుటయే యీఫలము. 5. ప్రాప్తి విరోధి :- భగవంతుని గాంచుటలో గల యాటంకములు. అనగా అజ్ఞానము, అహంకారమమకారములు, దుష్టకర్మలు మున్నగు ప్రబలవిరోధులు. ఈప్రబలవిరోధిగణమును అరిషడ్వర్గ మని నుడువవచ్చును.

'ఓమ్' ఇందలి ప్రథమాక్షరమగు 'అ' మూలమంత్ర మందలి నారాయణ శబ్దము. 'అకారార్థో విష్ణుః' (అష్టశ్లోకి). ద్వయమంత్రములోని శ్రీమన్నారాయణుడు - చరమశ్లోకము నందలి 'అహం, మాం' అనునవి మన మనుభూతికి దెచ్చుకొన వలసిన భగవంతుని స్వరూపమును జూపెట్టును. అర్థపంచకము లోని ప్రథమసత్యమగు భగవంతుని నిష్ఠగ ధ్యానించునపుడు శ్రీనారాయణునితో 'శ్రీ'కిగల నిరంతరసంబంధమును గుర్తుకు దెచ్చును. ఓంకారములోని మకారము జీవాత్మస్వభావమును జూపెట్టును. 'మకారో జీవవాచకః' (అష్టశ్లోకి). మరియు మూల మంత్రములోని 'నమః', మూలమంత్రములోను, ద్వయమం త్రములోను గల 'నారాయణ' శబ్దములోని 'నారా', ద్వయ మంత్రములోని 'ప్రపద్యే', చరమశ్లోకములోని 'వ్రజ' 'త్వా' 'మాశుచః' అనునవి జీవాత్మ నిజస్వరూప స్వభావముల నెఱుక పఱచును.

అంత్యలక్ష్యమును సాధించుటకు, సిద్ధిని బడయుటకు, భగవంతుని ప్రత్యక్షముగ గాంచుటకు ఇవి సాధనములు-ఉపా

యములు. 'నారాయణాయ' అను మూలమంత్రములోని 'నమః', 'అయన' లలోను, ద్వయములోని మొదటి పదములోను, సర్వ స్వమును విసర్జించి నారాయణునే శరణువేడుము : అనునవి చరమశ్లోకములో గలవు.

"సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ"

అనునదే యీచరమశ్లోకము. మూలమంత్రమునందలి 'నారాయణాయ' అను పదములోని 'అయన' – ద్వయములోని 'నమః' – చరమశ్లోకములోని 'మోక్షయిష్యామి' అనునవి భగ వంతుని అనుభూతికి దెచ్చుకొన్న ఫలస్వరూపమును జూపును. భగవంతుని దర్శించుటకు ప్రబలవిరోధులగు 'నేను', 'నాది' మున్నగు నాటంకములు, మూలమంత్రములోని 'అహం' (నేను) 'మమ' (నది) – ద్వయములోని 'నమః' – చరమశ్లోకములోని 'సర్వపాపేభ్యః' అనువానిని ఈయాటంకములుగా జూపును.

## మూలమంత్రము

జీవాత్మ పరమాత్మవశమని మూలమంత్రము జీవాత్మనిజ తత్త్వమును నిరూపించును. భగవంతుని గాంచుటకు జీవుడు పయనించు మార్గస్వభావస్వరూపములను 'ద్వయము' చూపె ట్టును. ఆ మార్గామోదమును చరమశ్లోకము చూపెట్టును.

ప్రతిరహస్యత్రయములోను ఈపంచసత్యములు లీనమై యున్నను ప్రతిరహస్యమును తన ప్రత్యేకవిశిష్టత నొకదానిని గలిగియున్న దని చెప్పవలయును. న్యాసవిద్యలోని పరమరహ

స్యము ప్రణవము. అనగా ఓంకారము. దీనిని వేదసార మన నొప్పును.

"ప్రణవో ధనుః శరో హ్యాత్మా బ్రహ్మ తల్లక్ష్య ముచ్యతే"
(ముండకోపనిషత్తు)

మూలమంత్రములోని 'ఓమ్' శబ్దమునందలి 'అకారము' బ్రహ్మము–నారాయణుడు. నారాయణుడే సర్వమునకు మూలాధారము - ప్రాప. ఈ కారణముచేతనే శ్రీకృష్ణుడు అక్షరము లలో అకారము నేనే యని ప్రబోధించెను. అక్షరమాలలో ప్రథమాక్షరము అకారమే గదా. అక్షరసమామ్నాయముతో శబ్దముల రూపమున - వాక్యముల రూపమున సూచింపబడు సర్వమునకు నారాయణుడే మూలము. సృష్టికి ఉపాదాన నిమిత్త కారణములు నారాయణుడే గదా. 'అ' అనగా రక్షకుడైన భగవంతుడు. ఇది 'అవ' అను ధాతువునుండి వ్యుత్పన్నమైనది. 'అవ' యనగా రక్షించుట - కాపాడుట. ఇక 'ఉ' అక్షరము (శ్రీ) - లక్ష్మి అనిగాని, 'మాత్రమే' అనిగాని భావము. జీవాత్మ (శ్రీ)మన్నారాయణునకు వశము. ఆయనకు లోబడి తానుండునను అర్థమును మొదటి భావము సూచించును. ఇక రెండవ భావమగు 'మాత్రమే' ఒక్క భగవంతునకు మాత్రమే జీవాత్మవశత్వము అన్వయించును అను భావమును విశదీకరించును. ప్రణవాక్షరము వెల్లడించెడు నీరెండర్థములను వాల్మీకి తన రామాయణమున స్పష్టముగ జూపించెను.

"అగ్రతః ప్రయయౌ రామః, సీతా మధ్యే సుమధ్యమా
పృష్ఠతస్తు ధనుష్పాణిః లక్ష్మణోఽనుజగామ హ"
(రామాయణము - అరణ్యకాండ - 1 వ అధ్యాయము - 1 వ శ్లోకము)

రాముడు ముందును సీత నడుమను ధనుష్పాణియైన లక్ష్మణుడు వెనుకను నడువసాగిరి. మొదటగల 'అ' రక్షకుడైన రాముని, మధ్యనున్న 'ఉ' సీతను (శ్రీని) - భగవంతునితో గూడియున్న శేషిణిగాను, వెనుకనున్న 'మ్' లక్ష్మణుని రామునికి కింకరునిగా - సర్వథా వాని వశమునందున్న దాసునిగా సూచించును. ఇట్లు ప్రణవములో 'అ' భగవంతుడు రక్షకుడుగను, 'ఉ' మధ్యనుండి సంధానకర్త్రిణిగనున్న (శ్రీ) పురుషకారముగను, 'మ్' రక్షింపబడనున్న జీవాత్మగను సూచించును. ఇక 'నమః' అనుపదము భక్తుడు తన రక్షణార్థము గావించు ప్రార్థనను సూచించును. ఈరక్షణమునకు భగవంతుడే బాధ్యత వహించును. జీవాత్మ పూర్తిగ భగవంతుని శరణుజొచ్చి ఆత్మార్పణము గావించుకొన్న వెంటనే భగవంతుడు జీవాత్మను రక్షించు బాధ్యతను వహించును.

> "సమిత్సాధనకాదీనాం యజ్ఞానాం న్యాస మాత్మనః
> నమసా యోఽకరోద్దేవే స స్వధర్మ ఇతీరితః".
>
> (అహిర్బుధ్న్యసంహిత - అధ్యా. 37-శ్లో. 37)

'నమః' లోని 'మ' జీవాత్మను, 'న' కాదు - లేదు అను అర్థమును - అనగా 'న మమ' (నాదికాదు) అనుభావమును సూచించును. దీనినే శేషి-శేష భావసూచక మనవచ్చును. 'నమస్' అనుపదము మూడర్థములను జూపెట్టును.

1. నమస్ = అహం న మమ – నేను నేను కాదు.

2. నమస్ = యశ్చ కశ్చన కృతయో మమ భవన్తి. మమ మమతా నాస్తి తాసు. అనగా నాచేతలు నావి కావు. అవి నాకు చెందవు.

3. నమస్ = భగవత ఏవ తాః – ఇవి యన్నియును భగవద్వశములే.

ఇట్లే అహిర్బుధ్న్యసంహితయు 'నమస్' అనుపదమునకు మూడర్థములు చూపుచున్నది. 1. సామాన్యము (స్థూలము) 2. మధ్యమము (సూక్ష్మము) 3. ఉత్తమము (సూక్ష్మాతి సూక్ష్మము).

భగవంతుడు పురుషోత్తముడు. జీవరాసులన్నియు వానికి దాసులు. ఎట్టి స్వార్థభావము లేక జీవుడు పురుషోత్తమునకు నమస్కరించినప్పుడు – భగవంతుడు శేషి, తాను శేషుడ నని తలంచినప్పుడు – దీనిని 'నమన' అందురు. మరియు శేషుడొనర్చిన నమస్కారమునకు అనుగ్రహపూర్వకముగ పురుషోత్తముడు (శేషి) వశుడైనను దానిని 'నమస్' అందురు. నమః అని యుచ్చరింపగనే – దానిని హృదయములో స్పందింపజేయగనే – జీవి తనశరీరమును వంచి సాష్టాంగనమస్కారము గావింపగనే దానిని పరిపూర్ణమగు 'నమః' గనే భావింతుము. దీనికి భిన్నమైన యెట్టి నమస్కారమైనను అది లోపభూయిష్ఠమే.

"వాచా నమ ఇతి ప్రోచ్య మనసా వపుషా చ యత్
తన్నమః పూర్ణ ముద్దిష్టం అతోఽన్యత్ న్యూన ముచ్యతే"

నమస్సునకు సామాన్యార్థ మిది. ఇక జీవుడు తనను తనయాస్తిపాస్తులను తనవిగ భావించినపుడు 'మమ' (నాది) యను వక్రార్థమును సూచించును. తనది యను ఆసక్తిని ప్రకటించును. సక్తప్రవృత్తులను ప్రదర్శించును. వీనిని వదల్చుకొనుటకు 'ఇవి నావి కావు' (మేన) అను వ్యతిరేకభావమును సదా ప్రకటించుచుండవలెను. అనగా 'జీవాత్మ తన యునికిని భగవంతునికొఱకే కలిగియున్నది. కాని తనకొఱకు మాత్రము గాదు'. ఆత్మార్పణముతో 'నమః' అని యుచ్చరించినచో నేను, నాది అను వక్రభావములో నమసిపోవును. ఇది నమస్సునకుగల సూక్ష్మభావము. నమస్సులో 'న' దారిని, 'మ' ఆమార్గానుగమన ప్రయోజనమును, 'స్' గమ్యమగు పురుషోత్తముని సూచించును. ఇది యుత్తమమార్గము.

"పంథా నకార ఉద్దిష్టో మః ప్రధానో నిరూప్యతే
విసర్గః పరమేశ స్తు తత్రార్థోఽయ ముదీర్యతే".

భగవంతుడే పురుషోత్తముడు. ఆయన ననుభూతికి దెచ్చుకొనుటకు ప్రధానసాధనము 'నమన' అనవచ్చును. అనగా ఆయనయే ఉపాయము, ఉపేయము గూడ.

"అనాదిపరమేశోఽయం శక్తిమాన్ పురుషోత్తమః
తత్ప్రాప్తయే ప్రధానోఽయం పన్థా నమన నామవాన్".

నమః అను పదమునకు శాస్త్రసమ్మతమైన, సక్రమమైన ప్రధానార్థ మిదియే. జీవాత్మకు 'నమన' సహజము. సూక్ష్మ విషయమున జీవాత్మస్వరూపస్వభావములు వివరింపబడినవి.

అందువలన 'అహమ్'ను విసర్జించి ఉపాయముల నన్వేషించి సాధనముల నవలంబింప సాధ్యమగును. భగవంతుడే సిద్ధోపాయము. ఆత్మార్పణము అను సాధనోపాయముతో భక్తుడు భగవంతుని సంతృప్తిపఱచి ఆయనయనుగ్రహమునకు పాత్రుడగును. మూలమంత్రమే ప్రణవముయొక్క వ్యాప్యము. ఇది బ్రహ్మమే - నారాయణుడే యని నిరూపించును. మంత్రములోని నారాయణశబ్దము యోగరూఢము. ప్రణవమునందలి ప్రథమాక్షరమగు 'అ' సర్వరక్షకుడగు పరమాత్మను జూపెట్టును. సర్వసృష్టికి - ఉనికికి ఆయనయే మూలము. శేషి - శేషుల సంబంధమును జూపెట్టు నారాయణుడు ప్రధానస్థానము నలంకరించును.

"నారాయణాయ విద్మహే వాసుదేవాయ ధీమహి
తన్నో విష్ణుః ప్రచోదయాత్" (విష్ణుగాయత్రి)

ఇది నారాయణుని లక్షణములను గూడ నిరూపించును.

"కారణత్వ మబాధ్యత్వ ముపాయత్వ ముపేయతా
ఇతి శారీరకస్థాప్య మిహ చాపి వ్యవస్థితమ్" (బ్రహ్మసూత్రములు)

సృష్టికి మూలకారణము భగవంతుడే. దీనిని నిరాకరింపజాలము. ముక్తిదాయకుడును ఆయనయే. అనుభూతికి దెచ్చుకొనవలసినవాడును ఆయనయే.

1. నరశబ్దము నారాయణశబ్దమునుగూడ సూచించును. నారాయణుడు సర్వవ్యాపకుడయ్యును దేనివలనను ఆయన కలుషీకృతుడు కాడు. అంటబడడు. తామరాకుపై నీటిబిందువు

వంటివాడు. 2. నరుడే నారాయణుడు. ఆయన జీవాత్మల నడపును. నృ నయే. నృ ధాతువు నడపుటయందు వర్తించును. నృణంతి = నయంతి సర్వం స్వ వశమితి నరాః. 3. జన్హు = నారాయణ, నర నామములు భగవంతునికే అన్వయించునని సహస్రనామ స్తోత్రావళిలో చెప్పబడియున్నది. 'నారాః' అనగా జలము (జీవాత్మప్రకృతులు). నరునిసంతతి అనగా నారాయణునిసంతతియే యని మనువు నుడివెను.

1. అయనః = ఈయతే అనేన – ఇట భగవంతుడే మార్గమగును. 2. ఈయతే అసౌ – ఇట భగవంతుడే లక్ష్యము. 3. ఈయతే అస్మిన్ – భగవంతుడే సర్వమునకు మూలము. నారాయణాయ లోని 'అయ' జీవుని సర్వసపర్యలను స్వీకరించు భగవంతుడని చెప్పవచ్చును. ఈ 'అయ'యే గుప్తముగ నణగియున్న మంత్రశక్తిని సూచించును. ఇది ఫలమును పొందుటను లేక ఫలమునుపొందుటకు యోగ్యమైన ప్రార్థనమును సూచించును. ఇది సంప్రదానమును – అనగా మన ప్రార్థనముల నందుకొను నారాయణునిగూడ (శేషిని) సూచించును. జీవాత్మకు తనదని చెప్పుకొన్న దేదియును లేదు. సర్వమును భగవంతునకు జెందినదే. కాబట్టి జీవాత్మ నారాయణునకు జెందినదానినే వానికి సమర్పించును. ఇట్లు మూలమంత్రము నారాయణుడే రక్షకుడు-నారాయణుడే మూలము-నారాయణుడే సాధ్యము (లక్ష్యము) అని నారాయణుని నిజతత్త్వమును స్వస్వరూపమును కొండ నద్దములో వలె జూపెట్టును.

## ద్వయమంత్రము

ద్వయమంత్రము మంత్రరత్న మననొప్పును. ఇందు రెండు భాగములు గలవు. ఇది శ్రీమన్నారాయణుని పాద ద్వయమును పొందుటను నిరూపించును. మరియు నీమంత్రము నొక్కసారి యుచ్చరించిన యేభక్తు నైనను వాని విధులను సక్రమముగా నిర్వహింపజేయు శక్తిమంతమైన మంత్ర మిది. శ్రీపతియే (శ్రియఃపతి) విశ్వమునకు మూలము. భక్తుని పతనావస్థనుండి యుద్ధరించి పావనుని గావించుటకు శ్రీ (పురుష కారము) భగవంతుని వక్షస్థలమునుండియే వానికి దోడ్పడును. జీవుడు తన నిరాధారతను గుర్తెరింగి శ్రీపతిపై తన దృష్టులను లగ్న మొనర్చును. జీవాత్మ తన యహంకారమును స్వీయ బాధ్యతలను వీడి భగవంతునిపై ననే తన సర్వస్వము నిడును. ఆయనకు తన్ను పూర్తిగ సమర్పించుకొనును. ఆయన కరుణా కటాక్షమునకే - రక్షకత్వమునకే తనను పాత్రుని గావించు కొనును. ఇట్లు ద్వయమంత్రము తన ప్రథమభాగమున ప్రబోధ మొనర్చును. ఇక రెండవభాగము మోక్షమును బడయుటను గూర్చి ముచ్చటించును. అనగా జీవాత్మ శేషుడుగా భగవం తుని కొఱకే తాను జీవించుచు నిరంతర మాతనికి సభక్తిక ముగ సపర్యలను గావించుచుండును. చూడుడు :-

"ముముక్షుర్వై శరణ మహం ప్రపద్యే" (శ్వేతాశ్వతరోపనిషత్తు)

ఈ విషయమునే రామానుజాచార్యుల గద్యత్రయము, యామునాచార్యుల స్తోత్రరత్నము బాగుగా నిర్వచించినవి.

త్వత్పాదాబ్జం ప్రవిష్టోఽస్మ్యహ మిహ
సతతం దాసభూతోఽస్మ్య నాథః

ఈ రహస్యమును "ద్వయ" మందురు. ఏలన నిది యుపాయ మను మార్గమును, ఉపేయ మను లక్ష్యమును జూపెట్టును. వాల్మీకి తన రామాయణమునం దీ భావమునే విస్పష్ట మొనర్చినాడు. లక్ష్మణునకు రాము ననుకరించుట తక్క వేఱొండు మార్గము లేదు. ఆయన రామునే శరణు చొచ్చెను. రామకింకరుడుగ – రామదాసుడుగ ప్రఖ్యాతి చెందెను.

"స భ్రాతు శ్చరణౌ గాఢం నిపీడ్య రఘునందనః
సీతా మువా చాతి యశా రాఘవం చ మహావ్రతమ్"
"భవాం స్తు సహ వైదేహ్యా గిరిసానుషు రంస్యతే
అహం సర్వం కరిష్యామి జాగ్రతః స్వపతశ్చ తే"
(రామా - అయోధ్య, 31 సర్గ. 2, 27)

ద్వయమంత్రము రక్షకు నెన్నుకొనుటను (శరణవరణమును), జీవుడు వానికి తన్నర్పించుకొను బాధ్యతను (భారమర్పణమును) జూపెట్టును. ఈ మంత్రమున నిగూఢముగ నున్న దివ్యశక్తి యపారము. దీని దీక్షకు జప హోమాది కార్యకలాపము లనవసరములు. ఏ విధముగనైన – ఏ మార్గముననైన దీనిని జపింపవచ్చును.

"యేన కేనాపి ప్రకారేణ ద్వయ వక్తా త్వమ్."
(శరణాగతి గద్య :- శ్రీమద్రామానుజాచార్యులు)

ద్వయమంత్రమునందలి మొదటిపదము "శ్రీమన్నారాయణ చరణౌ" భగవంతుడగు నారాయణుని సూచించును. "శ్రీమత్" శబ్దము నారాయణునితో లక్ష్మి లేక శ్రీ నిరంతర ముండుటను సూచించును. శ్రీ శబ్దముయొక్క నానార్థములను గాంచుడు :-

1. 'శ్రీయతే' భగవంతు నాశ్రయించి యుండునది. 2. 'శ్రయతే' భక్తులచే నాశ్రయింపబడునది. 3. 'శృణోతి' దీనాలాపములను వినునది. 4. 'శ్రావయతి' దీనులను రక్షింపుమని భక్తులకు వినిపించునది. 5. 'శృణాతి' - శృణాతి నిఖిలాన్ దోషాన్: భగవత్ప్రాప్తికి విరోధులగు నాశ్రిత పాపములను నశింపజేయునది. 6. 'శ్రీణాతి' శ్రీణాతి చ గుణై ర్జగత్: ఆశ్రితులకు కైంకర్య పర్యంతము గుణపరిపాకము గలిగించును. దీనికి కారణము కరుణయే. అనగా భగవంతు నే స్వరూపమున నాశ్రయించినను భక్తులగువారు లక్ష్మీవిశిష్టునిగ నాశ్రయింపవలెను.

భక్తుడు దివ్యమాతను - పరమపావని యగు శ్రీని అర్థించిన వెంటనే ఆభక్తుని తరింప జేయుటకై విష్ణుని హృదయపద్మమునందు సుస్థిర నివాసము గావించుకొనియున్న శ్రీ మహాలక్ష్మి భక్తునికొఱకు తన పతిని రక్షకునిగా పరివర్తన మొనరించును. భక్తుని తరింపజేయును. శాసనపాలనాధికారములపై మాతృప్రేమ తన పతాకను పాదుకొల్పుటను పరాశరభట్టరు మహాశయులు శ్రీగుణరత్నకోశమున స్పష్ట మొనరించెను.

"పితేవ త్వత్ప్రేయాన్ జనని పరిపూర్ణాగసి జనే
హితస్రోతోవృత్త్యా భవతి చ కదాచిత్ కలుషధీః
కిమేతత్ నిర్దోషః క ఇహ జగతీతి త్వముచితైః
ఉపాయైః విస్మార్య స్వజనయసి మాతా తదాసి నః."
(గుణరత్నకోశము 52 వ శ్లోకము)

ఓ మాతా! తండ్రివలె మాకు శ్రేయమునందించు నీ ప్రియభర్త అపుడపుడు పతితులమగు మాయెడ నసంతృప్తిని జెందుచుండును. అట్టి సమయములలో ప్రపన్నులమగు మా పక్షమున తల్లివగు నీవు జోక్యమును గల్గించుకొని ఆ పరంధాముని కిట్లు చెప్పెదము. "ఈ కోప మెందులకు ? ప్రపంచమున తప్పు చేయనివా డెవడున్నాడు ? ఇట్టి పలుకులతో తమ పాపములకు పశ్చాత్తాపమును వెలిబుచ్చు ప్రపన్నులయెడ నాయన కోపము నుపశమింపజేయుదము; ప్రపన్నుల దోషములను విస్మరింపజేయుదము. ఇందులకే నీవు మాకు మాతవు."

అని తన్నాశ్రయించిన జీవుల – దీనుల విషయమున నామె సర్వేశ్వరుడగు తన భర్త కిట్లు విన్నవించును. "అపార కరుణాసాగరా! ఈ ప్రపన్నుల నేల యిట్లు చేయబూనితివి. ఈ దీనుల తిరస్కరించుట పాడిగాదు. పిచ్చుక మీదనా! బ్రహ్మాస్త్రము. నీవు కోపించిన వీరిగతి యేమి ? వీరికి వేఱు రక్షకు లెవ్వరు గలరు ? ఇట్టి పతితుల యెడ గాకున్నమీ దయాగుణ మెవరియెడ ? అపరాధుల నెల్ల దండింప బూనినచో లోకమున నపరాధము చేయనివా రెవరుగలరు? నీ రక్షాకంకణ

మెవ్వరి విషయమున సార్థకమగును? అని బోధించి శాంతింప జేయును. తన స్వాభావికమగు వాత్సల్యముచే నీ చేతనుల నుజ్జీవింప జేయును- ఆయన దండనేచ్ఛను నివర్తింప జేయును. ఇదియే పురుషకారము. మూర్తీభవించిన భగవత్కారుణ్యరసమే 'లక్ష్మీదేవి'. కావున నామె 'వాత్సల్యము' సౌలభ్యము గల తల్లి; భగవతి. భగవంతుని యందు వాల్లభ్యము గలది గావున ఆమె మాట నాయన నిరాకరింపడు. ఇది వస్తుస్వభావము. కాబట్టి శ్రీదేవి యనుగ్రహము నిమిత్త మితరుల నాశ్రయింపవలసిన యగత్యముండదు. బిడ్డకు తల్లి పాలిచ్చుట కితరుల ప్రమేయ ముండదు గదా.

శ్రీ శబ్దమునకు గల మొదటి రెండర్థములును ఆమెకుగల యపార కారుణ్యమును వివరించును. మనను కన్న తల్లి ప్రేమలో ఒకప్పుడైనను స్వల్పాతి స్వల్పమైన - స్వార్థపూరిత మైన కల్మష ముండిన నుండవచ్చునేమో గాని లక్ష్మీమాత ప్రేమ మాత్రము కలుషరహితము - స్వచ్ఛము - దివ్యము. తన పాపములకు పరితపించుచు - పశ్చాత్తాపమును వెలి బుచ్చుచు - తన్ను రక్షింపుమని భగవంతునకు జెప్పుమని ప్రపన్నుడు జగన్మాతయగు శ్రీని ప్రార్థించినంతనే ఆమెయ నాచేతనుని మొఱ నాలకించి పతితు డగువానిని రక్షింపుమని తన భర్తయగు భగవంతుని ప్రేరేపించును. ఇది మూడు నాలు గర్థముల భావమును జూపును. ఇక నైదవ యర్థమున ఆధ్యా

త్మిక మార్గమునకు గల సర్వకంటకములను – అన్ని యాటంకము లను ఆమెయే వైదొలగించును. ఆమె యపార కరుణాకటాక్ష వీక్షణమును – పరిపూర్ణ కృపారసమును వానిపై గురిపించి వానికి సక్రమమైన మార్గమున బయనించు నుత్తమ సంస్కారమును సమకూర్చి – దీక్షనందించి – భగవదారాధనమునకు వలయు యోగ్యతను ప్రసాదించును.

నారాయణునకు శ్రీతో గల అనన్య సంబంధమును శ్రీమన్నారాయణ శబ్దమున గాంతుము. నారాయణుడు అనంత కళ్యాణ గుణోపేతు డని 'శ్రీమత్' శబ్దము సూచించును. అనురాగము, మార్దవము, సౌశీల్యము, సౌలభ్యము, అనుకంప, ఆదరణాది కళ్యాణగుణములకు శ్రీమన్నారాయణుడు నిలయుడని సూచించును. 'చరణౌ' అను పదము భగవంతుని పాదపద్మ యుగళమునే గాక ఆయన దివ్యమంగళ మూర్తిని గూడ దెలియజెప్పను.

భగవంతుడు సర్వజ్ఞుడు, ఆనందనిలయుడు. అట్టి వాని దివ్యమంగళవిగ్రహము ఆయన కళ్యాణగుణగణముల నెఱుగని యజ్ఞులను గూడ నాకర్షించి ఆయనకు నిత్యసేవకులను గావించును. ఈ విధముగ వారిని పవిత్రులుగ పరివర్తింపజేయును. మూర్తం బ్రహ్మా తతోఽపి త ప్రియతరం రూపం య దత్యద్భుతమ్." (చతుః శ్లోకి – 4) ఇక ద్వయమునందలి 'శరణమ్' పదము ప్రత్యేక పద్ధతులతో సాధనముల గావించుటను నిర్వ

చించును. ఇట రక్షకుడగు భగవంతుడే సాధకుడు. భక్తు డెట్టి పరిశ్రమలను గావింప నగత్యము లేకయే వానిని సంరక్షించి తన సన్నిధికి జేర్చుకొనును. ఇక 'ప్రపద్యే' పదమున (భగవంతుని శరణు జొత్తును) 'పద్' వెళ్ళుట లేక ఎఱుగుట యని వ్యుత్పత్త్యర్థము. ప్రపద్యే : ఇది ఆత్మార్పణమునకు వలయు ప్రత్యేక జ్ఞానమును సూచించును. అనగా తన్ను భగవంతుడే రక్షించునన్న యాత్మ విశ్వాసమును స్ఫురింపజేయును. ప్రపత్తికి ఆరంగములు గలవని పాంచరాత్రాగమ శాస్త్రము చెప్పుచున్నది.

"ఆనుకూల్యస్య సంకల్పః ప్రాతికూల్యస్య వర్జనమ్
రక్షిష్యతీతి విశ్వాసో గోప్తృత్వవరణం తథా
ఆత్మనిక్షేప కార్పణ్యే షడంగా శరణాగతిః"

(లక్ష్మీ తంత్రము)

'ప్రపద్యే' యందలి 'ప్ర' అక్షరము గాఢమైన విశ్వాసమును సూచించును. భగవంతుడు తన్ను రక్షించునను ప్రగాఢ విశ్వాసమును భక్తుడు కలిగియుండును.

ద్వయమంత్రములోని ప్రథమభాగము భగవంతుని రక్షకత్వమును – ఆత్మార్పణసారమును – దాని సాధనములను – ప్రపన్నునకు వలయు యోగ్యతను వివరించును. ఇక ద్వయ మంత్రములోని రెండవ భాగము భక్తుడు భగవంతుని గాంచుటను – ఇందులకు వలయు ప్రత్యేక సాధనములను – భక్తుని యొక్క ప్రత్యేక విలక్షణ స్థితియగు శేషత్వమును వివరించును.

'శ్రీమన్నారాయణ'లోని 'శ్రీమత్' శబ్దము భగవంతుని మాతగను, పితగను నిర్వచించును. ఆయనయే మన సేవలకు - ఆరాధనలకు యోగ్యమైన నిలయము.

శ్రీశబ్దమునకు నానార్థములను జూపియుంటిమి గదా! అయ్యును నిట శ్రీయన సేవ యనియే భావము - శ్రిఞ్ సేవాయామ్. శ్రయతి హరిమితి శ్రీః. 'నారాయణ' అను శబ్దము శేషి శేషుల కలయికను సూచించును. భగవంతుని కలియవలయునను మధురభావము భక్తునిలో గలిగి ఆ భగవంతునింకను నెక్కువగ సేవింపవలెను. తన్ను పూర్తిగ వానికి సమర్పించుకొనవలె నను ఉదాత్తభావమును జూపెట్టును. నమః' స్వీయబాధ్యతను త్యజించుటను జూపును. 'నమమ' నాకొఱకు నేను జీవింపకుందును గాక అను నుత్తమభావమును జూపెట్టును. 'నమః' శబ్దము ఆటంకముల నిర్మూలించుట యను సామాన్యభావమును గలిగియున్నను ఇట మాత్రము తన సంకల్పమును - తాను కర్మలను గావించు బాధ్యతను - అనుభవమును - త్యాగమొనర్చు తత్త్వమును ఎఱుకపఱచు నని చెప్పుకొనవలయును. తన దుష్టచర్యలకు పశ్చాత్తాపముమ వెలిబుచ్చుచు తన్ను భగవంతున కర్పించుకొన్న ప్రపన్నుడు భగవంతుని శరణుచొచ్చినదే తడవుగ నా భగవంతుడే తన్ను జేరుమార్గమును తనకు జూపెట్టి - యందు సునాయాసముగ బయనింపజేసి - వాని సన్నిధికి జేర్చుకొను నని విశ్వసించి సర్వ

బాధ్యతలను స్వామికర్పించుకొనును. అప్పు డిక మిగులున దేమి ? నారాయణుడే. ప్రపన్నునకు ఆయ నొక్కడే శరణ్యుడు - అండ - రక్షకుడు - తారకము. సాధనసాధ్యములు గూడ నారాయణుడే. ఇది ద్వయమంత్ర ప్రబోధసార క్షీరము.

## చరమశ్లోకము

శ్రీకృష్ణుడు భగవద్గీతలో పార్థునకు ప్రబోధించిన అంత్య సందేశమే చరమశ్లోకము. ఇది సర్వదుఃఖముల దూరీకరించి మన మూహింప జాలనంతటి ప్రశాంతిని ప్రసాదించును. భక్తుని యారోగ్య రక్షణమునకు సర్వవిధములగు నితరౌషధము లన్నియు నొసగజాలనంత దివ్యశక్తిని ప్రసాదించు సిద్ధౌషధమే చరమశ్లోకము. కావున నితర సాధనములకు ప్రాకులాడక, వానిని గణింపక, యెట్టి పరితాపమును గలిగియుండక నిన్ను పరిపూర్ణముగ సంరక్షింపగల యీ ఒక్క దివ్యౌషధమునే హృదయపూర్వకముగ స్వీకరింపుము. నిండు భక్తితో సేవింపుము. అనేకమైన యితరౌషధములు నివారింప జాలిన భిన్న విభిన్న రోగములను ఈసిద్ధౌషధ మొక్కటియే నిర్మూలింప జాలును. ఈ యౌషధసేవనము ఆధిభౌతిక - ఆధిదైవిక - ఆధ్యాత్మికము లను త్రివిధములగు రుగ్మతలను నిర్మూలించి పరిపూర్ణారోగ్యమును ప్రసాదించును. సర్వసుఖములను అందించి యానందమున దేలించును. కావుననే భక్తుడు తన యారోగ్య

మును సుఖమును పోగొట్టుకొంటి నని విలపింప నగత్యముండదు. ఆ పరితాపము పూర్తిగా భస్మీపటల మగును. ఈ విధముగా వేదాంత దేశికులు చరమశ్లోక మాహాత్మ్యమును స్పష్టముగ వివరించిరి. భక్తుడు భగవంతుని సన్నిధికి జేరు నుపాయమును చరమ శ్లోకమునందలి ప్రథమరహస్యము ప్రబోధించును. ద్వితీయ రహస్యము ఉపేయమును సాధింప జేయును. వ్యక్తి యాచరింపవలె నను ధర్మశాస్త్రములు ప్రబోధించు సర్వధర్మములను పూర్తిగ విడిచిపెట్టు మని 'పరిత్యజ్య' పదము చూపెట్టును.

భక్తుడు ఆత్మార్పణమును తక్క మిగిలిన యన్ని సాధనములను, నెల్ల యుపాయములను విసర్జింపవచ్చును. ఆత్మార్పణ మొక్కటియే పరమశరణ్యము. దీనిని దివ్యాదేశముగ భావింపవచ్చును. ఆత్మార్పణమును గావించుటకు మరి యే యితర ధర్మమును గావింపవలసిన యగత్యము లేనే లేదు. 'సర్వధర్మాన్ పరిత్యజ్య' అను పదములకు వేదాంత దేశికులు ఆరు భావములను జూపినారు.

1. అశక్తాధికారత్వమ్ :- ఇతర సాధనముల నవలంబింప శక్తిసామర్థ్యములు లేని భక్తులకు ఆత్మార్పణము శరణ్యమగును.

2. అకించనస్య పురస్క్రియా :- 'మరి యే సాధనములను ఆచరణమునం దిడ జాలము' అను భావము గలవారిని ఆత్మార్పణమునకు యోగ్యులను గావించును.

3. ధర్మానా మనంగభావః :- ఆత్మార్పణ మొనర్చుటకు తదితరాంగముల యవసర మేమాత్రము నుండదు.

4. అశక్యారంభవారణమ్ :- అసాధ్యములని భావింపబడినవాని కన్నిటికిని సుదూరముగ నుండును.

5. తత్ప్రత్యాశాప్రశమనమ్:- అసాధ్యములని భావించుకొన్న యితరసాధనములను గూర్చి తలంపరాదు.

6. బ్రహ్మాస్త్ర న్యాయసూచనమ్ :- బ్రహ్మాస్త్రము ప్రయోగించిన తదుపరి యే యితరాస్త్రమును ప్రయోగింపరాదు. ఇతరాస్త్ర ప్రయోగము వలన బ్రహ్మాస్త్రము తన శక్తిని గోల్పోవును. ఇంద్రజిత్తు హనుమంతుని బ్రహ్మాస్త్రముతో బంధించిన తదుపరి రాక్షసులు హనుమంతుని త్రాళ్ళతో బంధింపగనే బ్రహ్మాస్త్రము తన శక్తిని గోల్పోయి విడివడెను. అట్లే ఆత్మార్పణమును గావించు ప్రపన్నులు శరణాగతిని తప్ప వేఱొండు సాధనమును ప్రయోగింపరాదు. ఇతర సాధనములు, అన్యప్రయోగములు శరణాగతి సత్ఫలితములను చెడగొట్టును.

చరమశ్లోకములోని 'మాం' పదమును గాంచుడు :- భగవంతుడు సర్వస్వాతంత్రుడు - మానవాతీతుడు మాత్రమే యగుచో ఆయనను జేరుట జీవుల కసంభవము. "అతీత శక్తి సంపన్నుడైన భగవంతుడు తమ్ము రక్షింపుమని నిర్మల స్థిరచిత్తముతో భక్తులు ప్రార్థింపగనే ముందుగ తా నీ విషయము

నెఱిగిన వానివలె ప్రపన్నుల నందఱను తన సన్నిధికి జేర్చు కొనును. వారిని సక్రమమార్గమున నడపి వరములను ప్రసాదిం సంసిద్ధుడై యుండును" అని లక్ష్మీతంత్ర ముద్ఘోషించుచున్నది. జీవాత్మలు అను నాభరణములు తమలోగల మాలిన్యా నెప్పుడు వీడునా, యెప్పు డవి పవిత్రము లగునా, యెప్పు డ తన్నలంకరించునా యని భగవంతుడు సదా నిరీక్షించుచుండును ప్రతిజీవియును భగవంతుని శరీరమునం దలంకరింపబడిన యొ యమూల్యాభరణము. అది నిర్మలముగ – పవిత్రముగ నున ప్పుడే ఆయన దేహమునం దలంకారముగ నుండగల యోగ తను బడయును.

భగవంతుడు సిద్ధోపాయుడు గదా. ఇట 'మాం' 'ఏకం' అను పదములు సిద్ధోపాయమునకు చిహ్నములు. జీవు తమ్ము రక్షింపు మనుచు నాత్మార్పణమును గావించుట భగవంతుని యాదేశము. 'ఏకమ్' అను పదమునకు వేదా దేశికుల వ్యాఖ్యను గాంచుడు :–

1. ఏకమ్:– ప్రాప్యస్యైవ ప్రాపకత్వమ్ – ప్రయత్నా లక్ష్యము లేక ప్రాప్యము.

2. స్వప్రాధాన్య నివారణమ్ :– స్వీయ ప్రయత్న కొంత వఱ కావశ్యకమే. కాని అంత్యమున నిది తన ప్రాధా న్యమును గోల్పోవును. ఏలన : – భగవంతుని యనుగ్రహా లక్ష్యమును సాధించును. ఫలము నందించును.

3. ప్రపత్తేః వ్యాజమాత్రత్వమ్ :- ప్రపత్తి నిమిత్త మాత్రమే. ప్రపన్నుడు ఆత్మార్పణమును పూర్తిగ గావించుటను మాత్రమే చేయవలెను. తత్‌క్షణమే ముకుందుడు ఫలమును ప్రసాదించును. ముక్తిని కరతలామలక మొనరించును.

4. అన్యోపాయైః అనన్వయః :- ఆత్మార్పణమునకు నితరోపాయములతో నన్వయించుకొను నగత్యము లేనేలేదు. అట్టి దనవసరము. పైపెచ్చు - ఆత్మార్పణము గావించిన ప్రపన్నుడు ఇతరోపాయములను చేపట్టినచో ప్రపత్తి తన దివ్య శక్తి ప్రభావమును గోల్పోవును. కావున నెట్టి పరిస్థితులందును ప్రపత్తిపై ప్రగాఢమగు విశ్వాసమును గోల్పోరాదు. అదియే ప్రధానమైన యంశము.

5. తదంగైరపి అసంబంధః :- ప్రపత్తికిని అప్రధానము లగు తదితర కర్మయోగాదులకును నెట్టి సంబంధమును లేదు.

6. సర్వసాధ్యే ష్వభిన్నతా :- మానవప్రయత్నముతో సాధించుకొను నెట్టి సాధనములకైనను ప్రపత్తియే ప్రత్యేక మూలసాధనము. ధర్మార్థాది జీవిత మూల్యములను ఆర్జించు కొనుటకైనను ప్రపత్తియే మూలసాధనముగ వెలుగొందును.

'శరణం వ్రజ' (శరణు పొందుము) అనునదే భగవదను గ్రహమును బడయుటకు పరమసాధనము. ఈ శరణవరణమును శ్రీకృష్ణు డర్జునున కుపదేశించెను. ఈ యుపదేశము మానవు

లందఱ కత్యావశ్యకమే. ఇది సర్వజీవుల కుపదేశింపబడి ప్రబో ధింపబడిన పారమార్థికోపదేశము.

జీవులలో – ముఖ్యముగ మానవులలో గల తారతమ్యముల నేమాత్రము పరిగణింపక సకలప్రజలకు సర్వ విశ్వాముననూ 'నీవే రక్షకుడవు, నీవే శరణ్యుడవు' అని రామానుజాచార్యులు తన శరణాగతి గద్య గ్రంథములో స్వామిని స్తుతించిరి. ద్వయ మంత్రమందలి 'ప్రపద్యే' అను పదమువలెనే యిట 'వ్రజ'యను పదము పరిపూర్ణమగు ప్రపత్తినే ప్రకటించును.

భగవంతుడే యంత్యఫలప్రదాయకుడైనప్పటికిని జీవాత్మ స్వీయప్రయత్నమును గావించుటలోను తన సంకల్పాను సారము నడకను సాగించుటలోను స్వతంత్రాధికారమును గలిగియున్నది. కాబట్టి 'వ్రజ' అనగా జీవాత్మ తన కార్యకలాపములను గావించుకొను సర్వాధికారములను గల్గి యున్నదని భావము. ఇట చరమశ్లోకములోని 'అహమ్' ప్రయోగము తదితరుల కెవ్వరికిని లేని మోక్ష ప్రదానాధికారము భగవంతునకు మాత్రమే కలదని నిర్ధారించును. భగవంతునకు గల సర్వస్వాతంత్ర్యము – సర్వశక్తిమత్త్వము అను లక్షణములు ఆధ్యాత్మికమార్గ ప్రయాణములో జీవునకు ఘటిల్లు నాటంకముల నన్నింటిని దొలగించును. ఇక ఆయన పరమ కారుణ్యము జీవునిలో గల సర్వదోషములను గమనింపకుండ జేయును. అనగా వానిని పూర్తిగ నిరాదరములతో నిరాకరింప జేయును.

జీవుని సర్వదోషముల నుండియు తప్పించి తరింపజేయు మహా శక్తి - దివ్యప్రభావము భగవంతునకు మాత్రమే కలదు. 'అహమ్' అనగా నేను మాత్రమే యని యర్థము. ఇక 'త్వా' (నిన్ను) అను పదము జీవుడు జ్ఞానియై సంసారక్షణికత్వము నెఱిగి తాత్కాలిక విషయముల వెంట పరుగులెత్తక భగవంతుని సత్యస్వరూపమును చక్కగ నెఱిగి యాయనకు ప్రపన్నుడై యాయనదే తన్ను రక్షించు భార మనుటను జూపెట్టును. 'సర్వపాపేభ్యః' - అసంఖ్యాకములగు నన్ని కర్మలు - అవి మంచివి గాని చెడ్డవిగాని - యేవి బంధనకారణములో వానిని జూపెట్టును. 'సర్వ' అను పదము అవాంఛనీయ విషయముల యెడ ప్రీతిని, రుచిని గలిగించు నవిద్యను, వాసనలను భౌతికవిషయములతో గల సంబంధమును జూపెట్టును. ఇవియే కర్మకు కారణములు - ఫలములును. పాప మనునది చెడ్డ సాధనము. 'చెడు' అనగా నవాంఛనీయముల నందించునదియును, వాంఛనీయముల నిరాకరించునదియు నని చెప్పవచ్చును. అనగా మంచిని నిరాకరించి చెడును చేకూర్చును. 'మోక్షయిష్యామి' అను పదము 'నీవు కోరినంతనే నీకు ముక్తి నొసంగుదు' నను భావమును జూపును. భగవంతుడపారకరుణానిధి. కావున జీవుని మోక్షమునకు కాలావధిని వానికే విడిచిపెట్టును. అనగా ముక్తి నెప్పుడు పడయవలయు నను విషయము జీవునిపైననే యాధారపడి యుండును. జీవుని సంకల్పమునకు వ్యతిరేకముగ భగవంతుడు దేనిని గావింప

నొల్లడు. జీవుడు ప్రపత్తిని - శరణాగతిని పొందిన క్షణముననే ముక్తిని బడయవచ్చును. లేదా దేహమును చాలించి నప్పుడైనను దానిని పొందవచ్చును. ఇది జీవుని యిష్టము పైననే యాధారపడియున్నది. మరియు నెల్ల యాటంకములను నాశన మొనరించుకొనుటయు నాజీవుని పైననే యాధారపడియున్నది. 'మాశుచః' (విలపింపకుము) - ఇది శ్రీకృష్ణు డర్జునునకు తాను లోగడ గావించిన వాగ్దానమునే బలపఱచి స్థిరీకరించుటను సూచించును.

అర్జునుడు తన ముక్తికి వలయు సాధనములను విని యోగింప నశక్తుడుగ నుండెను. భౌతిక విషయలంపటుడై గురు బాంధవులపై గల మమతకు వశుడై తన గమ్యమును స్పష్టముగ - నిర్దుష్టముగ గుర్తింపజాలక పోయెను. అర్జునుడు శ్రీకృష్ణుని శరణుపొందగనే ఆయనయే సర్వభారమును వహించి యర్జునుని విజయమునకు కారణభూతు డాయెను.

మూలమంత్రము శరణాగతిని బ్రకటింప - ద్వయమంత్రము తదర్థమును విస్తరించి, విశదీకరించి యాచరణమునం దిడు మార్గమును జూప - చరమశ్లోకము ఇతర సాధనముల నన్నింటిని త్రోసిపుచ్చి శరణాగతి యొక్కటియే జీవునకు పరమ సాధన మని నిరూపించుచున్నది. సర్వపాపములనుండి - సకల బీభత్సములనుండి నిన్ను సంరక్షించి నీకు మోక్షము నొసంగుదును; అను శ్రీకృష్ణ సందేశము మహాశక్తిమంతము. దివ్య

ఫలప్రదము. ఇది సకాలములో ప్రబోధింపబడిన తారకమంత్రము. శ్రీకృష్ణుడు ఈమంత్రమును ఒక్క అర్జునునకు మాత్రమే ప్రబోధింపలేదు. అర్జునుని నిమిత్తమాత్రముగ నిడుకొని ప్రజలందఱకు సర్వప్రపంచమునకు ఎలుగెత్తి చాటిన పరమపావన సందేశ మిది.

సంసార సాగరమున బడి దరిగానక కొట్టుమిట్టాడుచున్న ప్రజానీకమునకు భగవంతుడొసగిన యమృతప్రాయమైన సందేశ మిది. ఇది సులభముగ నాచరణమందిడుటకు యోగ్యమైన మహామంత్రము. ఉత్తమ సిద్ధాంతము. భగవదనుగ్రహసిద్ధికి నింతకంటె ప్రబలోపాయము వేఱొండు లేదు. ఇది యతిశయోక్తి కానేరదు.

కాలప్రవాహమునబడి జాతిచరిత్ర యెన్ని మునుకలు వైచినదో యెందఱు సిద్ధపురుషు లెట్టి పావనసందేశసుధారసధారలతో నీవసుమతిని పవిత్రీకృత మొనర్చిరో కాలజంఝామారుతధాటికి జెల్లాచెదరుగాక - వన్నె తగ్గక విశిష్టాద్వైత దివ్యసిద్ధాంతము మెఱుగులు దేరుచున్నది. ఎట్టి బృహత్సిద్ధాంతమో! ఎట్టి యున్నతాశయపూర్ణమో! ఎట్టి విస్తృతికి వీలు గలిగించిన ప్రణాళికయో! గమనించుట కీపాటి వివరణ కొండ నద్దమున జూపుట కొనర్చెడి జతనమునే పోలియుండును. సకల నిగమసారమును బుణికిపుచ్చుకొని, సర్వోపనిషత్తుల మాధుర్యము నలముకొని, సకలశాస్త్రపురాణసముచ్చయప్రతినిధిగా-

విశిష్టాద్వైత సిద్ధాంతము వెలయుటచే నిట్టి ప్రతిష్ఠ – యిట్టి సుస్థిరత – యిట్టి పవిత్రత – యీపావనసిద్ధాంతమున దళుకులీనుచున్నవి. మూలమంత్రమున గల దైవతేజోమహిమ–ద్వయమంత్రమున గల యక్షరాక్షరమహిమ – చరమశ్లోకమున గల ప్రతి పదమాహాత్మ్యము వివరించిన కొలది వివరింప బుద్ధి వొడమును.

నిఖిలసుఖసంపదల నిహలోకమున సంఘటింపజేసి –సకల పరలౌకిక ప్రయోజనములను పరంధాముని చరణసరోజముల సన్నిధిలో సిద్ధింపజేసి – ప్రపన్నులను సర్వవిధముల నలరింపగలిగినది శ్రీ వైష్ణవసిద్ధాంత మొక్కటియే. అందువలననే యీ సిద్ధాంతప్రశస్తిని యెల్లరు సర్వదా శిరసావహించిరి. వర్ధిల్ల జేయుటకు సముత్సుకతను ప్రదర్శించిరి.

ఐహికధర్మవ్రతమును శ్రీవైష్ణవము నిరాకరింపదు. లోకధర్మాచరణసంప్రదాయము పట్లగాని – తన్నిర్వహణము పట్లగాని యీ సిద్ధాంతము వైముఖ్యము నెన్నడును ప్రబోధింపలేదు. జీవితము శ్రీమన్నారాయణుని వరప్రసాదము. ప్రత్యేకించి మానవప్రాప్తి భగవంతుని యపారకరుణావిలాసమునకు చిహ్నము. దానికను చరితార్థ మొనర్చుకొనుటకు పురుషార్థములు సూచింపబడి యుండెను గదా. పురుషోత్తముని చరణసేవాభాగ్యమును మహాభాగ్యముగ నెంచి–సర్వము నాస్వామికే యర్పించి–కడకు తనను తానుగా నాత్మార్పణ మొనరించుకొని శరణాగతత్రాణ

బిరుద విభ్రాజమానములైన శౌరిచరణముల సాన్నిధ్యమునకు నరుడు చేరుకొనుటే యోచింపదగినయంశము. శ్రీవైష్ణవసిద్ధాంతమీపరమరహస్యమునే పలుతెఱగుల జాటినది. జన్మ లభ్యపడుట యొక యదృష్ట మనియే వివరించినది. దానిని హేయమైనదానినిగా గాని, అవాంఛనీయ మైనదానినిగా గాని యెన్నడును ప్రస్తావింప బూనలేదు. అట్లగుటవలన శ్రీవైష్ణవము భౌతికసుఖలాలసతను జీవితపరమధ్యేయముగా మన్నించె ననుటయు గాదు. భవప్రాప్తి దేవదేవుని యనుగ్రహవిశేషమే. కాని భవబంధనముల జిక్కువడుట మాత్రము నరుని యవివేకమని శ్రీవైష్ణవసిద్ధాంత నిర్వచనము. భవసఫలతకు రాచబాటల నన్వేషించుకొను డని మానవులను శ్రీవైష్ణవ ముద్బోధించినది. శ్రీమన్నారాయణచరణద్వయము మాత్రమే సకలజగత్తునకు నిర్వివాదముగ నేకైక తారకమని నిరూపించి – నిర్ణయించి – యుద్ఘోషించినది. జీవితము ననుభవింపుము. జీవితపరమార్థముకొఱకు యత్నింపుము. జీవిత ఫలసిద్ధికి శ్రీమన్నారాయణ చరణయుగళమునే సాధనముగ గ్రహింపుము.

ఈవిధముగ నినదించిన శ్రీవైష్ణవ సిద్ధాంత ధర్మశంఖము సకలవిధ సందేహములతో డోలాయమానమానసులై యున్న భక్తులను ప్రపన్నులను గావించినది. శాశ్వతముగ శ్రీ మహావిష్ణు సాన్నిధ్యమునకు జేర్చి ముక్తులను గావించుటకు పూర్ణముగ సహకరించినది. సులభసుందర విధానమునే యెవ్వారేని

యాశ్రయించి తరింప జూతురుగదా! ఈబలము- ఈమహిమము- ఈప్రశస్తి - ఈ పవిత్రత శ్రీవైష్ణవమునకు దక్కుటలో కారణ భూతము లైనవి మూడంశములు కలవు. 1. తిరుమంత్రము 2. ద్వయమంత్రము. 3. చరమశ్లోకము. ఈ త్రయమే సాధక లోక తాత్త్వికపిపాస దీర్ప జాలినది. ఈ త్రయమే లౌకిక లంపటతో సతమత మగుచున్న వారికి వెలుగుబాటలను జూపినది. ఈ త్రయమే అనితర దుర్లభమైన ప్రసన్నతను- శాంతిని జీవితమున నెలకొల్పుకొనుటలో మానవాళికి చేదోడు వాదోడుగ నిల్చినది. ఈత్రయమే భగవంతుని సన్నిధికి జేరి నిస్తుల శాంతిని బొందవలయు ననెడి తపనను జీవులలో రేకెత్తించినది. జీవాత్మ పరమాత్మల మేలి సమ్మేళనమునకు శ్రీ వైష్ణవమును మించిన మంచి పథకము-పథము వేరొండు లేదు లేదనిపించినది. ఈవిభాగత్రయమున నొక్కొక్కటి యొక్కొక్క యపూర్వాంశము. మహిమాత్మకమైన దివ్యస్థితి పై విభాగత్రయమున గల ప్రత్యంశమునకు వేఱువేఱుగనే కలదు. దేని కది విశిష్ట శక్తి పూర్ణమే. దేనికది గణనీయ మహిమాన్వితమే. ఇట్లు వీనిలో భిన్నత గనిపించినంతమాత్రమున నివి వేఱువే అంశము లని యెంచరాదు. ఈ విభిన్నతనుండి యొకానొక మహోజ్జ్వల భావ సంబద్ధమైన యేకత్వము విభాగత్రయభావసమన్వయమున సాధకులకు ద్యోతకమగును. ఆశ్రితులు కాంక్షించెడి యసాధారణ దివ్యస్థితి యప్పుడు సాక్షాత్కరించును. ప్రపన్ను లభిలషించెడి పరమార్థ మపుడు ప్రాప్తించును. తిరుమంత్ర ద్వయ

మంత్ర చరమశ్లోకములం దంతర్గర్భితమై యున్న భావముల సమీచీన సమన్వయమునకు గల ప్రాశస్త్య మట్టిది. ఒక్క మాటలో జెప్పవలెనన్న నీత్రయము నిజముగ మూర్తిత్రయము వంటిది. నామములు వేరైనను మూర్తిత్రయాత్మకమైన దైవ మొక్కడే యైనట్లు - దైవ మొక్కడే యైనను మూర్తు లన్నింటికిని ప్రత్యేక ప్రత్యేక మహిమ లున్నట్లు మన మెఱుగుదుము. అట్లే నామములు వేరైనను - శ్రీవైష్ణవమున గల ప్రధాన విభాగత్రయము ప్రపన్నుల నొక్క లక్ష్యము వంకకే నడపును. ఒకే విధమైన ఫలము ననుగ్రహించును. ఒకే లక్ష్యము వంకకు నడపినప్పటికిని-ఒకేఫలమును ప్రసాదించినప్పటికిని- విభాగత్రయ పరమార్థ మొక్కటే యైనప్పటికిని-ఇందు గల ప్రత్యేకాంశములు మూడింటికిని ప్రత్యేక ప్రత్యేకప్రభావము లున్నవనుట తథ్యము. తిరుమంత్ర ద్వయమంత్ర చరమశ్లోకముల ప్రత్యేకతయు - సమన్వయ స్థితియు నట్లుండును. ఇట్లుండుట వలననే శ్రీవైష్ణవ మిట్లు తరములు దాటిన తరువాత నేటికిని_రేపటికిని గూడ నిట్లే నూత్నవినూత్న ప్రతిభాపరంపరలతో విరాజిల్ల గలుగుచుండును. ఈసందర్భముననే వివరింపవలసిన మఱొక యంశమున్నది. మూలసిద్ధాంతబల మిట్లు శ్రీవైష్ణవమున కుండుటతో బాటుగ నాసిద్ధాంత ప్రచారమునకు బూనుకొనిన మహనీయులు సైతము మహోజ్జ్వలాశయ పరిపూర్ణులు; మహాద్భుత శేముషీ సంపన్నులు. మీదుమిక్కిలి ఆత్మశక్తి సమన్వితులుగూడ ననుట మఱొక మహాదృష్టము.

లోకకళ్యాణమును ధ్యేయముగ నిడుకొని సాగిన శ్రీవైష్ణవమత ప్రాశస్త్యమున కన్నియు నట్లు కలిసివచ్చినవి. పూజ్యులైన శ్రీమద్రామానుజా చార్యులవారు, శ్రీవేదాంత దేశికాచార్యుల వారు రెండువైపుల బరాబరులిడుచు శ్రీవైష్ణవ సిద్ధాంత మహా రథమును విశ్వవీధుల బరుగులెత్తించిరి. అదొక మహోజ్జ్వల యాత్ర - అదొక మహాధార్మిక సందేశ ప్రదానయాత్ర - అది శ్రీవైష్ణవ సిద్ధాంత పవిత్రయాత్ర.

జగన్నాథుని రథయాత్రవలె నిరాటంకముగ ముందుకు సాగిపోయినది ఆ మహోద్యమము లక్షల - కోట్ల - గొంతుకలు 'ఓం నమో నారాయణాయ' అని ప్రతిధ్వనించినవి. వాడ వాడల - పల్లె పల్లెల - పట్టణ పట్టణముల 'శ్రీమన్నారాయణ చరణౌ శరణం ప్రపద్యే, శ్రీమతే నారాయణాయ నమః' అనెడి దివ్యసూక్తులు వీణానాదములవలె - ప్రభాతసమయ ప్రభాకర కిరణ కాంతులవలె ప్రజ్వలించినవి. శ్రవణానందమును సంఘటించినవి. 'సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ, అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః' అనెడి చరమశ్లోకమే నాడెల్లర గుండెలలో నిండు దీక్షను - దండి శక్తిని పండించినది. శరణాగతి వైభవ ప్రాభవమును శ్రీమద్రామానుజా చార్యులవారో! శ్రీ వేదాంత దేశికా చార్యులవారో! శ్రీ పిళ్ళై లోకాచార్యులవారో! మరి యే యితర వైష్ణవాచార్య మహనీయులో వివరించుచు ముచ్చటించుచున్న తటి నిశ్చలముగ - నిర్మలముగ కోట్లాది

ప్రజలెట్లానందమున శ్రవణ మొనర్చి ముగ్ధులైరో ! ఇంతకంటె జీవులకు సులభోపాయము మఱొండు లేదని యెంత భక్తితో విశ్వసించిరో ! సర్వధర్మ పరిత్యాగముతో స్వామి కాత్మార్పణ మొనర్చి యెట్టి సంతోషము ననుభవించిరో ! శ్రీవైష్ణవ సిద్ధాంత తేజోలహరి సర్వత్ర పవిత్ర భావకాంతి రేఖల వెల్లివిరియించుచుండ ప్రపన్ను లందఱా వెలుగు బాటల నెట్లను రక్తితో పయనముసాగించిరో! ప్రగాఢదీక్షతో శ్రీవైష్ణవమును లోకవ్యాప్త మొనర్చుటే పరమలక్ష్యముగ భావించి యెట్లు బ్రహ్మానంద సంభరితాంతః కరణు లైరో ! వారెట్టి యదృష్టవంతులో ! ఎవ్వరెఱుగుదురు ? ఎట్లు వివరింప గల్గుదురు ?

శ్రీమద్రామానుజాచార్య శ్రీ వేదాంత దేశికాచార్యుల దివ్యసారథ్యమున శ్రీవైష్ణవ సిద్ధాంతరథము లోకమునం దప్రతిహతముగ ముందుకు సాగినది. హింసకు తావులేదు. దౌర్జన్యమునకు స్థానము లేదు. ద్వేషములు మారుమూలలకు జారినవి. అసూయాసహనములు తలలు వంచినవి. బీభత్సదశ కలలోని మాట యైనది. శ్రీవైష్ణవ సిద్ధాంత రథయాత్ర యిట్టి ప్రశాంత ప్రసన్న పరిస్థితులనే సృష్టించుకొనుచు గమనము సాగించినది. కేవలము ప్రేమతత్త్వమే జాలువాఱినది. సౌజన్య సౌశీల్యములే చెట్టపట్టాలు వైచుకొని సంచరించినవి. శాంతిదేవత నిర్భయముగ స్వేచ్ఛా విహారములు సాగించినది. మానవకారుణ్య రసగంగ పొంగినది. ఆదరణ - అనురాగము - ఉవ్వెత్తుగ లేచినవి. అర్చన యగ్రస్థానము నందుకొన్నది. అహంకారము గురు

పాద పీఠము ప్రోల ప్రాలినది. దాసభావన పెరిగినది. దర్ప దృష్టి కరగినది. హేయచింతన తొలగినది. సేవాధోరణి హెచ్చినది. ఇహాపరముల రెండింటికి నీమంత్రత్రయము ధర్మ సేతువును నిర్మించినది. ఆ బాటలో ప్రజావాహిని ప్రవహించి శ్రీమన్నారాయణుని చరణముల చెంత ప్రపన్నతతో నిల్చి నిత్యానందము ననుభవించుట కనుకూలత యేర్పడినది. ఈ విధముగ శ్రీవైష్ణవ సిద్ధాంత రథయాత్ర నిర్నిరోధముగ సాగినది. మహారాజుల భర్మ్యహర్మ్యములకు – మధ్యతరగతి ప్రజల సటీరములకు – అధోజగతియం దల్లాడుచున్న నిరాశ్రయులైన హరిజనుల గూడెములకును శ్రీ వైష్ణవము పయనించినది. శ్రీమద్రామానుజుల పరమాశయము జీవు లందఱు దేవుని జేరవలయు ననియే. జీవాత్మ లందఱు పరమాత్మని యొడిలోనికి జేరవలయుననియే. అదే ఆయన శ్రీవైష్ణవ మహాసిద్ధాంతరథయాత్రలో లోకమునకు వినిపించిన గోపుర సందేశము. అది అందఱు విందురుగాక! శరణాగతి పొందుదురుగాక! భగవదనుగ్రహ పాత్రులగుదురుగాక! శ్రీవైష్ణవ దివ్యకృత్యమును శిరసావహింతురు గాక! శ్రీవైష్ణవ సిద్ధాంత రథ కేతనముల తళతళలు ధరిత్రిని సర్వదా కళకళలాడించుగాక!

ఓమ్ నమో నారాయణాయ.

---



"శ్రీవిష్ణుచిత్త కులనందన కల్పవల్లీం
శ్రీరంగరాజ హరిచందన యోగదృశ్యామ్
సాక్షాత్ క్షమాం కరుణయా కమలా మివాన్యాం
గోదా మనన్యశరణః శరణం ప్రపద్యే."

# ఆండాళ్ వైభవము

దక్షిణ భారతమున 'మధుర' మండలములో రామనాథ పుర ప్రాంతమునందు 'శ్రీ విల్లిపుత్తూరు' అను సుప్రసిద్ధమైన గ్రామమొకటి కలదు. దానిని 'ధన్విపురము' అనియు వ్యవహరించుచుండుట పరిపాటి. ఆ పురమున వెయ్యార్ (వేణు) శాఖకు చెందిన బ్రాహ్మణ వర్ణములో ముకుందుడు, పద్మాదేవి అను పుణ్యదంపతు లుండిరి. ఆ పుణ్యదంపతులకు ఏకైకపుత్రుడగు భట్టనాథుడు పుట్టుకతోడనే విష్ణుభక్తుడై, కాలక్రమమున వర్ధిల్లసాగెను. భగవానుడు తనను తనచిత్తానుసారముగ విని

యోగించు కొనుచుండవలెనని భట్టనాథుఁడు ఆకాంక్షించు చుండెడివాఁడు. తన మనోవాక్కాయములను భగవత్పరము లుగా నొనరించి, నిరంతరము శ్రీమహావిష్ణువును ధ్యానించుచు ఆత్మానందము నందుచుండెడివాఁడు. ఈ కారణము వలన, ( భట్టనాథునకు 'విష్ణుచిత్తుఁడు' అను అన్వర్థనామ మేర్పడెను.

విష్ణుచిత్తుఁడు ఒక పుష్పవనమును నిర్మించి, శ్రీ విల్లి పుత్తూరులో వేంచేసియున్న వటపత్రశాయికి నిత్యము పుష్ప మాలా కైంకర్యము చేయుచుండెడివాఁడు. వటపత్రశాయి యనగా – మఱ్ఱియాకుపై పవ్వళించిన కృష్ణుఁడు.

ఒకనాఁడు విష్ణుచిత్తుఁడు పుష్పవనములో తులసిమొక్క లకు పాదులు త్రవ్వుచుండ, ఒక తులసిమొక్కకడ ఆకస్మికముగ కన్నులపండువుగ ఒక పసిపాప కన్పడెను. పూర్వము కర్మయో గియైన జనక మహారాజునకు నాఁగటిచాలులో సీతాదేవి శ్రీదేవి యంశతో అయోనిజయై లభించినట్లే, ఇపుడు భక్తి యోగి యగు విష్ణుచిత్తునకు పూఁదోటలో ఈపసిపాప–భూదేవి యంశతో అయోనిజయై, ఆషాఢ శుద్ధ చతుర్థీ మంగళవాసర మున–పూర్వ ఫల్గునీ నక్షత్రయుక్త తులా శుభలగ్నమునందు ప్రియ పుత్రికగా లభించెను. ఈ బాలిక – సౌందర్యమునకు నిధి; దివ్య తేజమునకు నిలయము. సర్వ శుభ లక్షణములతో తులతూగు ఇట్టి బాలికను – అనపత్యుఁడగు తనకు భగవానుఁ డనుగ్రహించిన పరప్రసాదముగ భావించి, సంతోషాతిరేక

వముతో నుప్పొంగుచు స్వగృహమునకు గొనిపోయి, తన సతీమ ణినిఁగూడ సంతసింపఁజేసి, పుష్పవాటికలో లభించిన ఆ బాలి కను – 'కోదై' (పూలగుత్తి) అని పేరు పెట్టెను. ఈ 'కోదై' శబ్దము – 'వాక్శక్తిని ప్రసాదించునది' అను అర్థము నిచ్చు 'గోదై' శబ్దముగా రూపొంది, గోదాదేవిగా వ్యవహరింపఁబడ సాగెను. ఈ గోదాదేవియే కాలక్రమమున – 'ఆండాళ్' అను నామధేయముతో సంభావింపఁబడి, చరిత్రప్రసిద్ధిని బడసెను.

## బాల్యదశ

గోదాదేవి చిన్నతనమున – చిత్ర విచిత్రములైన బొమ్మలాటలతో – ముద్దులొలుకు మురిపంపు బాల్యచేష్టలతో వినోదముగ కాలము గడుపుచుండెడిది. ఈమెకు బాల్యముననే విష్ణుచిత్తుఁడు బృందావన బాలకృష్ణుని యమునాతీర విహార విశేషములను వీనుల విందుగ విన్పించుచుండెడి వాఁడు. పెరి యాళ్వారులుగా ప్రసిద్ధిగాంచిన ఈ విష్ణుచిత్తుఁడు భక్తిపర వశుఁడై, తనను యశోదా దేవిగా దలంచుకొని, ఊయలలోఁ గల బాలకృష్ణుని లాలించుచున్నట్లును, ఆ బాలగోపాలుఁడు మెల్లమెల్లన అడుగు లిడుచు నడచుచున్నట్లును భావించుచు, ఆనందభరితుఁ డగుచుండెడివాఁడు. ఈ భావములనే ఆ భక్త శిఖామణి తన దివ్య ప్రబంధములలో బాగుగ ప్రస్ఫుటింపఁ జేసెను. ఇట్టి మధురభావములనే తన ప్రియ పుత్రిక యగు

గోదాదేవికి గూడ గల్గించి, ఆమెలో మధురభక్తిని కాల క్రమమున ప్రజ్వలింపఁ జేసెను.

## భక్తి ప్రపత్తులు

ఆళ్వారులు సహజముగ విష్ణుభక్తులలో అగ్రగణ్యులు. తమ్ము స్త్రీలుగా భావించుకొని, గోపికలుగా సంభావించుకొని, కృష్ణభక్తిలో తన్మయులగుచుండెడివారు. మధురభక్తి భావములో పరాకాష్ఠ నందుకొనుచుండెడివారు. అయ్యును, ఆళ్వారు లందఱిలో ఆండాళు జన్మముతోడనే స్వతస్సిద్ధముగా మహిళామణిగా నవతరించుటవలన, ఆమె కది యొక మహాభాగ్యముగా పరిణమించెను. ఈ కారణము వలననే ఆమెకు సంప్రాప్తించిన దైవానుభూతులు సహజ వికాసవంతములై సంశోభిల్లెను. తత్ఫలముగ నామె ప్రేమస్వరూపిణియై, భగవంతుని తన భర్తగా భావించి ఆరాధింపసాగెను. ఈ భావనము మధుర మధురమై, సహజ సుందరమై, సుమకోమలమై రూపొంది విలసిల్లెను. ఇట్టి సహజ భక్తి భావములను ఆమె తన 'తిరుప్పావై', 'నాచ్చియార్ తిరుమొళి' అను ప్రబంధములలో స్పష్టీకరించెను. ఈ ప్రబంధములను బాగుగా పరిశీలించినచో-ఆమె హృదయసీమనుండి భువన మోహన సుందరుఁడైన గోవిందుని దెసకు ప్రవహించు పవిత్ర ప్రేమ ప్రవాహము-నిరంతరాయముగ ప్రవహించు నిర్మలమందాకినీ ప్రవాహము వలె మనకు గన్పట్టుచుండును.

## ప్రబంధ ప్రశస్తి

ఆండాళ్ తన 'తిరుప్పావై' ప్రబంధమున వ్రతాచరణము నకు వలయు నియమ నిష్ఠలను విపులముగ నిర్వచించెను. 'నాచ్చియార్ తిరుమొళి' యందు భగవంతునితో తనకు గల్గిన సంయోగవియోగములను విస్పష్టము చేసెను.

'తిరుప్పావై' ప్రబంధమున ముప్పది పాశురము లున్నవి. ఇవి – సుందర సులలిత కళాసంపన్నములు; రసమయములు; భక్త్యావేశ సంజనితములు. భగవంతుని యందు భక్తి పార వశ్యమును గల్గించు ఇట్టి పాశురములలోని మధుర భావములు వాచామగోచరములు. ఈ పాశురములలో – కవిత్వము, తత్త్వము, భక్తి, సంగీతము మున్నగునవి ఒకదానితో నొకటి పెనవైచుకొని, భక్తులకు భగవదనుగ్రహమును గల్గించు మహామంత్రములై యలరారుచున్నవి.

## వ్రతాచరణము

ఆండాళ్ తనను గోపికగా దలంచుకొని, గోకులమునఁ గల గోపికలవలె తనసాటివారిని వర్ణించుచు, వారి నందఱిని యమునా స్నానమునకు సన్నద్ధము కావలసినదనియు – వ్రతా చరణమునకు ఇట్టి స్నానము అత్యంతావశ్యకమనియు హెచ్చ రించును. 'శ్రీమన్నారాయణుఁడే పరతత్త్వము' అను విశిష్టా ద్వైత సిద్ధాంతము నందలి మూలసూత్రముతో నారంభించి, అట్టి శ్రీమన్నారాయణుఁడే మన సత్కార్యాచరణమునకు సము

చిత ఫలముల ననుగ్రహింపఁ గలఁడనియు ఆతని కరుణా కటా క్షము వలననే అట్టి అమృతఫలములు లభింపఁ గలవనియు - ఇందువలన, అందఱకును వ్రతాచరణ మావశ్యకమనియు- ఇట్టి వ్రతాచరణ సమయమున నియమనిష్ఠలను పాలించుట అత్యంత ఫలప్రదమనియు ఆమె తన 'తిరుప్పావై' ప్రబంధమున వక్కా ణించెను.

'క్షీరసాగర శయనుఁడగు శ్రీమన్నారాయణుని కీర్తిం తము. పాలు, నేయి మున్నగు భోగ పదార్థములను విసర్జిం తము. కంటికి కాటుక నిడుట, కురులలో విరులు ధరించుట, మున్నగు బాహ్యాలంకారములను దూర మొనరింతము. పూజ్యు లైన మన పెద్దలు పయనించిన ఉత్తమ మార్గముననే మనము కూడ ప్రయాణింతము. వాచాలుర వృథాలాపములకు, సోమ రుల శుష్కవాదములకు, పామరుల వ్యర్థ ప్రసంగములకు, దుర్మార్గుల దురాచారములకు దూరదూరముగా నుందము. మన సర్వసంపదలను పరుల మేలుకొఱకే వినియోగింతము. భగవదనుగ్రహ ప్రాప్తికి సర్వవిధముల ప్రయత్నింతము'. అను నిట్టి విశాలాశయములతోఁ గూడిన వ్రతాచరణములో ఆభక్తు రాండ్రు నిమగ్నులై యున్న తరుణమున, శ్రీకృష్ణ భగవానుఁడు శంఖ చక్రా ద్యాయుధములను ధరించి, సర్వాలంకార సంశో భితుఁడై అచ్చటకు వేంచేసి, భక్తిభావముతో వారొసంగు పదార్థముల నన్నిటిని ఆప్యాయముగా ఆరగించును.

'కరములకు కంకణములను-పాదములకు అందియలను - కంఠాభరణములను - పుష్పమాలలను అలంకరించుకొందము. పీతాంబరములను ధరింతము. పాలతో పరిపక్వమై, నేతితో సమ్మిళితమైన పరమాన్నమును శ్రీకృష్ణుని సహపంక్తిని ఆరగింతము.' అని ఆండాళ్ తనసాటివారలకు చాటిచెప్పను. ఇట్లాచరించిన యనంతరము, వారు - తాము ప్రదర్శించిన స్వాతంత్ర్యమునకు క్షమింపుమని శ్రీకృష్ణుని ప్రార్థింతురు.

'భగవంతుడవగు ఓ గోవిందా! మా యీ ప్రాతః కాల ప్రార్థనల నాలకింపుము. నీవు బాలగోపాలుడవై అవతరించి, గోపికలమగు మాలో నొక్కడవుగ సంచరించుచుండుటచే, మా సేవలను నీవు స్వీకరించి తీరవలెను. ఈ జన్మయందును రానున్న జన్మలందును మేము నీ పాదపద్మములనే భక్తి ప్రపత్తులతో పూజించి, ఆనందభరితుల మగుదుము. ఈ ఒక్క కోరిక తప్ప, 'మాకు ఇతర కాంక్షలు లేనేలేవు' అను నిట్టి మధుర భావములతో - ఈ దివ్య ప్రబంధమంతయు ఆపాత మధురముగ శోభిల్లుచుండును.

గోప బాలుర గోగణమును, గోపికల దధిమథనమును గోదాదేవి గానమొనరించును. నిద్రనుండి మేల్కొన్న కొదమ సింగమును బోలు గోపసింహమును ఆమె కీర్తించును. ఇట్లు ఆండాళ్ గీతికలు భగవంతుని నిర్వ్యాజ కరుణా కటాక్షమును కరతలామలకము గావించుచుండును. ఆ గానము దివ్యశక్తి

ప్రభాసిత గీతికల మధుర గానము. అది దుష్టుని సంహరించు టకు గాక, అతనియందుగల దుష్టత్వమును దూరమొనరించి, అతనికి శ్రేయమును చేకూర్చునదియై యుండును. ఆమె భగ వంతుని సౌందర్యమును, సౌశీల్యమును, సౌలభ్యమును విశేష ముగా ప్రస్తుతించును. 'ఒక్క శ్రీకృష్ణుండే పురుషుండు. కాదు కాదు-పురుషోత్తముండు. తదితరు లందఱును ఆ పరమాత్మపై ఆధారపడి యున్నవారే'. అనుచు భక్తబృందఱును శ్రీకృష్ణుని తమ నాథునిగా భావించిరి. జగన్నాథునిగా సంభా వించిరి. ఆ జగన్నాథునకు సేవలొనర్చి, అపారమైన ఆనందము ననుభవించిరి.

విష్ణుచిత్తుండు-తన ముద్దుబిడ్డయగు గోదాదేవికి బాల్య మునుండియే కృష్ణభక్తిని నూరిపోసి - ఆమె హృదయపద్మమున సుస్థిరముగ పాదుకొల్పి సంవర్ధిల్లజేసెను. తత్ఫలితముగా - ఆమె తన తండ్రికి చేదోడై, పూదోటకు నీరుబోయుచు, పూలుకోసి మాలలు గట్టుచు, భగవత్కైంకర్యార్థమై, ఆ పూ మాలలను తన తండ్రి కొసంగుచుండెడిది. తన తండ్రి తనకు ప్రతిదినము చేయు ప్రబోధములలో గోకుల నివాసియగు గోపాలకృష్ణుని బాల్యచేష్టలను, ఇతర లీలలను వర్ణించి చెప్పుచుండ, ఆమె మిక్కిలి శ్రద్ధాసక్తులతో నాలకించి, మైమఱచు చుండెడిది. గోపికలతోఁగూడి, బాలకృష్ణుం డొనర్చు సరస సల్లాపములు ఆమె హృదయమున ప్రగాఢముగ హత్తుకొనఁగా-తాను గోపి

కగా జన్మింపమికి, ఆమె మిగుల విలపించుచుండెడిది. తాను వివాహమాడవలసివచ్చినచో—శ్రీకృష్ణపరమాత్మనే తన నాథునిగా వరింపవలెనని ఆకాంక్షించుచుండెను. శ్రీకృష్ణుని మేఘశ్యామునిగా—దయార్ద్ర హృదయునిగా దలంచి, తన భావనా నేత్రమున ఆతని భువన మోహన సౌందర్యమును ఆలోకించుచుండెడిది. గోపికవలె తన్నలంకరించుకొనుచుండెడిది. ఇట్టి భావపరంపరలలోమగ్నయై, ఆ తన్మయత్వములో నిత్యము తన తండ్రియగు విష్ణుచిత్తుఁడు వటపత్రశాయికి సమర్పింప నుద్దేశించి సిద్ధపఱచిన పూ మాలలను తాను ధరించి, తన సౌందర్యమును నిలువు టద్దమునఁ జూచుకొని, ముగ్ధురా లగుచుండెడిది. ఈ రీతిగా నొక దినమున పుష్పమాలలను కురులలో ధరించుకొనియున్న తన తనయను భట్టనాథుఁ డాలోకించి నిశ్చేష్టుడయ్యెను. భగవత్కైంకర్యమునకు ఉద్దేశింపఁబడిన సుమదామముల నీవిధముగనామె ధరించుచుండునని యతఁ డెన్నఁడును తలంచియుండలేదు. జరిగిన యపచారమునకు విష్ణుచిత్తుఁడు విచారగ్రస్తుఁడగుచు 'ముద్దుబిడ్డా! వటపత్రశాయియైన కృష్ణస్వామికి సమర్పించు పూ మాలలను ధరించుటకెట్లు సాహసించితివి? నేను నిత్యము మిక్కిలి భక్తి భావముతో ఈ మాలలను స్వామికి సమర్పించుచున్నట్లు నీకు తెలియదా! ఇట్టి అపచారము క్షమార్హము కాదు గదా!' అని, తన తనయ యగు గోదాదేవిని అనేక విధములుగా మందలించెను. పెరియాళ్వారుల వాక్యములు వీనుల సోకినంతనే, ఆండాళ్ పారవశ్యమునుండి విడివడి,

సామాన్య మానవస్థితిని బడసి, తాను గావించిన అపచారమును గ్రహించి మిగుల విలపింపసాగెను. విష్ణుచిత్తుఁడును అనుదినము వటపత్రశాయికి పవిత్రహృదయముతో నర్పించు సుమదామము లను ఆనాఁడు సమర్పింపఁ జాలనందులకు కడుంగడు విచార గ్రస్తుఁడై, అల్లే స్వామి సన్నిధికి వెడలి, అచట తన అపచార మును పదే పదే తలంచుకొని, దుఃఖాశ్రువులు రాల్చసాగెను. కొంత సేపటికి ఇంచుక తేరుకొని, స్వామి సన్నిధినుండి తిరిగివచ్చి, జరిగిన అపచారమునే మఱల మఱల స్మృతికిదెచ్చుకొనుచు, మనస్తాపము నందుచు, ఆ పగటికాలమును అతికష్టమున నెట్లో గడపెను. కాని, అట్టి మనస్తాపముతో బాధపడు విష్ణుచిత్తుఁడు ఆ నాఁటి నిశాసమయము నెట్లు గడుపగలడు? రాత్రి మూఁడు యామములగు వఱకును ఆ మహాభక్తుఁడు చింతాక్రాంత మన స్కుఁడై, పరిపరి విధములుగా వ్యథపడుచునే యుండెను. నాల్గవ జాము ఆరంభమైనంతనే విధివశమున విష్ణుచిత్తుఁడు నిద్రాపరవశుడయ్యెను. అంతలో – ఒక కాంతిరేఖ ఆ మహా నీయునకు గన్పించి అర్చాస్వరూపియైన వటపత్రశాయిగా సాక్షాత్కరించి, 'విష్ణుచిత్తా! నేఁడు పూ మాలలను నా కేల సమర్పింపవైతివి?' అని ప్రశ్నించెను. ఈ ప్రశ్నకు విష్ణుచిత్తుని ప్రత్యుత్తరమే లేదు. అప్పుడా దివ్యమూర్తి పెరియాళ్వారుల నుద్దేశించుచు – 'భట్టనాథా! నీ గృహమునందు నీకు ప్రియ పుత్రికగా దిన దిన ప్రవర్ధమానయై ప్రకాశించుచున్న కన్నియ యెవరో నీవు గుర్తింపకున్నావు. ఆమె సామాన్య మానవకన్య

-కాదు సుమా! ఆ కన్య నాకు జెందినది. కావున, ఆమె ముడిచి విడిచిన సుమదామములనే నాకు సమర్పించుట సముచితము. అదియే నాకు సంతృప్తికరము.' అని పలికి, అదృశ్యుఁడయ్యెను. వెంటనే విష్ణుచిత్తుఁడు త్రుళ్ళిపడి లేచి, తన తనయ అసామాన్య యనియు, భగవదనుగ్రహమును బడసిన మహనీయ యనియు గ్రహించి, పరమహర్షము నందెను. ఆ నాఁటి నుండియే ఆమె 'ఆముక్త మాల్యద' (ముడిచి విడిచిన పూమాలల నిచ్చునది) అను అన్వర్థ నామముతో నలరారఁదొడంగెను. ఈ యర్థమును స్ఫురింపఁజేయు ద్రావిడ దివ్యనామమే - 'శూడిక్కొడుత్త నాచ్చియార్.' ఇట్టి సార్థక నామముతో శ్రీవైష్ణవ లోకమునకు ఆరాధ్యమైన ఆండాళ్ - స్త్రీ లోకమున ధృవతారయై ప్రకాశించెను.

ఆండాళ్ తన మనస్సును కృష్ణుని యందే లగ్నము గావించియుండుట వలన, తమ సఖీమణులకును యోగ్యులైన భర్తలు లభింపవలెననియు అభిలషింప సాగెను. ఇట్లు నిరంతరము కృష్ణ కటాక్షము నభిలషించుచున్న ఆండాళ్‌కు - మున్ను గోపికలు తా మభిలషించిన పురుషులే తమ భర్తలగుటకై, కాత్యాయనీ దేవిని ఆరాధించిన వృత్తాంతము జ్ఞప్తికి వచ్చెను. ఇది యిట్లుండ-విష్ణుచిత్తుఁడును కృష్ణభక్తిలో విలీనమైన తన తనయ మనమును గమనించి, వివాహవయస్క యగు ఆమెను, ఆమె యభీష్టానుసారమే వరునివరించు కొనవలసిదని ఆదేశిం

చెను. ఆయాదేశమునకు ఆండాళ్ సంతసించుచు 'నాయనా ఇంతకు మున్నే నా నాథుని నిర్ణయించుకొని యున్నాను సర్వాంతర్యామియైన శ్రీమన్నారాయణమూర్తియే నా నాథుఁడు. అన్యుని కన్నెత్తియైన గాంచనొల్లను.' అని విన్న వించెను. ఇది విన్న విష్ణుచిత్తుఁడు విస్మయ చకితుఁడై, తన కొమార్తె వివాహమం దపేక్ష లేనిదై, ఈరీతిగా బాలభాషణములు భాషించుచున్నట్లు భావించి 'అమ్మా! నీ ఆకాంక్ష అపూర్వమైనది. అంతేకాదు-ఆమోద యోగ్యమైనది కూడ అయినను - ఇట్టి మహాసంకల్పము సఫలమగుననియే నీవు సంభావించుచుంటివా? ఇది అసంభవము. అందరాని ఫల ముల నాశించి, ఆయాస మందకుము. ఇంగితజ్ఞ వగు నీకు సాధ్యాసాధ్యములు తెలియజాలనివి కావు గదా! కనుక మఱియొకమాఱు ఈ యంశమును గుఱించి బాగుగా నాలో చించుకొని నీ నిశ్చితాభిప్రాయము నెఱిగింపుము.' ఈ హిత బోధ నాలకించిన ఆండాళ్ తన నిశ్చితాభి ప్రాయమున పూర్వమువలెనే తెలియఁబలికెను. అప్పుడు విష్ణుచిత్తుఁడు ఆండాళ్ అభిప్రాయమును బాగుగా అవగతము గావించుకొని యామెనిట్లు ప్రశ్నించెను. 'అమ్మా! నీ యంతరంగమున గ్రహించితిని. సంతోషము. అయినచో - పరమాత్మయైన శ్రీమన్నారాయణుఁడు మన భరతఖండమున నూటయెనిమిది దివ్యతిరుపతులలో అర్చామూర్తియై విరాజిల్లుచు, అనేక రూపములతో-అనంతనామములతో భక్తులకు దర్శనభాగ్యమ

నొసంగుచున్నట్లు ఇంతకు మున్నే వినియుంటివిగదా! ఇందు ఏ క్షేత్రమున వేంచేసియున్న మూర్తిని నీవు వరింపఁదలచితివో తెలుపు’ మని యడిగెను. అందులకామె – ఆ యా క్షేత్రము లందలి అర్చామూర్తుల వైభవమును విశదముగా దెలుప వలసినదని జనకుని కోరెను. అంతట ఆయన ఆనందభరితుఁడై, మధురాపట్టణమునఁ గల శ్రీకృష్ణభగవానుని వైభవమును వర్ణించి చెప్పెను. ఆ వర్ణనములను ఆకర్ణించిన వెంటనే ఆమె శిరమునఁ గల కురులు విరిసెను. తిరుమల శ్రీనివాస భగవానుని వైభవమును విన్నంతనే ఆమె ముఖారవిందము వికసించెను. అనంతరము శ్రీరంగధాముఁడగు శ్రీరంగనాథుని వైభవము శ్రవణ గోచరమైనంతనే ఆమె యొడలుప్పొంగి పోయెను. ఇది గమనించిన విష్ణుచిత్తుఁడు – గోదాదేవి శ్రీరంగనాథస్వామినే వలచినట్లు గ్రహించి–‘తథాఽస్తు’ అని తనయను ఆశీర్వదించెను. ఇది యిట్లుండ, అచట శ్రీరంగనాథుఁడు అర్చకుని యందావేశించి, శ్రీవిల్లిపుత్తూరులో తనను వలచియున్న ఆండాళును తన సన్నిధికి గొనిరావలసినదని ఆలయాధికారుల నాజ్ఞాపించెను. అపుడు వారందఱును స్వామి యాజ్ఞను శిరసావహించి శోభాయమానముగా అలంకరింపఁబడిన ఆందోళికతో – గజ తురగాదులతో – ఛత్ర చామరములతో – వివిధ వాద్యములతో శ్రీవిల్లిపుత్తూరునకే తెంచిరి. ఈ సన్నివేశమును సమాలోకించిన విష్ణుచిత్తుఁడు విస్మయ చకితుఁడై, తన ప్రియ పుత్రిక మనోరథ మీడేర నున్నందులకు పరమ హర్షము నందుచు, ఈ

శుభవార్తను వెంటనే అండాళుకు దెలిపెను. సుకృతాత్మయగు ఆ సుదతియు - ఇనుమడించిన సౌందర్యముతో శోభిల్లుచు, అమందానందకందళిత హృదయారవిందయై, ఆందోళిక నధిరోహించెను. ఆ పల్లకి శ్రీ విల్లిపుత్తూరునుండి మహోత్సవముగా బయలుదేరి, ఆ పురవీథులలోఁ జేరిన జనసందోహము అండాళునకు హారతులిచ్చుచుండ, ఒక వంక వేదఘోషతో - వేరొక వంక ద్రావిడ దివ్య ప్రబంధాధ్యయనముతో - ఇంకొక వంక భగవన్నామ సంకీర్తనముతో - మఱియొకవంక వివిధ వాద్యములతో దిక్కులు పిక్కటిల్లుచుండ, కొంత తడవునకు శ్రీరంగము చేరెను. ఈ వార్త ఆ ప్రాంత మంతటను క్షణకాలములో వ్యాపించెను. తత్ఫలితముగా అతి విచిత్రమైన శ్రీ గోదా రంగనాథుల వివాహ మహోత్సవమును వీక్షించుటకై, ప్రజలు తండోప తండములుగా నేతెంచి యచ్చట గుమిగూడిరి. ఆ జనసందోహమునుండి, ఆండాళ్ అధిరోహించిన ఆ ఆందోళిక ఎట్టులో శ్రీరంగనాథాలయము ప్రవేశించెను. అంతట ఆండాళ్ శ్రీరంగనాథుని ధ్యానించుచు, పల్లకినుండి మెల్లగ దిగి, అల్లనల్లన గర్భాలయమునకుఁ జని, శ్రీరంగనాథునకు సాష్టాంగ నమస్కారము గావింపగనే శ్రీరంగనాథుఁడు తన నిజరూపముతో సాక్షాత్కరించి, శ్రీ గోదాదేవి పాణిని పరిగ్రహించెను. ఆ పాణిగ్రహణ మహోత్సవమునకు విచ్చేసిన ఆళ్వారాదు లందఱును శ్రీ గోదారంగనాథులకు మంగళాశాసన మొనరించి, పరమానంద భరితులై యుండిరి.

ఇంతలో శ్రీరంగనాథుఁడు అర్చారూపమున మఱల దర్శనము నొసంగ, గోదాదేవియు ఆ స్వామి చెంతనే అర్చామూర్తియై యలరారుచు, జను లందఱను ఆశ్చర్య చకితుల గావించెను. ఏమా మహాభాగ్యము ! ఇట్టి మహా వైభవమును కన్నుల పండువుగా సేవించి ఆనందించిన అచ్చటి భక్తులు ఎంతటి ధన్యాత్ములో !

విచిత్రమైన ఈ సన్నివేశమును విలోకించుచున్న విష్ణుచిత్తుఁడు తన ప్రియ పుత్రికను పదే పదే తలంచుకొనుచు విలపింప సాగెను. అపుడు శ్రీరంగనాథుఁడు 'విష్ణుచిత్తా ! విచారపడకుము, ఇదిగో నీ ప్రియసుత - నాకు ప్రియ సతియై, నా ప్రక్కనే ప్రకాశించుచుండ, ఇంతలో నింతగా నిట్లు విలపించెద వేల ? ఇపుడు నీవు నాకు మామవైతివి. నేను నీకు అల్లుడనైతిని. మన యీ బాంధవ్యము అపూర్వమైనది.' అని, అనేక విధముల విష్ణుచిత్తుని ఊరడించెను. అంతట విష్ణుచిత్తుఁడు- స్వస్థానమగు శ్రీ విల్లిపుత్తూరునకు బయలుదేర, అచ్చట శ్రీరంగములో గుమిగూడినవా రందఱును ఆ విష్ణుచిత్తునకు సగౌరవముగా వీడ్కోలొసంగిరి. విష్ణుచిత్తుఁడు విచారాక్రాంత మనస్కుఁడై స్వస్థానము చేరెను. కాని, ప్రియపుత్రికా వియోగము వానికతి దుస్సహమై పోయెను. అంతేకాదు - తన పుత్రిక సంచరించుచు గన్పట్టని ఆ ప్రాంతమంతయు నాతనికి శూన్యముగా దోచెను. పుత్రికా వియోగము వలన భరింపఁ

జాలని బాధ యేర్పడ, విష్ణుచిత్తుఁడు పరిపరి విధములుగా విల పింప సాగెను. అట్టి విలాపమంతయు – 'పెరియాళ్వార్ తిరుమొళి' అను పేర ప్రసిద్ధమై యున్న ఆ విష్ణుచిత్త రచితమగు దివ్య ప్రబంధ మూలముననే మనకు విశదము కాఁగలదు. ఆ మహనీయుని మానసిక బాధను గమనించుటకు – ఒక్క ఉదాహరణము మాత్రము చాలును.

'నా ఏకైక పుత్రికను లక్ష్మీదేవివలె భావించి ప్రేమతో పెంచి, పెద్దదానిని చేసితిని. కాని, అట్టి నా ప్రియ పుత్రికను పుండరీకాక్షుఁడైన శ్రీరంగనాథుఁడు అకస్మాత్తుగా అపహరించి వైచెను. కనుక నే నిపుడు ఎంత చింతించినను ఏమి ప్రయోజనము ?' విష్ణుచిత్తుని ఈ మాటలు ఎంతటి పాషాణ హృదయుల నైనను ద్రవింపఁ జేయఁ గలవనుట నిశ్చయము. ఆ పెరియాళ్వారుల వాత్సల్య భావము అనిర్వచనీయము. ఆ మహాత్ముని పవిత్ర జీవితము అత్యంతము చరితార్థము.

## అనన్య భక్తి ప్రభావము

"నాహం వేదైర్న తపసా న దానేన నచేజ్యయా
శక్య ఏవం విధో ద్రష్టుం దృష్టవానసి మాం యథా।
భక్త్యా త్వనన్యయా శక్య అహమేవం విధోఽర్జున।
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప।"
— (భగవద్గీత : 11–53, 54)

ఓ అర్జునా ! వేదములచేతగాని, తపస్సు చేతగాని యాగము చేతగాని నా యథార్థ స్వరూపమును నీ విపుడ

చూచినట్లు చూచుటకు సాధ్యముకాదు. ఓ పరంతపా! అనన్య భక్తిచేతనే యిట్టి నా రూపమును తెలిసికొనుటకు, నన్ను దర్శించుటకు, నా సాయుజ్యమును పొందుటకు శక్యమగునని శ్రీకృష్ణభగవానుఁడు అర్జునునకు విశ్వరూప సందర్శన యోగమున విశదము గావించియున్నాఁడు. దీనినిఁబట్టి అనన్యభక్తియే భగవత్తత్త్వమును తెలియుటకు గాని, భగవత్సాక్షాత్కారమును బడయుటకుగాని, భగవత్సాయుజ్యమును పొందుటకు గాని సాధనము కాఁగలదనియు, అన్యమెద్దియు ఇట్టి దివ్యఫలముల నొసంగ జాలదనియు స్పష్టమగుచున్నది. అనన్యమైన యిట్టి భక్తితత్త్వమే మనకు గోపికలలో గోచరింపఁ గలదు కనుకనే -

"సా పరానురక్తిరీశ్వరే, యథా వ్రజగోపికానామ్."

పరమాత్మయందలి విశేషమైన అనురక్తియే భక్తియని నిర్వచింపఁ బడుననియు, శ్రీకృష్ణ పరమాత్మయందు గోపికలు ఎట్టి ప్రేమభావమును ప్రదర్శించిరో-అట్టి ప్రేమభావమే భక్తి యని చెప్పఁదగుననియు నారదమహర్షి తన భక్తి సూత్రములలో స్పష్టీకరించెను.

ఇట్టి అనన్యభక్తికి - 'గోపాలుఁడే మా సర్వస్వము; గోపాలకృష్ణుఁడే మాకు ప్రాప్యము, శ్రీకృష్ణ భగవానుఁడే మాకు ప్రాపకము' అనెడి గోపికల మనోభావనమే ఒక చక్కని తార్కాణము. అదియునుఁగాక - అట్టి మనోభావము గల

గోపికలకు ఆ బాలగోపాలుడు తన దర్శనభాగ్యము నొసంగి, వారిని ఆనందాబ్ధి నోల లాడించుటచే అనన్య భక్తి గలవారినే ఆ భగవానుఁడు ఆదరించి, అనుగ్రహించునని స్పష్టమగుచున్నది.

రాధాదేవికిఁ గల సద్గుణసంపత్తి యంతయు గోదాదేవిలో మూర్తీభవించి యున్నది. కనుకనే కృష్ణునకు రాధ ప్రాణనాయిక యైనట్లు – తానును శ్రీరంగనాథునకు ప్రాణనాయికయై, శ్రీరంగ రాజేశ్వరిగా విరాజిల్ల గల్గెను. ఆళ్వారులందే గాక, సకల భక్తలోకమందును ముఖ్యముగ స్త్రీలలో- అందునను అవివాహితలగు యువతులలో ధృవతారగా ప్రకాశింపఁ గల్గెను. ఆదర్శ ప్రాయమైన యిట్టి ఆండాళ్ చరిత్రము ప్రపన్ను లందఱికిని మార్గ దర్శకమై, ధనుర్మాసవ్రత మాహాత్మ్య ప్రబోధకమై, మహాఫలప్రదమై, విశ్వవిఖ్యాతి గాంచియున్నది.

## తిరుప్పావై వైశిష్ట్యము

'మాసానాం మార్గశీర్షోఽహమ్' అని శ్రీకృష్ణ భగవానుఁడు గీతా శాస్త్రమున ప్రబోధించి యున్నట్లు– పరమాత్మను ఉపాసించుటకు మార్గశీర్ష మాసము ఉత్తమోత్తమమైనదనియు, విశేష ఫల ప్రదమైనదనియు తలంచి, ఆండాళ్ మార్గశీర్ష మాసమునందే వ్రతాచరణమునకు ఉపక్రమించెను.

దాక్షిణాత్యులు సౌరమానాను సారముగను, ఔత్తరాహికులు చాంద్రమాన ప్రకారముగను మాసములను పరి

గణించుట పరిపాటి. తదను సారము - దాక్షిణాత్యుల 'మార్గళి' మాసమే మార్గశీర్ష మాసము. మేషాది మీనాంత ముగాc గల ద్వాదశ రాసులలో - తొమ్మిదవ రాశియగు ధనుస్సున సూర్యుcడు ప్రవేశించుటతో - ఈ మార్గళిమాసము ప్రారంభ మగును. ఇట్టి ధనుర్మాసము వ్రతాచరణమునకు మిక్కిలి యోగ్యమైనదని శాస్త్రములు వేనోళ్ళచాటుచున్నవి. మహాపురాణములలో- ఉప పురాణములలో ఈ ధనుర్మాస మాహాత్మ్యము విశేషముగా వర్ణింపc బడియున్నది.

గోదాదేవి దక్షిణ భారతమునc గల శ్రీవిల్లి పుత్తూరు నివాసిని యగుట సౌరమాసానుసారము మార్గళి మాస మునే మార్గశీర్ష మాసముగా సమన్వయించుకొని, అట్టి మార్గళి మాసమునందలి మొదటి దినమునందే వ్రతము నారంభించెను. ఈ రీతిగా నియమ నిష్ఠలతో మార్గళిమాసమంతయు వ్రతమాచ రించుచు, దినమున కొక్క-పాశురము చొప్పున, ముప్పది దినము లలో ముప్పది పాశురములను వరుసగా గాన మొనరించి, కడపటి దినమున తన వ్రతఫలముగా భగవదనుగ్రహమును పరిపూర్ణ ముగ బడసి, శ్రీరంగనాథునకు పట్టమహిషియై, ఆ స్వామితో మహాభోగము లనుభవించెను. ఈ కారణము వలననే, నాcటి నుండి ధనుర్మాసము యొక్క కడపటి . దినము-భోగిపండుగగా హిందువు లందఱిచేతను పరిగణింపc బడుచున్నది.

చరిత్ర ప్రసిద్ధిగాంచిన యిట్టి మార్గళి మాసమునకును, గోదాదేవి రచించిన, తిరుప్పావై ప్రబంధమునకును శ్రీవైష్ణవ సంప్రదాయులు ఎడతెగని సంబంధమును గల్గించిరి. కృష్ణవాల్లభ్యము నభిలషించుచు, ఆండాళ్ ఆలపించిన తిరుప్పావై–అమృత వాహినివలె భక్తిభావ తరంగ పంక్తులతో నొప్పారుచు, ముప్పది పాశురములతో ఒక మహాకావ్యముగా – ఒక దివ్య ప్రబంధముగా రూపొంది, జగద్విఖ్యాతి గాంచినది. రాగతాళ సమన్వితములైన ఆ పాశురములు నాటినుండి నేటివఱకును శ్రీవైష్ణవ గృహములలో మధుర మధురముగా గానము చేయఁబడుచు, శ్రోతలను మైమఱపింపఁ జేయుచునే యున్నవి. నిత్యానుసంధాన యోగ్యమైన ఈ 'తిరుప్పావై' దివ్య ప్రబంధము – వైష్ణవాలయములలో అనుదినము అనుసంధింపఁ బడుచునే యున్నది. ఈ దివ్య ప్రబంధమును శ్రీ భగవద్రామానుజులు – మిక్కిలి ఆసక్తితో నిరంతర మనుసంధించుచు, అమందానందము నందు చుండెడివా రనియు, అందువలననే వారిని– 'తిరుప్పావై జీయర్' అను పేర భక్తులు ప్రస్తుతించు చుండెడివారనియు తెలియవచ్చు చున్నది.

శ్రీవైష్ణవ సంప్రదాయులు – మాసము నందలి దినములను తిరుప్పావై పాశురములతో పరిగణించి, ఈ పరిగణనమును పవిత్రమైన ఒక ఆచారముగా సంభావించు చుందురు. అదియ్యునుఁ గాక, తిరుప్పావై ప్రబంధమునందు గల

ముప్పది పాశురములను నిత్యము గానమొనరించుచు, ధనుర్మా సము నందలి మొదటిదినమున మొదటి పాశురమగు 'మార్గ ళి త్తిజ్గళ్ మది నిఱైందనన్నాళాల్' (మార్గశిరమాసమున పూర్ణచంద్రునితో విరాజిల్లు శుక్లపక్ష పూర్ణిమ యను శుభ దినము వచ్చియున్నది) అను పాశురమును, రెండవ దినమున రెండవ పాశురమగు 'వైయత్తువాళ్ వీర్‌గాళ్ నాముమ్ నమ్బావైక్కు' (భూమండలములో తరింపఁదలంచి జన్మించిన ఓ గోపికలారా!) అను పాశురమును - ఇట్లే వరుసగా దినమున కొక్క పాశురము చొప్పున రెండేసి పర్యాయములు అను సంధించుచు, గోదాదేవిని స్మరించుచు, ఆమె దివ్య మంగళ విగ్రహమును తులసీ దళములతో - పుష్పములతో - హరిద్ర ముతో - కుంకుమతో పూజించి, చందనాది సుగంధ ద్రవ్య ముల నలది, ఆమెకు వివిధ ఫలములను, వివిధ భోగములను నివేదన మొనరించి, తచ్ఛేషములైన తీర్థ ప్రసాదములను స్వీక రించి సంతృప్తి నందుచుందురు.

తిరుప్పావై ప్రబంధము - శ్రీ వైష్ణవ సంప్రదాయమున కొకానొక ప్రత్యేకమైన నూతన శోభను సంతరించిన దనుట- అతిశయోక్తి కానేరదు. 'తిరుప్పావై' అనఁగా - పవిత్ర మగు నోము, ఈ దివ్య ప్రబంధమునఁగల ముప్పది పాశురము లలో - ఇరువది తొమ్మిది పాశురములు - 'ఏలోర్ ఎంపావై' అను శబ్దముతో ముగియుచుండ, కడపటి ముప్పదవ పాశు

రము - 'ఎంపావై' అను శబ్దముతో ముగియుచున్నది. 'ఎన్ పావై' అనఁగా - నా నోము' అని యర్థము. 'పలోర్ ఎన్ పావై' అనఁగా 'మహా ఫలప్రదమైన నా వ్రతము' అ తాత్పర్యము.

తిరుప్పావై ప్రబంధమునకు ప్రధానమైన బీజము. ఆండాళునకు శ్రీకృష్ణ పరమాత్మయందుఁ గల పవిత్ర ప్రేమ భావమే. అట్టి ప్రేమభావము - విశాలమై, అగాధమై ప్రబలమై, తీవ్రమగుటవలన ఆమె కది-అతి దుస్సహమయ్యెను ఎంతటి ఆత్మనిగ్రహముగలవారికైనను ప్రేమ పథమున పయ నించుట యన, సులభసాధ్యముకాదు. అందునను - శ్రీకృష్ణు యందు అనన్యమైన ప్రేమభావము గల్గుట, ఆతని యనుగ్రహ మును సంపాదించుట అత్యంతము కష్టతరము. కావున నే——

"అనన్యచేతా స్సతతం యో మాం స్మరతి నిత్యశః
తస్యాహం సులభః పార్థ నిత్యయుక్తస్యయోగినః."

—(భగవద్గీత : 8—14)

'పార్థా! ఎవఁడు అనన్యమైన మనస్సుతో అవిచ్ఛిన్న ముగ నన్ను స్మరించుచున్నాఁడో - నిత్యము ఉపాసించు ఆ యోగికే నేను సులభుఁడను' అని శ్రీకృష్ణ భగవానుఁడు ప్రబోధించినాఁడు. ఇందువలన, శ్రీకృష్ణప్రేమ పథానుగమన మున - ఆండాళ్ ఎంతటి చిత్తస్థైర్యమును గల్గియుండెనో. ఆతని యనుగ్రహమును పొందుటకు ఎంతగా పరితపించెనో - ఆ

యూ విశేషముల నన్నింటిని, ఆమె రచించిన తిరుప్పావై ప్రబంధము వలననే మనము సులభముగా గ్రహింపవచ్చును.

నిరంతరము శ్రీకృష్ణ పరమాత్మ ధ్యాన పరాయణులైన గోపికలు - నియమ నిష్ఠలతో కాత్యాయనీ వ్రతము నాచరించుచు, తమకు ఆ పరమాత్మయే పతి కావలెనని అభిలషించుచుండెడివారు. ఆ. జగన్నాథుఁడే తమ నాథుఁడు కావలెనని అపేక్షించుచుండెడివారు. తమ దేశము సుభిక్షమై, సకాలమున మేఘములు వర్షించి, సస్యములు సమృద్ధిగా ఫలించుటకును, శ్రీకృష్ణుని ప్రేమ ప్రవాహము తమపై పరిపూర్ణముగ ప్రసరించుటకును గోపికలు ఈ వ్రతమును చేయుచుండెడివారు. తండ్రియగు విష్ణుచిత్తునిచే బోధింపఁబడిన వ్రత విశేషము గోదాదేవిని బాగుగా ఆకర్షించెను. ఆమె-నిశ్చలమైన మనస్సుతో ఈ వ్రతానుష్ఠాన విధానమును ఆలించి, అచంచలమైన భక్తిభావముతో దానిని పాలింప సంకల్పించెను. తనను గోపికగ దలంచుకొని, కృష్ణభక్తి ప్రబోధకములైన గీతములను మధుర మధురముగా గానము చేయసాగెను. తన జన్మస్థాన మగు శ్రీ విల్లిపుత్తూరును గోకులముగను, ఆ దివ్యక్షేత్రమున అర్చామూర్తియై విరాజిల్లు వటపత్రశాయి ఆలయమును నందగోపాలుని మందిరముగను, వటపత్రశాయి యగు గోపాలుని శ్రీకృష్ణునిగను, తన సఖులను గోపికలుగను తలంచుకొనుచు, ధనుర్మాస వ్రతము నారంభించెను. మధుర భావములు గల్గిన తిరుప్పావై ప్రబంధమునఁగల

పాశురములను మనోహరముగా గానముసేయ నుపక్రమించెను గోపికలతోఁ గూడి, గోపాలుని మందిరమున కేఁగి, వ్రత మహాత్త్వమును ప్రస్తుతించుచు, శ్రీకృష్ణుని ఉషఃకాలముననే మేల్కొలిపి, ఆతనితోఁ గూడ స్నానమునకై ఆ గ్రామ పరిసరముననే గల 'తిరుముక్కుళమ్' అను పేర ప్రసిద్ధిజెందిన నదికిఁ బోయి, దానినే యమునగా భావించి, మజ్జన మాచరించి, మరలి వచ్చి, శ్రీకృష్ణుని పరిపరి విధములుగా కీర్తించు చుండెడిది. ఈ రీతిగా వ్రతమును పూర్తి గావించి, గోదాదేవి దేవదేవియై విరాజిల్లెను,

తిరుప్పావై ప్రబంధము-భక్తి సంభరితములైన ముప్పది పాశురములతో శోభిల్లుచు, పఠితలను, శ్రోతలను ఉత్సాహ భూగించుచుండును. అందు మొదటి అయిదు పాశురములు - గోదాదేవి తన సఖీ మణులతో శ్రీకృష్ణుని సన్నిధికిఁ బోయి అతని సహాయము నర్థించుటకై ఉద్దేశింపఁ బడినవి. మొదటి పాశురములో - తన సఖులను తన్ననుసరింపుఁడని సంబోధించును. అమృత రసాస్వాదము నభిలషించు వారలు-'నాతో కలిసిరం' డని యెలుగెత్తి పిలుచును. వ్రత నియమములను రెండవ పాశురమునను, వ్రతాచరణమువలన లభించు అమృత ఫలములను మూఁడవ పాశురమునను ప్రవచించును. వరుణ దేవుని నాల్గవ పాశురమున ప్రార్థించెను. త్రికరణశుద్ధిగా-భక్తి ప్రపత్తులతో శ్రీకృష్ణ భగవానుని ఆరాధించిన యెడల పాప

సంచయ మంతయు - అగ్నిలోఁ బడిన దూదివలె భస్మమై పోవునని అయిదవ పాశురమున ప్రబోధించెను.

గోదాదేవి - నిశాసమయ మందైనను నిద్రింపక, గోవిందుని పాదారవిందములనే డెందమున ధ్యానించుచు, ఉషః కాలమునందే ప్రతి గృహమున కేఁగి, తన సఖీజనమును నిద్రావస్థనుండి మేల్కొలిపి స్నానా ద్యనుష్ఠానమునకు-వ్రతాచరణమునకు వారల నుద్యుక్తురాండ్రఁగావించుఘట్టములు ఆరవ పాశురమునుండి పదునైదవ పాశురము వఱకు చోటు చేసికొన్నవి. ఈ పాశురములందలి సుందర సుశోభిత సులలిత పదజాలములు - పవిత్ర భావములు - విశేషార్థములు సంప్రదాయజ్ఞులగు తమిళభాషావేత్తలకే అనుభవైక వేద్యములు.

శ్రీ విల్లిపుత్తూరు నందలి బాలికల నందఱిని తనతో గల్పుకొని, నందగోపాలుని మందిరమున కరుగుచున్నట్లు డెందమున భావించి, ఆనందోద్వేగముతో ఆండాళ్ మధుర గానము చేయును. శ్రీకృష్ణుని ఆలయమున కేఁగి, తన చేతులతో తలుపులు తట్టును. ప్రియురాలగు నప్పిన్నతో నిద్రించుచున్న శ్రీకృష్ణుని సన్నిధికి తన సహచర బృందముతో నరిగి - 'మా హృదయ కుహరములను తెఱచి, మా ఆకాంక్షలను విన్నవించుటకు అవకాశము నొసంగుమని పదునారవ పాశురమున ద్వారపాలకుని ప్రార్థించును.

నిద్రించుచున్న యశోదను, నందగోపాలుని, బలరాముని మేలుకొనుడని పదునేడవ పాశురమున నర్థించును. కాని వారు మేల్కాన నందున, తాము మొదట వక్రమార్గము నవలంబించితిమని తమ పొరపాటును గుర్తించి, పదునెనిమిదవ పాశురమున నప్పిన్న దేవిని - పిరాట్టిని ప్రార్థించును. శ్రీకృష్ణుని, శ్రీదేవిని పందొమ్మిది - ఇరువది సంఖ్యలలోఁగల పాశురములలో ప్రార్థించును.

మేము అహంకార మమకారములను దూర మొనరించి నిర్మలములైన అంతఃకరణములతో - పవిత్రములైన హృదయములతో భగవత్సన్నిధానమున కేతెంచితి'మని విజ్ఞాపన మునర్చును.

భగవానుని - మృగరాజువలె సింహాసనము నధిష్ఠింపు మని ఇరువదిమూఁడవ పాశురమున ప్రార్థించును. అప్పుడా ప్రార్థనను మన్నించుటకు భగవానుఁడు బయలుదేరుచుండ - పల్లాండు - పల్లాండు' అని ఆమె ఉచ్చైస్స్వరముతో కేకలిడుచు, ఆ పరమాత్మకు ఇరువదినాల్గవ పాశురమున మంగళాశాసనముఁ జేయును.

ఈ విధముగా మంగళాశాసనమును చేయుటతో - ను ఆ భగవంతునకు విన్నవింపఁ దలచిన విషయములను స్మరించును. తన స్థితిని మఱచును. సర్వమును మఱచి, తన్మయత్వము నందును. తన స్వామి పాదచారిణియై వేంచేయు

చుండుటచే, మృదులములగు ఆతని పాదారవిందములు కంది పోవునని విలపించును. మఱల పల్లాండు గీతికల బాడును. 'దుఃఖములను, బాధలను దూర మొనరించి, ఆనందామృతము ననుభవింప సఖీజనముతో నీ సన్నిధి కేతెంచితి' నని ఇరువది యైదవ పాశురమున భగవానునకు నివేదించును.

వ్రతాచరణమునకు వలయు సాధనలను తెలుపుమని ఇరువది యారవ పాశురమున భగవానుని ప్రార్థించును.

భగవానుఁడు మాతో కలసిమెలసి యున్నచో - అధి భౌతిక, ఆధ్యాత్మిక సంపద లన్నియు మాకు అప్రయత్నముగా లభింపఁ గలవని ఇరువది యేడవ పాశురమున తన ఆశాభావమును విశదీకరించెను.

నేను దీనురాలను. అల్పజ్ఞను. కావున - అనంతుఁడవగు నీ కీర్తిని, మహిమను వర్ణించుటకై నీ యందలి యనురాగముచే నేర్పడిన స్తబ్ధత వలనఁ గాని, అజ్ఞానవశమునఁగాని, మధురములు - మాననీయములునైన పద జాలములను ప్రయోగింపఁ జాలనందులకు మన్నింపుమని, ఇరువది యెనిమిదవ పాశురమున ఆ పరమాత్మను క్షమాభిక్ష నర్థించును.

ఇఁక - ఇరువది తొమ్మిదవ పాశురములో 'అసలు సారాంశ మంతయు ఇమిడి యున్నది. ఇందామె - పరమాత్మవగు నిన్నే నిరంతరము మేము సేవించునట్లు వర మొసంగుమనియు, 'మా ఆకాంక్షలను - అనురాగములను, తృష్ణను

పరమాత్మవగు నీ వైపునకే మఱల్చి, వానిని మధుర రసమయ ములుగా గావింపుమని ప్రార్థించును.

ఈ తిరుప్పావును కంఠస్థ మొనరించి, అనుదినము భక్తి ప్రపత్తులతో అను సంధించువారు - సరసిజాక్షుఁడును, ప్రేమ మూర్తియు నగు భగవానుని యనుగ్రహమునకు పాత్రులై, సకల శుభములను, సుఖ శాంతులను, నిత్యానందమును పొంద గలరని ముప్పదవ పాశురమున ఫలశ్రుతిగా బల్కెను.

## మధుర ఫలము

తిరుప్పావై ప్రబంధము - గోదాదేవి హృదయోద్వేగ మును, మధుర భక్తిని మనకు వ్యక్తము చేయును. గోపికల మధురభక్తిని మఱపించి, మహోన్నతము మధురాతిమధురము నగు భక్తి పీయూషము నందించును. వేదశాస్త్ర పురాణేతి హాసములలోఁగల తాత్త్వికరహస్యముల నుద్బోధించును. సంసార సముత్తరణమునకు - తిరుమంత్రముగా ప్రసిద్ధిచెందిన అష్టాక్షరీ మహా మంత్రానుసంధానమే సులభోపాయమని ఉపదేశించును. ప్రేమస్వరూపిణియై ప్రకాశించిన ఆండాళ్ - అఖిల ప్రపంచము నకును అనుగ్రహముతో ప్రసాదించిన మధుర ఫల మదియే. ఆ మహాఫలము నందుకొని, అందలి మాధుర్యమును గ్రోలగల్గిన వారలు పరమ ధన్యులు.

# శ్రీ గోదా-అష్టోత్తర శతనామ స్తోత్రము

## (పూర్వకవి విరచితము)

శ్రీ రంగనాయకీ గోదా విష్ణు చిత్తాత్మజా సతీ
గోపీవేషధరా దేవీ భూసుతా భోగశాలినీ

తులసీకాననోద్భూతా శ్రీ ధన్విపురవాసినీ
భట్టనాథప్రియకరీ శ్రీకృష్ణ హితభోగినీ

ఆముక్తమాల్యదా బాలా రంగనాథప్రియాపరా
విశ్వంభరా కలాలాపా యతిరాజసహోదరీ

కృష్ణానురక్తా సుభగా సులభశ్రీః సలక్షణా
లక్ష్మీప్రియ సఖీ శ్యామా దయాంచిత దృగంచలా

ఫల్గుణ్యావిర్భవా రమ్యా ధనుర్మాసకృతవ్రతా
చంపకాశోకపున్నాగ మాలతీ విలసత్కచా

ఆకారత్రయసంపన్నా నారాయణ సమాశ్రితా
శ్రీమ దష్టాక్షరీమంత్ర రాజస్థిత మనోరథా

మోక్షప్రదాననిపుణా మంత్రరత్నాధిదేవతా
బ్రహ్మణ్యా లోకజననీ లీలామానుషరూపిణీ

బ్రహ్మజ్ఞానప్రదామాయా సచ్చిదానందవిగ్రహా
మహాపతివ్రతా విష్ణు గుణకీర్తనలోలుపా

ప్రపన్నార్తిహరా నిత్యా వేదసౌధవిహారిణీ
శ్రీరంగనాథమాణిక్య మంజరీ మంజుభాషిణీ

సుగంధార్థ గ్రంథకరీ రంగమంగళదీపికా
ధ్వజవజ్రాంకుశాబ్జాంక మృదుపాదతలాంచితా

తారకాకారనఖరా ప్రవాళమృదులాంగుళీ
కూర్మోపమేయపాదోర్ధ్వ భాగా శోభనపార్ష్ణికా

వేదార్థభావవిదిత తత్వబోధాంఘ్రిపంకజా
ఆనందబుద్బుదాకార సుగుల్ఫాపరమాణుకా

తేజశ్శ్రియోజ్జ్వలధృత పాదాంగుళి సుభూషితా
మీనకేతన తూణీర చారు జంఘావిరాజితా

కకుదబ్జసుయుగ్మాఢ్యా స్వర్ణరంభాభసక్థికా
విశాలజఘనాపీనసుశ్రోణీ మణిమేఖలా

ఆనందసాగరావర్త గంభీరాంభోజనాభికా.
భాస్వద్వళిత్రికాచారు జగత్పూర్ణమహోదరీ

నవమల్లీరోమరాజీ సుధాకుంభాయతస్తనీ
కల్పమాలా నిభభుజా చంద్రఖండనఖాంచితా

సుప్రవాళాంగుళీన్యస్త మహారత్నాంగుళీయకా
నవారుణప్రవాళాభ పాణిదేశ సమంచితా

కంబుకంఠీ సుచుబుకా బింబోష్ఠీ కుందదంతయుక్
కారుణ్యరసనిష్యంది నేత్రద్వయ సుశోభితా

ముక్తాసుచిస్మితా చారు చాంపేయ నిభనాసికా
దర్పణాకారవిపుల కపోలద్వితయాంచితా
అనంతార్క ప్రకాశోద్య న్మణితాటంక శోభితా
కోటిసూర్యాగ్ని సంకాశ నానాభూషణ భూషితా
సుగంధ వదనా సుభ్రూ అర్థచంద్రలలాటికా
పూర్ణచంద్రాననా నీల కుటిలాలక శోభితా
సౌందర్య సీమావిలస త్కస్తూరీతిలకోజ్జ్వలా
ధగద్ధగాయమానోద్య న్మణిసీమంతభూషణా
జాజ్వల్యమాన సద్రత్న దివ్యచూడావతంసికా
సూర్యార్థచంద్రవిలస ద్భూషణాంచితవేణికా
నిగ న్నిగద్రత్నపుంజ ప్రాంతస్వర్ణ నిచోళికా
సద్రత్నాంచితవిద్యోత ద్విద్యుత్పుంజాభశాటికా
అత్యర్కానలతేజోధి మణికంచుకధారిణీ
నానామణిగణాకీర్ణ హేమాంగద సుభూషితా
కుంకుమాగరు కస్తూరీ దివ్యచందనచర్చితా
స్వోచితౌజ్జ్వల్యవివిధ విచిత్రమణిహారిణీ
అసంఖ్యేయసుఖస్పర్శ సర్వాతిశయభూషణా
మల్లికాపారిజాతాది దివ్యపుష్పస్రగంచితా.
శ్రీరంగనిలయాపూజ్యా దివ్యదేశసుశోభితా
ఏవం శ్రీరంగనాయక్యాః నామ్నా మష్టోత్తరం శతమ్

యో నరః పఠతే నిత్యం నిత్యనిర్వాణసంపదమ్
లబ్ధ్వారంగపతే ర్ధాసదాస్యసక్తో భవిష్యతి.

—ఓం తత్ సత్—

## మంగళాశాసనము

"స్వోచ్ఛిష్ట మాలికాబన్ధ గన్ధబన్ధుర జిష్ణవే
విష్ణుచిత్త తనూజాయై గోదాయై నిత్యమంగళమ్."

"మాదృశాం కించనత్రాణ బద్ధకంకణపాణయే
విష్ణుచిత్త తనూజాయై గోదాయై నిత్యమంగళమ్."

"మంగళం రంగనాయక్యై మంగళం భోగశాలినే
మంగళం శ్రీప్రదాయిన్యై నిత్యశ్రీర్నిత్య మంగళమ్."

— ఓమ్ —



ఓమ్

ఆనోభద్రాః క్రతవోయంతు విశ్వతో౽
దబ్ధాసో అపరీతాస ఉద్భిదః
దేవా నో యథా సదమిద్ వృధే
అసన్నప్రాయువో రక్షితారో దినేదినే.

# తిరుప్పావై - తిరువెంబావై

ఏ జాతియందయినను మహోన్నత భావములు మణి దీపికలుగా వెలుగు లీనుచుండవలెనన్న సాహిత్యము ప్రధానాలంబనము. సాహిత్య పరమార్థ మేదేశమునందయినను, విశ్వశ్రేయస్సునే యుద్దిష్టముగ నెంచి విరాజిల్లునదిగ నుండవలెను. "విశ్వశ్రేయః కావ్యమ్" అనెడి సూక్తి యీ పరమార్థమునే స్పష్టీకరించుచున్నది. సకల మానవాళిని సర్వవిధ సముల్లసిత మొనర్చి, సర్వేశ్వరా రాధనము వంకకు మరలింపజాలిన దివ్యశక్తి సాహిత్యమునకు కలదు. సాహిత్యము జాతికి ప్రాణవా

యువుపంటిదనుట యతిశయోక్తి గానేరదు. కావున జాతికళ్యాణము సాహిత్యముపై నాధారపడియుండెననుట నిర్వివాదాంశము. సాహిత్యకారుల యభిరుచులనుబట్టి భిన్నరీతులలో సాహిత్యము, లోకమున సృష్టింపబడుచున్నమాట నిజము.

మానవులను యోగ్యులనుగ మలచుట కుపకరించెడి సాహిత్యమును మాత్రమే ప్రజలభినందింతురు. పదికాలముల పాటు నిలిచియుండు సాహిత్యమయ్యదియే. సామాజిక ధర్మములను బహుభంగిమలతో వివరించి, మానవుని నుత్తమ లక్ష్యము వంకకు నడిపించినపుడే సాహిత్యము చరితార్థము కాగలుగును.

కేవల పఠనానందమును మాత్రమే కలుగజేసి, మానవునిలో దాగియున్న రాగద్వేషాదులను రగిలించి, యున్మత్తుని గావించి, విశృంఖల విహారతత్పరుని గావించెడి గ్రంథములు సాహిత్య పరమార్థమును సాధించలేవనియే చెప్పవలెను. వాని మనుగడయు పరిమితకాల పర్యంతమే కాగలదు.

నరులమధ్య అన్యోన్యప్రేమ దృష్టిని పెంచి – సాముహిక క్షేమ కాంక్షను పెంపొందించి సత్ప్రవర్తనను సంఘటించి నయశీలముల నభివర్ధమానము గావించి – సర్వవిధాభ్యుదయములను ఘటించునదియే సాహిత్యము. మానవుని పరమలక్ష్యమైన పరమాత్మని సన్నిధికి జేరుకొనెడి యుపదేశము నందింపగలిగినదే సాహిత్యము. ఒక్కమాటలో – జాతి యశస్సునకు

మంచి యున్నతిని జేకూర్చునటే సాహిత్య పరమాశయమై యుండవలెను.

జాతియొక్క సర్వవిధ సమున్నతికి సాహిత్యమే ప్రతిబింబము. సామాజికముగ - రాజకీయముగ - ఆర్థికముగ - నైతికముగ - శారీరకముగ - మానసికముగ తుష్టి- పుష్టి లభించుటకు ఎల్లవారును సాహిత్యమును సమాశ్రయింప వలసినదే. సాహిత్యరస పరిషిక్తముగాని, యే యంశమైనను చైతన్యవంతముగ - కాంతిమంతముగ - కళామయముగ విరాజిల్ల నేరదనుట విడ్డూరముగాదు. వింతయునుగాదు. ప్రపంచమందనేక భాషలు - అనేక సాహిత్యము లున్నవి. ప్రతి సాహిత్యమందును కొన్ని ప్రత్యేక లక్షణములున్నవి. అట్లే తమిళ సాహిత్య మందును కొన్ని విశిష్టలక్షణములు గలవు. అవి తమిళనాటి ప్రజల భక్తి తత్త్వ పరాకాష్ఠనేగాక - సర్వతోముఖాభివృద్ధిని గూడ వెలార్చుచుండుట గమనార్హమైన యంశము.

ఇంపు సొంపుల వెలార్చుచు - మహోత్తమ స్థాయిని వెలుగొందుచు - పవిత్రభక్తి తత్త్వమును ప్రబోధించుచు - దివ్యభావ ప్రపూరితములై మధురాతి మధురములై తమిళ సాహిత్య గగన సీమలలో వర్ధిల్లెడి గీతములు ప్రగతిశీలు రెల్లరును పఠింప నర్హములై యున్నవి. ఇవి కుప్ప తెప్పలుగ గలవు. ఆళ్వారుల పాశురములు నయనారుల తేవారములు. (దేవహారములు) ముఖ్యముగ స్తవనీయములు. వీనిలో ఆండాళ్ తిరు

ప్పావై-మాణిక్య వాచకరు తిరువెంబావై - ధ్రువతారపోల్కి నిత్య నవీనములుగ వెలుగొందుచున్నవి. తిరుప్పావైలో కేవలము లెక్క కొక ముప్పది పాశురములే యున్నను అందలి ప్రతి పాశురమును తమిళుల నుజ్జీవితులూపి భక్తిరస స్రవంతుల దేల్చుచుండుననుట యతిశయోక్తి కాదు. తమిళులను మత ధర్మవిషయములలో మహానురక్తుల గావించుటలో నీ గ్రంథమున కొక యగ్రస్థానము గలదు. పరమ భాగవతులను సంసార సాగరమునుండి సముద్ధరింపగల దివ్యశక్తి యీ గ్రంథమునకు గలదని తమిళులు సభక్తికముగ విశ్వసింతురు. సులభముగ జీవన యాత్ర కొనసాగింప ద్రఢిష్ఠమగు నావయే తిరుప్పావై యని వారు వాకొనుచుందురు.

దీనిని సహృదయతతో పరిశీలించి-పరిశోధించి-విభజించి-వివరించిన నందలి బహుముఖ ప్రజ్ఞాపాటవముల మహిమ మన కవగాహమగును. ఇందలి మధురభావవాహినింగాంచి మన మెల్ల అమపుడు మురియగలము. ఈ దివ్యప్రబంధమునందలి పాశురములను మార్గశిరమాసమున భక్తులెల్లరు ముఖ్యముగ వైష్ణవులు పారవశ్యమున గానమొనర్చు చుందురు. పాశురముల గానమొనర్చుటకు నిర్ణయింపబడిన కాలమే మిగుల పావనమైనట్టిది. మార్గశిరమాసము హిందువుల కందఱికి పవిత్ర మైనట్టిది. "మాసానాం మార్గశీర్షోహమ్" అని శ్రీకృష్ణపరమాత్మ భగవద్గీతలో ప్రవచించియున్నాడు.

ఈ మాసమున ప్రకృతిశోభ విశ్వరూపమును వహించును. పచ్చనిపూలతోటలతో పాడిపంటలతో నిండుగ నిబ్బరముగ బ్రవహించెడి నదులతో నిర్మలాకృతివహించిన నింగితో కన్నులపండువు గలుగజేసెడి గ్రామీణజనగణ కోలాహలములతో గాదెలు పురులు నిండిపోవ గృహమునందంతట గులుకుచున్న ధాన్యలక్ష్మితో క్షీరధారలవర్షించు గోమాతలతో మార్గశిరము మానవులకు మహానందదాయిగ నుండును.

భాషాసౌష్ఠవముతో భావమాధుర్యముతో వెలుగొందెడి తిరుప్పావై పఠనమునకిది సర్వవిధముల తగినసమయము. భక్త్యుత్సాహావేశములు ముప్పిరిగొనియున్న యీ తరుణమున ఆండాళ్ ప్రబోధించిన పాశురములను తమిళులానంద పరవశులై ప్రతిదినము గానమొనర్తురు.

భిన్న భిన్న దృక్పథములతో జాతిని సముత్తేజితమొనర్ప భక్తిభావపరవశమొనర్ప పూజ్యమహాసాధ్వి ఆండాళ్ గావించిన బృహత్ప్రయత్నము కమనీయకవితారూపమున నే పగిది సఫలతంగాంచినదో! తిలకింతము. ఆమె పాడినది భక్తిగీతములనే. కాని! యీ గీతములయందంతర్గర్భితముగ సామాజిక బహుముఖవికాసమున కెన్నెన్నియో సూచన లొనర్పబడినవి. నరుని నిర్దుష్టప్రవర్తనాపరునిగ - నిరుపమాధ్యాత్మిక తత్పరునిగ తీర్చిదిద్దుటకై గీతములందెంతయో కృషిగావింపబడినది. గమనార్హములైన యెన్నెన్నియో యంశములను

దములో విలీనమొనర్చుకొనుచు ప్రతిధ్వనించిన మహోజ్జ్వల గేయములవి. ఆండాళ్ పరమ పావన భావశిఖర సీమలనుండి సకల దురిత సంక్షాళ నార్థము జగత్తున కవతరించిన గేయకవితా గంగ పొంగులవి.

మానవాభివృద్ధి వికాసములకు పాశురము లే పగిది సూచకములై రహించినవో పరికించిన మనకీ వాస్తవములన్నియు బయల్పడును.

## శారీరక దృక్పథము

ఆండాళ్ రచించిన పాశురములలో శారీర కాభ్యుదయమునకై తీసికొనవలసిన భద్రతను గూర్చి విపులముగ వివరింపబడినది.

పుష్టిమంతము - ఆరోగ్యవంతము అయిన శరీరము వినిర్మలము, విశుద్ధమునయిన మనస్సు నరునకు వాంఛనీయములని లోకవ్యవహారము.

సర్వావయవముల సమష్టి యభివృద్ధికి - వికాసమునకు దేహమే పునాది గదా!

"శరీర మాద్యంఖలు ధర్మసాధనమ్" అనెడి యార్యోక్తి శరీరారోగ్య సాధన మన్ని ధర్మములలో ప్రధానమని వక్కాణించుచున్నది.

"ధర్మార్థ కామ మోక్షాణాం ఆరోగ్యం మూలముత్తమమ్
రోగాస్తస్యా అపహర్తారః శ్రేయసో జీవితాయచ" (చరకసంహిత)

ధర్మార్థ కామమోక్షముల బొందుటకు ఆరోగ్యము ఉత్తమమైన మూలము. జీవితమునది ధన్య మొనర్చును. రోగములు ఆరోగ్యమును నాశన మొనర్చును.

ఆరోగ్య నియమములు – ప్రకృతి నియమములే. ఎట్టి పరిస్థితులందును ఎప్పటికిని వీని నుల్లంఘింప జనదు. ఆహార విహారములలో నిగ్రహముగలవారు మాత్రమే మానవులు. ఇంద్రియ లోలురు పశుతుల్యులు. భోగులు తాము నిర్వీర్యులై – సర్వ వ్యాధులపాలై దుఃఖము ననుభవించుచు పరులను హింసింతురు. ఇసుక పునాదులపై భవననిర్మాణము హితకరముగాదు. ఆరోగ్యకరమైన శరీరము లేనిదే దేహి సాధింపగల్గిన దేమియు నుండదు. ఉత్తమ భావానుభూతికి – జీవితాదర్శ సాధనమునకు – శరీరము మూలకారణము. శరీరారోగ్యము – శారీరక భద్రత – శారీరక పరిశ్రమము – శారీరక పరిశుభ్రత మొదలయినవి సమపాళ్ళలో సక్రమముగ మేళవింప బడినపుడే మానవుడు ఆరోగ్యవంతుడై – శక్తిమంతుడై – వికాస వంతుడై తన విధ్యుక్త ధర్మ నిర్వహణ మొనర్పగలడు.

ఈ విషయములమీద నిర్ద్వంద్వముగ – అనుష్ఠాన యోగ్యముగ – ఆండాళ్ వెలిబుచ్చిన అభిప్రాయ పరంపర గడుంగడు రమణీయము–శ్రేయోదాయకము–జీవితాశయ ఫలప్రదము.

తెలతెలవారకముందే – పెందలకడ – బ్రాహ్మీముహూర్తముననే మేల్కొని శయ్యనుండిలేచి చన్నీట స్నానమాడు టెంత ఆరోగ్యదాయకము! ఎంత సుఖదాయకము! ఎంత వాంఛనీయము! ఈ విషయము నెంతయో తలచితలచి సహేతుకముగ–సక్రమముగ–సరసముగ ఆండాళ్ వివరించినది.

బ్రాహ్మీముహూర్తమున నిద్రమేల్కొనుట బద్ధకమును దొలగించుటకు మార్గము. సోమరితనము నిది దూరముగ నెట్టును. చీకటిని–అజ్ఞానమును చీల్చి వెలుగు (జ్ఞానము) నందించును. మానవుడీ తరుణమున నిద్రలేచి శీఘ్రముగతిని నిత్యకృత్యముల నిర్వర్తింప గడంగిన అతనిలో ఉత్సాహశక్తి బాగుగ దీపించును. కార్యశూరత యేర్పడును. ఆరోగ్యము కుదురుకొనును. శరీర పరిశ్రమవలననే చక్కని యారోగ్య మేర్పడును గనుక ధనవ్యయముతో పనిలేకయే మానవు డుల్లాసిగ వర్ధిల్లును.

ఆండాళ్ పెందలకడనే నిదురలేచి గ్రామమునగల స్త్రీల నందఱ మేల్కొల్పి తెల్లవారకముందే కాలకృత్యముల దీర్చుకొని నదీస్నానార్థ మెల్లర దోడ్కొని పోయెడిదట. చలి బెదరించుచున్నను జంకక స్త్రీలందఱు సంతోషముగ నాండాళు వెంటనరిగి నదీజలముల దేలియాడి, యపూర్వానందము ననుభవించెడివారట. ఇట్టి సదాచారము నామె సఖీజనముల కలవఱచినది. గృహములనుండి–చలిలో నదీస్నానమునకు నడచివచ్చుట, చల్లని నీటమునుగుట–ఓలలాడుట–యీదుట – తేలియాడుట మున్నగు

పనులకన్న శరీరారోగ్యమునకు వలయు పరిశ్రమ మఱియొకటి కలదా? పాటలు పాడుచు సర్వేశ్వరుని స్తుతించుచు నెచ్చెలులతో ఆండాళ్ అనుదినము నిట్లు స్నానాదులు ముగించెడిది.

ఒంట్రుమన్ను నదీజలములయందు సహజముగనే పేరుకొనును. అది ఓషధులను లవణములను సర్వదా స్పృశించుచుండుటవలన దానియందు శరీరపోషణ కుపకరించెడి కొన్ని శక్తు లంతర్గర్భితములై యుండుట సర్వ సాధారణ విషయము.

ఇట్టి శక్తులను గలిగి యుండుటవలన ఒంట్రుమన్ను శరీరమున కొక విధమైన ఓజస్సును – వినూతన తేజస్సును ప్రసాదించుట తథ్యము.

ఇట్టి స్నానముల మూలమున ఆరోగ్యవిషయము నందెన్నియో సత్ఫలితము లేర్పడుచుండును.

నిరంతర ప్రవాహ శీలములగు నదీజలములనుండి విద్యుచ్ఛక్తి యుద్భవించును. శీతల జలములలో ప్రాణవాయువు మిక్కుటముగ నిలువయుండును. ఉషఃకాలమున – అందునను శీతకాలమున చన్నీటస్నానమాడు సమయమున శరీరములోనికి ప్రాణవాయు వెక్కువగ ప్రసరించి, శక్తిని – ఉత్సాహమును – చురుకుదనమును జేకూర్చును. ఎన్నియో ఓషధుల, ధాతువుల కలయికతో ప్రవహించెడి నదీజలముల స్పర్శచే చర్మవ్యాధులు నశించును. ఓషధులు రోగనిరోధక శక్తిగలవి యగుటచే నీ స్నానములు నరులను పూర్ణారోగ్య వంతుల గావించుచుండు ననుట తథ్యము. ఆండాళ్ ప్రబోధించిన ఇట్టి నిత్యానుష్ఠాన

నియమములు - ఆరోగ్యశాస్త్ర సమ్మతములు, సత్ఫలదాయకములున్నై వెలుగొందుట మనమరయవచ్చును. మార్గశిరము సహజముగనే మానసిక వినిర్మలతను బ్రసాదించును. పారిశుద్ధ్యమును గల్గించును. క్రమశిక్షణను ఘటించును. పరమార్థమును ప్రోత్సహించును. నరుని కానందమును గూర్చును.

సంప్రదాయములను పాటించి - ఆహార విహార నియమముల నతిక్రమింపక - ఇంద్రియముల జయించి - సరళసాధు జీవితమును నరు లలవఱచు కొనవలసియున్నది. పరమేశ్వర ధ్యానమును ధ్యేయముగ నిడుకొని మార్గశిర మాసమున నిర్వహింపవలసిన నిత్య కార్యక్రమ మంతయు - మానవుని సర్వ విధముల నారోగ్యవంతుని గావింపగలదు.

పాలు - నేయి మొదలయినవి క్రొవ్వును పెంచు పదార్థములు. ఇవి శరీరారోగ్యమునకుగాని, మానసికారోగ్యమునకు గాని శీతకాలమున నంతగ పనికిరావు. హానికరములు కూడ. కావుననే యుక్తాహార విహారములనే యొనర్పుడనియు - క్రొవ్వుగల క్షీరాన్నమును, ఘృతాన్నమును వర్జింపుడనియు - జిహ్వాచాపల్యమును నిగ్రహింపు డనియు - తృష్ణను గెలువు డనియు - తృప్తిని బడయుడనియు ముక్తకంఠమున ఆండాళ్ గాన మొనర్చినది.

అట్టి నియమబద్ధ జీవితమును గడపజాలిననాఁడే పశుత్వమునణచి-మానవత్వమును పెంచి - దేవత్వము నందగలరనియు నామె ప్రబోధించినది.

తామసికశక్తుల నణచి, రాజసికశక్తులను పుటముబెట్టి, సాత్త్వికులుగా నరులు విలసిల్లవలయునని యామె ఆకాంక్షించినది. మానసికసుశిక్షణము – మానసిక నైర్మల్యము లేనినాడు నరులు చరితార్థులు కాజాలరని ఆండాళ్ విశ్వసించి ప్రబోధించినది.

పరనింద – పరాపకార పరావమానములు గావించుట మానవలెను. చిత్తశుద్ధి – దానధర్మ తత్పరత – అతిథిసత్కారాపేక్ష – నిర్ధనులపట్ల కరుణ మున్నగు సల్లక్షణములెల్లరకు నుండుట మేలని యామె ఉత్కంఠముతో ప్రబోధించినది. ఈ విధముగ సమాజమున నిర్మల సంస్కృతి జాలువారుటకై ఆండాళ్ చూపెట్టిన మార్గము లెన్నియోయున్నవి. అన్నియు పావనములు; భద్రప్రదములు.

## సాంఘిక దృష్టి

ఆండాళ్ గేయములలో సంఘకళ్యాణవాంఛయే సర్వత్ర వ్యక్తమగుచుండును. మానవుడు సంఘజీవి. అందఱితో కలిసి కట్టుగ జీవించుటకు నరుడు యత్నింపవలెను. సమైక్యమునందలి మధురిమల జూరగొనుటకు ప్రతియొక్కరు కాంక్షింపవలసినదే. సన్యాసికి మాత్రమే యేకాకిగ జీవించుట విధి. కాని సంఘజీవులందఱకు నది విధ్యుక్తధర్మము గానేరదు.

ఆండాళ్ నదీజలముల స్నానమాడ నేగుతఱి గ్రామము నంగల స్త్రీల నందఱిని వెంటనిడుకొని వెళ్ళుటలో గల యంత

రార్థమేమి ? సమష్టిగ పాటలు పాడుటలో - ఆటలాడుటలో గల తాత్పర్యమేమి ? ఎల్లరు సదాచారముల ననుష్ఠించుచు - సత్సంప్రదాయపరులై సఖ్యమున మెలగవలయుననియే సిద్ధాంతము. ఈవిధాన మొకరిపై నొకరు ప్రేమభావమును జూపుకొనుటకు మార్గము. నిర్దుష్టసాంఘిక నియమముల నాచరణము నందిడుటకు రాచబాట. సమైక్యము కొరవడిన కలహములు, కల్లోలములు చెలరేగి కలతలు పెంపొందును. సంఘ జీవితమున శాంతి యుండదు. మార్గశిరమాసము సర్వవిధముల సమైక్య జీవితవిధానమునే యనుభూతికి దెచ్చుచుండును. తిరుప్పావై సాంఘిక సమీకరణమును ప్రసాదించిన మహత్తర గ్రంథము. ఉత్సాహానందములతో ఉత్తమజీవితమును నిర్వహింపజేయు దివ్యప్రబోధములనే తిరుప్పావై మనకందించినది. ఇది నిజముగ పావనభక్తిభావనావైఖరికి పరాకాష్ఠ.

## నైతిక దృష్టి

నీతి - శీలసంపత్తి: ఇవి రెండును జాతికి రెండుకన్నులు. వీనిలో నేయొకటి లోపించినను జాతి భౌతికముగ నవయవవిహీనత గలదియేయగును. త్రికరణశుద్ధి మనకెంతయు నావశ్యకము. వాంఛనీయము. ఊహించుట - ఊహించినది చెప్పుట - చెప్పినది చేయుటయే త్రికరణశుద్ధి యనబడును. ఇది లేనినాడు జీవితమునకు విలువయేయుండదు. తిరుప్పావైలో ఆండాళ్ నైతికబలమును - శీలసంపదను పెంపొందించుటకు మిక్కిలి

మధురములైనవి యెన్నియో యుపదేశముల గావించినది. ఆమె సూచించిన విధానములు - వివరించిన జీవితపు విలువలు కేవలము పఠించుటకే కాదు- నిత్యానుష్ఠానము నందుంచుటకే యనుట నిస్సంశయము.

అన్యోన్యానుబంధము - పరిపూర్ణ సమన్వయ సమీకరణము - జీవితమునం దఖండ జ్యోతిగ వెలుగొందవలయును. భగవంతుని చిత్తశుద్ధితో ఆరాధించి కీర్తించి సంతోషముగ నర్చించి తరింపవలెను. ప్రాంజలియై భగవానుని ప్రార్థింపవలెను. నీతిని విడనాడక యోగ్యతముడై నరుడు మాధవ చరణారవింద మకరందమును తనివిదీర గ్రోలవలెనని ఆండాళ్ ప్రబోధించినది.

## ప్రకృతి దృష్టి

సహజశోభతో దేదీప్యమానముగ వెలుగొందుచు - దివ్యదీప్తుల బ్రసరించుచు-మహోత్తమ ప్రబోధముల గావించుచు వెలుగొందు గురువు ప్రకృతియే. ప్రకృతినుండి మానవులు నేర్వవలసిన దెంతయో యున్నది. ప్రకృతి వేలకొలది విషయములను మన కుపదేశించును. అది క్రమము తప్పదు. అందు గంభీర వాక్యము లుండవు. క్లిష్టపదముల గొడవయే గన్పించదు. ఉపన్యాసములకు తావేలేదు. అన్వయ కాఠిన్యముల ప్రసక్తి రాదు. కాని గురుస్థానమున నిల్చి ప్రకృతి, శిష్యప్రాయులుగ నున్న మానవుల కెన్నెన్నియో విషయములను ప్రబోధించును. ప్రశాంతతను - నిర్మలతను-కార్యశూరతను వారిలో గల్గించును.

క్రియాశీల వంతునిగ మానవు నొనర్పగలది ప్రకృతియే. కాకముల కా కా రావములు, కుక్కుటముల కొక్కొక్కొరో కోలు-ఎంతటినిద్రామత్తునై నను-మందునై నను సూర్యోదయమునకు-ఉషఃకాలమునకు పూర్వమే, పెనుజీకటి వేళనే మేల్కొనుమని హెచ్చరించును. నిద్రనుండి మేల్కొల్పి నిత్యకృత్యములకు గడంగ జేయును. విచ్చిన మొగ్గలు - పరిమళించెడి సుమములు మనకు గుణపాఠములు చెప్పగలవు.

గతులు తప్పని సూర్య చంద్రులు జీవిత గమనమున మానవున కాదర్శప్రాయులు. ఋతువులు తమ తమ ధర్మములను నిర్వహించుట మనకొక హితబోధయే. ప్రకృతి కళాకాలలో సమభ్యసనము గావింపబూనిన మానవుడు ప్రాతఃకాలముననే మేల్కొనును. తక్కినవారు నిశీథ వేళవరకు త్రాగి ందనాలాడి యొడలు తెలియక సూర్యోదయానంతరము గూడ నిద్రించు చుందురు. వారు సోమరులు. జీవితాదర్శ సాధనారంగమున వారు విజయమును గడింపజాలరు. ప్రలాపము లాడుచు పశువులవలె సంచరించెడి వారెల్లరు ప్రకృతియొక్క హితబోధనల నంగీకరింపనివారే. వివేకవంతుడనని విఱ్ఱవీగు మానవుడు బద్ధకమును విడనాడి ప్రకృతిని సమారాధించినపుడే యోగ్యతను గడించును. పరిపూర్ణత నందును. ధన్యతను గాంచును. మానవ సహజధర్మములను సరళ పద్ధతులతో ప్రకృతిని జూచి గ్రహించి మనుగడను ఫలింపజేసి కొనుడని-ప్రకృతి

సమారాధనా తత్పరులు గండని ఆండాళ్ గట్టిగ సౌమ్యధోర ణిలో తన పాశురములద్వారా ప్రజానీకమును హెచ్చరించినది.

## తాత్త్విక దృష్టి

సర్వ వ్యాపకుడుగ - సర్వజ్ఞుడుగ - సర్వశక్తి మంతు డుగ-సర్వసృష్టి కారణభూతుడుగ స్తుతుల నందుకొనునది సర్వే శ్వరు డొక్కడే. నామము లెవ్వియైననేమి? ఎన్నియైన నేమి? ఉత్సాహా వేశములతో తమతమ దృక్పథాను సారముగ భగ వంతుని తమకు నచ్చిన నామములతో భక్తులు కీర్తింపవచ్చును. జలధియందున్నను- నదులయందున్నను-కాల్వలయందున్నను - సెలయేళ్ళయందున్నను - సుడిగుండమునందున్నను - కడవయం దున్నను-దోసిటనున్నను జలము జలమేయగునుగాని వేరొండు గాదు గదా! సహస్రనామములతో నయినను భేదభావములేక స్వామిని స్మరింపవచ్చునని మహోజ్జ్వల తాత్త్విక దృష్టితో ఆండాళ్ ప్రబోధించినది.

“నారాయణ, గోవింద, శ్రీకృష్ణ, దామోదర, కేశవ దేవాదిదేవ, మాధవ, వైకుంఠవాస” అనెడి పలు నామము లతో భగవానునికి ఆండాళ్ తన మనవిని వినిపించిన తీరు పాశురములలో గల తాత్త్వికదృష్టినే వ్యక్తపఱచును.

ఏ నామమున స్తుతించినప్పటికి నా విజ్ఞప్తి యొకేయొక భగవానునే జేరునని దీని తాత్పర్యము.

పలువురు పలునామములతో భగవానుని స్తుతిచేయుచు పరస్పరముగ గలహించుకొనుట విజ్ఞత యెంత మాత్రమును గానేరదు. "ఏకం సద్విప్రా బహుధావదంతి" అనెడి వేద సూక్తియే మనకు శిరోధార్యమని ఆండాళ్ వివరించినది. తిరుప్పావై యీ సత్యమునే గట్టిగ ప్రబోధించినది. సుస్పష్టముగ దేవదేవుని యద్వైతస్థితిని వ్యక్తీకరించినది. పాశురములన్నియు నిట్టి దివ్యభావములతో హృదయములను ద్రవింపజేయు చుండును.

జీవాత్మను పరమాత్మతో ననుసంధానము గావించెడి పరమ రసాయనమే తిరుప్పావై. పుటము పెట్టబడిన పావన భావనల నేకత్ర కూర్చగల దివ్యసూత్రమే తిరుప్పావై యనుట కిట్టి యెన్నియో సాక్ష్యములను జూపవచ్చును.

## తదితరులు

దివ్యభావ కళికలను జాతికందించిన వారిలో ఆండాళుతో బాటుగ మన్నన సేయదగినవారు – ఎన్నికగన్నవారు మఱి కొందఱున్నారు. వారి యూహాలు సైతము పరమ రమణీయములు, ప్రశాంతి ప్రదములు, ప్రసన్నతల కాలయములు, ప్రజలకు మోదసంధాయకములు.

ఆండాళ్ విష్ణుభక్తి తత్పరురాలు. వైష్ణవత్వముతో సిద్ధి నందిన మహాసాధ్వి. ఇక శైవసిద్ధులలో నయనారులు ప్రథములు. వీరిలో అప్పరు, సంబంధారు, సుందరారు, మాణిక్యవాచకరు

ముఖ్యులు. శైవసిద్ధాంతమునకు – శైవమతమునకు వీరు మూల స్తంభములవంటివారు. ద్రఢిష్ఠములైన పట్టుగొమ్మలవంటివారు.

అప్పరు, సుందరారు, సంబధారుల పాటలను తేవారము ందురు. ఇక మాణిక్య వాచకరుని గీతములను తిరువాచకము అందురు. తిరువాచకమునందలి యిరువది గీతికలు గల యొక భాగమునే "తిరువెంబావై" యందురు.

బాలబాలికలలో స్త్రీలలో ముఖ్యముగను – సకల ప్రజానీకమున సర్వసామాన్యముగను, పవిత్రతను ప్రబలింప జేయుటకై తిరువెంబావై నిర్దేశింపబడినది. శారీరక మానసిక సాంఘి కాధ్యాత్మికాది సకలస్థాయీ తారతమ్యములలో నరుడు సర్వ విధముల పవిత్రుడై మహోజ్జ్వల ధర్మ నిష్ణాతుడై సము ద్దీప్త భావ సంపన్నుడై యలరారవలయుననెడి సత్సంకల్ప ముతో మాణిక్య వాచకరు తిరువెంబావై రచనకు బూనుకొని నాడు.

మానవుని క్రమ క్రమ వికాసమున కనుకూలమగు విధా నమును సూచించు తిరువెంబావై విభిన్నరీతుల ప్రబోధములను గావించినది. పరమేశ్వరానుగ్రహ ప్రాప్తియే పరమలక్ష్యమని స్పష్టీకరించినది.

పుట్టిన ప్రతి ప్రాణియు గిట్టి తీరును. జనన మరణముల మధ్యకాల పరిమితి యెంత యైననేమి ? ఒకదాని వెంట నొకటి పునరావృత్త మగుచుండవలసినదే! ప్రకృతి నియమమిది.

ప్రకృతి సహజత్వమిది. కాని ఈశ్వరుడు జనన మరణ రహితుడు, సర్వజ్ఞుడు, సచ్చిదానందమూర్తి, ఆధ్యాత్మిక దివ్యజ్యోతి, ఆద్యంత శూన్యుడు, నిరంతరముగ వెలుగు లీను దివ్యదీపిక.

కావుననే ప్రజావళి యంతయు నా దేవదేవుని స్తుతించి తత్సాన్నిధ్యమును బడయుటకు యత్నింపవలయును. ఆయన కళ్యాణ గుణోపేతుడు, శివసంకల్పుడు. శాంత్యానందము లాయన వలన ప్రజలకందుట నిక్కము. లోక క్షేమమునుగోరి గరళమును గ్రోలి జగతికి అమృతమును ప్రసాదించిన యా జగద్బంధువైన శివుని నామస్మరణము భవరోగ నిరోధక దివ్యరసాయనము.

పరిపూర్ణుడు సుందరమూర్తి దివ్యజ్ఞాన నిలయుడునగు శివుని నామామృత పానము జగత్కళ్యాణమునకు మూలకారణము కాగలదని మాణిక్య వాచకర్ తిరువెంబావైలో వెల్లడించినాడు.

సర్వము నశించినను నిత్యుడై - పురాతనుడై నవనవోన్మేష శోభతో వెలుగొందెడి శివుని ధ్యానించుట జీవిత లక్ష్యముగ నుండవలయునని తిరువెంబావై సిద్ధాంతము.

భౌతిక భోగాను భూతికి గాక-ఆధ్యాత్మికభావ వికాసము కొరకే - దివ్యకాంతి ప్రాప్తికొరకే - మహానంద సిద్ధికొరకే ముఖ్యముగ కన్యలు-కాంతలు నిండుభక్తితో తిరువెంబావైని గానమొనర్తురు.

పరమానందమున నోలలాడుచు తిరువెంబావై గీతముల బాడుకొనిన సంసార సాగరమునుండి తరించి శివానుగ్రహమున ప్రపంచ బంధములనుండి బయటబడి ముక్తిని బడయవచ్చు నను నదే తిరువెంబావై ప్రబోధ సారము.

ఈ సారాంశముపట్ల ప్రజలకు విశ్వాసము కోకొల్లగ నుండెడిది. నిద్రనుండి మేల్కాంచి – అనగా అజ్ఞానాంధకారము నుండి బయటబడి, వెలుగున బ్రవేశించి–అనగా విజ్ఞానకాంతి పుంజముల దేలియాడి, ఆధ్యాత్మిక దివ్యఫలములను బొందుటే మాణిక్యవాచకరు రచనకు పరమాశయము. పశుత్వమునుండి మానవతను బహు సంస్కరణలకు గుఱిగావించి దేవత్వము వంకకు నడిపించుటే ప్రధానాదర్శముగ నిడుకొని తిరువెంబావై రచింపబడినది.

సహజముగ మానవుల మనస్సు తమోగుణ బద్ధమై నట్టిది. అజ్ఞానాంధకారమునబడి భ్రమ ప్రమాదములకు లోనై అవివేకా వృతమైన మనస్సుతో "నేను–నాది" అనెడి అహంకార మమకారముల సుడిగుండములలో చిక్కుకొని – తృష్ణలో మునిగి నరుడు కోరికల భారపంకమున కూరుకొని పోవును.

తిరువెంబావై గ్రంథమును క్రమపద్ధతితో నిశ్చల మనస్సుతో నధ్యయన మొనర్చిన – అనారోగ్యకరము లయిన సకలానర్థములు తొలగుననియు, శివతేజము సర్వమును సంర-

క్షించుననియు మాణిక్యవాచకరు దృఢముగ నమ్మి - నమ్మిన విషయము నెలుగెత్తి చాటినాడు.

మానవుల మనోవాక్కాయ కర్మలను పరిశుద్ధము లొనర్చి - చిత్తశుద్ధిని ప్రసాదించి - దివ్యత్వము నందుటకు వలయు మార్గములను జూపి మానవజాతికి మహోపకార మొనర్చిన ప్రముఖ పావన గ్రంథముగ తిరువెంబావై యెన్నికగన్నది.

ఇట్టి దివ్యాశయములతో మధురశైలితో తిరువెంబావై గ్రంథమును రచించి మాణిక్యవాచకరు మహాత్ముల శ్రేణిలో నిలిచి మహత్తర కీర్తిని గడించినాడు. అట్టి సుదీర్ఘ దివ్యాశయసంపన్నుడయిన పరమ భక్తుడు మాణిక్యవాచకరు. అట్టి సులలిత సుమధుర కవితాధారా పరిపూర్ణుడైన మహాకవి మాణిక్యవాచకరు.

కావుననే మాణిక్యవాచకరును సిద్ధులలో మహాకవిగ - మహాకవులలో సిద్ధునిగ ప్రాజ్ఞు లభివర్ణింతురు. నిజముగ నట్లభినందనలందుట కన్నివిధముల దగియున్న మహనీయుడు మాణిక్యవాచకరు. నయనారులలో పరిపూర్ణ మానసిక వికాసమునకు పాత్రుడై సర్వ గౌరవముల నందుకొనగలిగి సమస్త విషయము లలో భవ్య భక్తి తత్త్వమునే ప్రతిఫలింప జేయుచు తన కావ్య జీవితమును సఫల మొనర్చుకొనిన ప్రతిభావంతుడు మాణిక్య వాచకరు.

శైవ వైష్ణవ మతభేదములున్న నేమి? ఆళ్వారులైన నేమి? నయనారు లయిననేమి? ఆ విభిన్నతను దృష్టిపథము నందిడుకొనక పరిశీలించినచో తిరుప్పావై, తిరువెంబావై రెండును భక్తుడైన వానికి రెండు కన్నుల వంటివే. గేయమున శ్రీకృష్ణుడు స్తుతింపబడిన నేమి? శివుడు నుతింపబడిననేమి? వానియందు ప్రవహించుచున్న ఆధ్యాత్మిక భావ రసాయనము మాత్ర మొక్కటే - లక్ష్య మొక్కటే- గమ్య మొక్కటే. నయనములు రెండును ఒకే పదార్థమును గాంచు చున్నట్లు - పైన పేర్కొనబడిన శైవ వైష్ణవ సాహిత్య గీతా విభాగములు రెండును సర్వేశ్వరు నొక్కని గుఱించియే ప్రబోధించుచున్నవి తమిళభాషయందలి యీ రెండు ప్రబంధములును భక్తి విషయ మున సాధకుల కందజేసిన సందేశ మొక్క రీతిగనే యుండుట గమనార్హము.

ఎట్లయిననేమి? తమిళ వాఙ్మయమున గల యాణిముత్తె ముల వంటి యీ రెండు గ్రంథములు మానవుని సర్వవిధ ప్రగ తికి బాధ్యతవహించి - ఆత్మానుభూతి నందించి - పరమావధిఁ జూపించి-బ్రహ్మానందమును గలుగజేసెడి దివ్యరసాయనములై, సర్వకాలములలో వర్ధిల్లగలవనుట నిస్సంశయము. ఈ గ్రంథ ములు రెండును - భౌతికాధ్యాత్మికములను జీవితమున సక్రమస్థా నము నందుంచును. సాత్వికతను గలిగించును. సామరస్యమును జతపఱచును. ఏకత్వమును నిరూపించును. ఉత్తమ భావనలు -

కోమల పదములు నిండియుండుటచే నీ గ్రంథములు సత్యశివ సుందరాత్మకములై విరాజిల్లు చున్నవి.

అహో! ఎట్టి మహోద్ధత భావధార! ఎట్టి మహోత్తేజ కర ప్రబోధ వైఖరి! ఎట్టి నిర్మాణాత్మక నియమబద్ధ విధాన ప్రకటన! ఎట్టి ప్రజోపయోగకర కావ్యరచనా చాతురి! ఎట్టి తీరు తెన్నులు! ఎట్టి సొగసులు!

సరళ సాధుజీవిత లీలకు ప్రతిబింబములై యలరారుచున్న తిరుప్పావై - తిరువెంబావై గ్రంథము లిట్టి యుజ్జ్వల సందేశ ములతో ఉద్దీప నాత్మకములై, మానవుని పశువుగ పతనము గానీయక, మానవతయనెడి సుస్థిర పీఠికపై సుదృఢముగ నిల్పి- దివ్యత్వము నుద్దీపింపజేసి - సఫల మనోరథు నొనర్చుచున్నవి. పరమానందానుభూతి కేకైక కారణముగనున్న భక్తి తత్త్వ మును ప్రబోధించుచున్నవి. పావనసందేశ సుధారస ధారల వెల్లి విరియించుచున్నవి.

అవి అజరములు - అమరములు - అనంత తేజ స్సంభరి తములు నగుచు అలరారినవి. అలరారుచున్నవి. భావికాలమున కూడ నవి యట్లే యలరారుచు బంగరు పంటల బండింపగలవు. కలి సందేశములను నరుల గుండెలలో నింపింప గలవు.

—:ఓమ్ తత్ సత్ :—



ఓమ్

తత్త్వం బ్రువాణాని పరం పరస్మాత్
మధు క్షరంతీవ సతాం ఫలాని
ప్రావర్తయ ప్రాంజలి రస్మి జిహ్వే!
నామాని నారాయణ గోచరాణి.

# భగవన్నామ సంకీర్తనము

భగవంతుఁడు సర్వవ్యాపకుఁడు. సృష్టివ్యాపారమున కతఁడే కారణభూతుఁడు. సర్వజ్ఞుఁడును-సర్వశక్తిమంతుఁడును-సర్వాంతర్యామియునగు నతఁ డనంతనామములతో నలరారుచు, ఆశ్రిత పారిజాతముగ విఖ్యాతి గాంచినాఁడు.

పరమపావనమై-సంసార సాగర సముత్తరణ సాధనమై-అనుభూతి యుతమై - భగవద్దర్శనమును ప్రత్యక్ష మొనర్చు శబ్ద బ్రహ్మముగ వెలుగొందు భగవన్నామ సంకీర్తన ప్రభావము మహాశక్తి సంభరితము; మహాఫలప్రదము. కనుకనే-

సీ॥ హరినామకథనదావాన లజ్వాలలఁ
గాలవే ఘోరాఘ కాననములు
వైకుంఠదర్శన వాయుసంఘములచేఁ
దూలఁగవే భవదుఃఖతోయదములు
కమలనాభధ్యాన కంఠీరవంబుచేఁ
గూలవే సంతాపకుంజరములు
నారాయణస్మరణ ప్రభాకరదీప్తిఁ
దీఱవే షడ్వర్గతిమిరతతులు

ఆ॥ నలిన నయనభక్తి నావచేఁగాక సం
సారజలధి దాఁటి చనఁగరాదు
వేయునేల ? మాకు విష్ణు ప్రభావంబు
దెలుపవయ్య ! సూత ! ధీ సమేత !

—(ఆంధ్రమహాభాగవతము)

అని శౌనకాది మహామునులు సూతమహర్షితో విన్న వించిరి. అతని వలన తత్ప్రభావము నామూలాగ్ర మవగత మొనరించుకొని భగవన్నామ సంకీర్తన తత్పరులై, తన్మాధుర్య మును తనివిదీర నాస్వాదించిరి. ఆ మాధుర్యమును మనకందఱి కును చవిజూపిన మహాభాగులువారు. భగవన్నామ సంకీర్తనా నందలహరిలో నోలలాడిన ఆమహర్షు లెంత ధన్యాత్ములోగదా !

చిన్న వటబీజమున మహావృక్షము గర్భితమై యున్నట్లు, సూక్ష్మమైన భగవన్నామమునందు మహత్తరమైన అనంత దివ్య

శక్తి ఇమిడియున్నది. కనుకనే - భగవన్నామ జపసంకీర్త నాదులు స్వయం ప్రభావములై, సర్వసంపూర్ణములై, సర్వ పాప పరిహారకములై, సర్వశుభ శ్రేయోదాయకములై, నిత్య శాంతి ప్రదములై, నిత్యానంద దాయకములై యుద్దీపించు చుండును.

భగవన్నామసంకీర్తనము - మానవుల చిత్తమనెడి దర్ప ణమునఁగల మలినమును తొలగించును. శుద్ధిని చేకూర్చును. సర్వవిధ సాధనములకును భగవన్నామసంకీర్తనమే ప్రధానాధా రము. అందువలననే - నామస్మరణము వినా కర్మజ్ఞానములు నిష్ప్రయోజనములని శాస్త్రములు వేనోళ్ళ చాటుచున్నవి. కనుక, దుఃఖ నివృత్తికిని, సుఖప్రాప్తికిని నామస్మరణమే పరమ శరణ్యమని వ్యక్తమగుచున్నది.

హరినామసంకీర్తనమే తరణోపాయమనియు, ఈ కలి యుగమున నంతకంటెను అన్యమార్గము లేదనియు త్రికాలజ్ఞు డును - త్రిలోకసంచారియు - పరమ భాగవత శిఖామణియు - బ్రహ్మర్షియునగు నారదుఁడు స్పష్టీకరించెను.

సర్వథా సర్వకాలములయందును దుష్కార్యము లాచ రించు పాపాత్ములు సైతము భగవన్నామ సంకీర్తనమువలన పరిశుద్ధులై, దేహాంతమున పరమపదమును పొందగలరనియు, భగవన్నామ సంకీర్తనము గావించు వారలకు దేశ కాల నియ మములు లేవనియు విష్ణుపురాణము విశదము చేయుచున్నది.

భగవన్నామ ప్రభావము అఖండము; అప్రతి హతము. అనిర్వచనీయమైన ఆ ప్రభావమును బాగుగా నెఱింగి తదను భూతిని పొంది నిత్యానందము ననుభవించిన వారెందఱో గలరు. వ్యాస, పరాశర, శుక, శౌనక, సనక, సనందన, సనత్సుజాత, నారద, వాల్మీకి, వామన, జాబాలి, యాజ్ఞ వల్క్యాది మహామునులును – ప్రహ్లాదాంబరీషాది పరమభాగ వతోత్తములును – హనుమదక్రూరాది మహాభక్తాగ్రేసరు లును, ఆళ్వారులును, శంకర, రామానుజ, మధ్వాచార్యా దులును, చైతన్య, జ్ఞానదేవ, నామదేవ, తుకారాం, సమర్థ రామదాసు, కబీరు, దాదూ, రైదాసు, రామానంద, తులసీ దాసు, సూరదాసు, పోతన, నానక్, రామకృష్ణపరమహంస, త్యాగరాజు, రామదాసు, మీరాబాయి, సక్కుబాయి, మొల్ల మున్నగు మహాభక్తజనులును భగవన్నామ ప్రభావమును బాగుగ నెఱింగి అనుభవించిన మహాత్ములు. ప్రజల అంతరంగ ములలో భగవద్భక్తిని గంగాప్రవాహమువలె పొంగింపగల్గిరి.

"పరమ దయానిధే పతితపావననామ హరే యటంచు సుస్థిరమతులై సదా భజనసేయు మహాత్ముల" దరి కేగవలదని కుముందు కింకరోత్కరముల కానబెట్టినట్లు గోపన్న యెలు గెత్తి చాటినాడు."

ఇందు "సుస్థిరమతులై" యనెడి పదము సముచితార్థ సంభరితము.

"అనన్యా శ్చింతయంతో మాం యే జనాః"

అనెడి గీతావాక్యమున కిది దర్పణము. అనన్య చింతన-మానవుని యేకాగ్రితకు సాధనము. ఈ దివ్య సాధనయే సంకీర్తనపరులకు - భవ్యఫల సిద్ధిని ప్రసాదించును. అట్టి యేకాగ్రితనుగూర్చి భక్తి పారవశ్యమున త్యాగయ్యయు తియ్యగ పాట బాడినాఁడు.

"నిధి చాల సుఖమా ?
రామునిసన్నిధి చాల సుఖమా ?"
"సంగీతజ్ఞానము భక్తి వినా
సన్మార్గము గలదే మనసా !"

భక్తిభావ సమన్వితమైన త్యాగయ్య గాన మాధుర్యమును మనము నేటికిని ఆస్వాదించుచునే యున్నాముగదా !

"రఘుపతి రాఘవ రాజారాం
పతితపావన సీతారాం"

అని గాంధీమహాత్ముఁడు గావించిన భగవన్నామ సంకీర్తనము నేటికిని విశ్వవిశ్వాంతరాళములలో మార్మ్రోగుచునే యున్నది.

ఈ నవీన యుగమున భౌతిక శాస్త్రవేత్తల కిట్టివి గిట్టవు హేతువాదమునకు పట్టము గట్టి, తదనుగుణమైన మానసికస్థితి ప్రబలము గావించు యుగమిది. నిత్య సత్యమగు భగవ

స్వరూపమును దర్శించుటకు దివ్యచక్షువు ముఖ్యము - అనెడి ఆలోచనయే వీరికి రాదు.

నేటి విద్యార్థికులలో నిట్టి వికారభావములే విశేషముగా గన్పట్టుచుండుట విచారకరము. భౌతిక చక్షువునకు కనిపించిన దెల్ల తథ్యమనియు, కనిపింపనిది సర్వము మిథ్యయనియు వీరి మతము. చర్మచక్షువునకు కనిపింపని భగవంతుని రూపగుణ నామసంకీర్తనము ఫలప్రదము కాగలుగుటెట్లని వీరివాదన. గాలి కనిపింపకయే మానవుని మనుగడకు ప్రధాన హేతుభూతమగుచు న్నదను భావనవైపు వీరి యూహాలు ప్రసరింపవు. నిత్య సత్యమగు భగవత్స్వరూపమును దర్శించుటకు దివ్యచక్షువు ముఖ్యము అనెడి ఆలోచనయే వీరికి తోచదు. మనస్సునకందని విషయములను వీరు విశ్వసింపరు. ప్రతి విషయమును, ప్రతి వస్తువును పరిశీలించి, పరి శోధించి, తత్ఫలితముగ తమ బుద్ధిబలమున కందు నిర్ణయములను మాత్రమే సత్యములుగా సంభావించుచుందురు. ఏవిషయమాలో చింపవలసివచ్చినను, ఏ కార్యమును నిర్వహింపవలసివచ్చినను అది వీరికి భౌతికశాస్త్రమున కనుగుణముగ నుండవలెను. హేతు వాదమున కనుకూలముగ నుండవలెను. ఇది వీరికి ముఖ్య లక్ష ణము. ఇట్టి యుగమున, ఇట్టి వాతావరణమున బుట్టినమనము- అట్టివారల మానసిక ప్రవృత్తులను గమనించుచునే యుండవ లెను. మనపరిసరములందలి అట్టి మానసిక ప్రవృత్తులు మనలను అప్రయత్నముగ నపుడపు డాకర్షింపవచ్చును. అందువలన మన మప్పట్టుల కన్నుగలిగి మిక్కిలి జాగరూకతతో మెలంగుట

అత్యంత మావశ్యకము. మానవాతీతశక్తి సమన్వితమగు దైవిక తేజమును దిలకింపజాలని మన చర్మచక్షువుల బలమునుగూర్చి మనము విచారించుట యోగ్యము. వాస్తవికస్థితిని గూర్చి మనము విచారింపవచ్చును. తర్కింపవచ్చును. అంతియేకాని పరమాత్ముని యునికినిగూర్చియే ప్రశ్నింపబూనుట అవివేకము-హాస్యాస్పదము.

"నామస్మరణా దన్యోపాయం
నహి పశ్యామో భవతరణే"

భవసాగరతరణమునకు నామస్మరణము కంటెను అన్యోపాయ మెద్దియు లేదని శాస్త్రములు వేనోళ్ళ చాటుచున్నవి. ఈ సత్యమును సంభావించిన ముముక్షువులనేకులు భక్తిభావముతో సలక్షణముగా భగవన్నామసంకీర్తనము గావించుచు తత్ఫలితములను పొందుచునే యున్నారు.

మన మహర్షులు తమ చిరకాల తపఃఫలముగా లభించిన శక్తియుక్తులను విశ్వకళ్యాణమునకు వినియోగించిన మహనీయులు. ఆ మహనీయులు-తమ తపఃఫలములైన జ్ఞానవిజ్ఞానములను, అనుభూతులను ఆధారముగ నిడుకొని, అమూల్యములును అత్యంత ఫలప్రదములునగు విశిష్ట విశేషములను సూత్రప్రాయముగ విశ్వమునకందించి, మహోపకారము గావించిరి. వారి మహోపదేశసుధ మానవకోటికి అజరామరమైన ఆత్మశక్తి నీయగలదు. దాని నందుకొనుటకు మనకృషి దీక్షాబద్ధముగ

నుండవలయును. వివిధ విషయములను నానావిధములుగా ఆ మహనీయులు పరిశీలించి పరిశోధించి అంత్యనిర్ణయములుగా వానిని సూత్రీకరించిరి. సంశయగ్రస్తములును - తాత్కాలిక ప్రయోజనకరములునగు విషయములను పరిత్యజించి, శాశ్వత ఫలప్రదములైనట్టియు - నిత్య సత్యములైనట్టియు నిర్ణయము లనే వారు నిర్దుష్టముగ సూత్రీకరించిరి. ఇట్టి సూత్రములు-భౌతిక శాస్త్రమే పరమ ప్రమాణముగా భావించు ఆధునికులకు రుచింప కున్నవి. లోకకల్యాణమే పరమ ప్రయోజనముగాభావించి, తమ సర్వశక్తులను అందులకు వినియోగించి, తమ జీవిత సర్వస్వ మును తత్సాధనమున కంకిత మొనర్చి, అత్యంత ప్రేమతో మన కందించిన దివ్యసూత్రములను భౌతికవాదులు నిరాదరణబుద్ధితో నిరాకరించుటకును వెనుదీయరు. ఎంతటి సత్యసమ్మతములైన సూత్రములనైనను వీరు విశ్వసింపరు. ఫలితములను విశ్వసింపక అవి లభించుట కనుసరించిన విధానములకు, పరిశీలనా పరిశోధన ములకు అత్యంత ప్రాధాన్యము నొసంగుచుండుట వీరికి పరిపాటి. ఇట్టివారు - చిరకాల తపఃఫలముగా లభించిన అమృత ఫలముల నందించిన మహర్షుల మహోపదేశములను విననొల్లరు. ఆ మహోపదేశములను విన్నవారిని - విశ్వసించినవారిని- 'వితండ వాదులు, మూఢవిశ్వాసులు' అని అవహేళన మొనర్చుటకును వీరు వెనుదీయరు. భగవన్నామ ప్రభావమును బాగుగా వ్యక్తముగావించు భాగవత మత గ్రంథములను సావధానముగ సమగ్రముగ పరిశీలించి, అందలి మధురభావములను-అమూల్య

విషయములను గ్రహించు సహనముగాని, ప్రయత్నముగాని వీరి కేమాత్రమును గిట్టదు. తామాకాంక్షించునట్టియు-అభిల షించునట్టియు ఫలితముల నందుకొనుటకుమాత్రము వీరికి దగ్గర దారులు కావలయును. ప్రయత్నము లేకయే - కష్టింపకయే ఫలముల నాకాంక్షించుట వీరి సహజ గుణము. అల్పజ్ఞాన సాధనములతో-మిడిమిడి జ్ఞానముతో నిగూఢములును-అనల్ప ములునగు విషయములను వీరు సులభముగ, త్వరితగతిని తెలియఁగోరుచుందురు. ఎంతటి శాస్త్రసమ్మత విషయమైనను, వాయువేగగమనపరులగు వీరికి శ్రమింపకయే సులభముగా దెలిసిపోవలెను. ఏ విషయమైనను వీరికి - 'సూక్ష్మములో మోక్షము'గా నుండవలెను. విమాన ప్రయాణమువలె క్షణ కాలములో వీరికి విషయావగాహనము కావలయును. నవనాగ రికు లనేకులలో ఈ లక్షణములు విశేషముగా గన్పట్టుచునే యున్నవి. ఇట్టివారికి సహనము పూజ్యము; హృదయము వికాస రహితము. ఇట్టి వీరి దృష్టిలో - భగవన్నామసంకీర్తన తత్పరులగు పరమ భాగవతోత్తములు మూఢవిశ్వాసులు. మహాఛాందసులు. ఇట్టి వివేక దూరమగుభావన వీరిలో ప్రవేశ్శ్ర దన్నుకొని వెఱ్ఱితలలు వేయుట విచారణీయాంశము.

భాగవతమతము భక్తిప్రధానమైనది. అది - భవసాగర తరణమునకు నావయై, భక్తులను తరింపజేయుచున్నది. దీనికి భగవన్నామ సంకీర్తనము ముఖ్యమైనయంగము. నియమనిష్ఠలు

ఆచారవ్యవహారములు ప్రత్యంగములు. ఇట్టి భాగవతమతాను యాయులగు ముముక్షువులు - నియమనిష్ఠలతో భగన్నామ సంకీర్తనము గావించుచుందురు. ఇది వీరి నిత్యకృత్యము.

భగవంతుని ఏరూపమునన్నైన భావింపవచ్చును; ఏనామమునన్నైన స్మరింపవచ్చును. కాని, ఆ నామరూపములనే చిర కాలము మనన మొనర్చుట అత్యంతము ఫలప్రదము. ఇదియే భాగవతమత రహస్యము. చైతన్యమహాప్రభువు-తన దివ్యాను భవ ప్రబోధములచే మనకందించిన మధురఫల మిదియే.

శ్లో॥ చేతోదర్పణ మార్జనం భవ మహా దావాగ్ని నిర్వాపణం
శ్రేయః కైరవ చంద్రికావితరణం విద్యావధూజీవనం
ఆనందాంబుధివర్ధనం ప్రతిపదం పూర్ణామృతాస్వాదనం
సర్వాత్మ స్నపనం పరం విజయతే శ్రీకృష్ణ సంకీర్తనమ్॥

—(శిక్షాష్టకము-1)

'చిత్తమనెడి అద్దమును పరిశుభ్రముగ, నిర్మలముగ తుడుచునదియు - సంసారరూపమగు కారుచిచ్చును శమింపఁ జేయునదియును-పరమ మంగళమనెడి కుముదములు వికసించు టకు వెన్నెలను ప్రసాదించునదియును - 'పరావిద్య' అనెడి సుందరికి ప్రాణమైనదియు - ఆనందమనెడి సముద్రము నుప్పొం గించునదియు అడుగడుగున అమృతమును బాగుగా చవిజూపిం చునదియును-సకలజీవులకు నిర్మలతను-పవిత్రతను-మార్దవమును

స్నిగ్ధతను కలిగించునదియును-అద్వితీయమైనదియునగు శ్రీకృష్ణ సంకీర్తనము సర్వోత్కృష్టత నొందుచున్న' దను చైతన్యమహా ప్రభు మధుర భావములను మన మెన్నటికిని మరువఁ జాలము. ఇది – ఇంతటి ప్రభావముతో గూడియుండుటవలననే-

శ్లో॥ ఇదం శరీరం పరిణామ పేశలం
పత త్య వశ్యం శ్లథ సంధి జర్ఝరమ్
కి మౌషధైః క్లిష్యసి మూఢ దుర్మతే!
నిరామయం కృష్ణరసాయనం పిబ.

(కులశేఖరాళ్వార్)

'ఓ మూఢుఁడా! ఈ శరీరము పరిణామముతో గూడి నట్టిది. దారుణవ్యాధులచే ఒక్క క్షణకాలములో నీ శరీరము పతనము కాఁగలదు. కనుక ఓ మందుఁడా! ఇందుకు సామాన్యములైన మందుల సేవించి ఫలితముగానక వ్యథపడనేల? సంపూర్ణారోగ్యమును సమకూర్చు శ్రీకృష్ణభగవానుని నామామృతమును గ్రోలు'మని కులశేఖరాళ్వారు ఉద్బోధించెను.

పరమ భాగవతాగ్రగణ్యులును - పరమైకాంతులు నగు పన్నిద్దరాళ్వారుల పాశురములలోని పరమార్థ మి ట్లతి గంభీరమై భాసించుచున్నది. ఈరీతిగా, భగవన్నామ సంకీర్తన ప్రభావమును మధురమధురముగ గానము చేసిన పరమ భాగవతులు-మహానుభావులు ఎందరో గలరు. అట్టి మహానుభావుల

మహా భావనము బద్ధచేతనులకు మార్గదర్శకమై, మహా ఫల ప్రదమై, లోకోపకారకమై విరాజిల్లుచున్నది.

భగవన్నామ సంకీర్తన ప్రభావము - భక్తునిపై నెట్లు ప్రసరించునో తెలియుట మిక్కిలి యవసరము. మున్ముందు - మానవుని బహిరంతర నిర్మాణ విశేషములను గ్రహించినగాని, నామప్రభావము పరిపూర్ణముగా బోధపడఁజాలదు. కనుక, ఆ విశేషముల నొకింత పరిశీలింతము.

'జాతస్య హి ధ్రువో మృత్యుః
ధ్రువం జన్మ మృతస్య చ.'

—(భగవద్గీత 2 - 27)

మానవునకు జనన మరణములు సహజ సిద్ధములు. ఇవి మనకు ప్రత్యక్షముగ గన్పట్టు నిత్యసత్యములు. ఇట్టి జనన మరణములు లోకమున నిరంతరాయముగ జరుగుచునేయున్నవి. జననమునకు పూర్వముగాని, మరణమున కనంతరము గాని శరీరమున కెట్టి మార్పును ఉండదు. ఒకవేళ నేమాత్ర మైనను మార్పు ఉన్నట్లు గోచరించినను - అది పరిగణింపఁదగి నంత మార్పుకాదని తెలియవలయును. మరణించిన వెంటనే, మానవుని చర్యలన్నియు అడుగంటును. భౌతిక శాస్త్రవేత్తల దృష్టిలో మరణ మనఁగా - శ్వాస, హృదయ స్పందనము ఆగిపోవుట మాత్రమే. ఉచ్ఛ్వాస నిఃశ్వాసములు, హృదయ స్పందనము, మాత్రమే ప్రాణమున్నదనుటకు ప్రధానాధారము

-నియు, ప్రబల ప్రమాణములనియు వీరి యభిప్రాయము. ఈ యభిప్రాయము అశాస్త్రీయ మనియు, సత్యదూరమైన దనియు మన మహర్షుల నిర్ణయము. ప్రస్తుత శరీరమును వీడి, మఱియొక శరీరమున ప్రాణము ప్రవేశించుటయే మరణమని - తమ తపఃప్రభావము వలనను, యోగాభ్యాసము వలనను మహర్షులు - యోగులు సుస్థిరములగు నిర్ణయములను ప్రకటించిరి. అనఁగా - ప్రాణము స్థూలశరీరమును వీడి, సూక్ష్మశరీరమున బ్రవేశించుటయని తాత్పర్యము. ఇట్లు జీవుఁడు తరతమములగు సూక్ష్మశరీరము లనేకములలో క్రమముగా ప్రవేశించుచు, అంత్యమున పునర్జన్మమును బడయునని వీరి నిర్ణయము. ఇది శాస్త్రసమ్మతమైన సత్యమనియు, విశ్వసనీయమనియు విజ్ఞు లంగీకరించుచునే యున్నారు. కాని, దీనిని విశ్వసింపని భౌతిక శాస్త్రజ్ఞులును కొందఱు లేకపోలేదు. కాని, ఈ నిర్ణయము కేవలము ఊహామాత్ర సంజనితము కాదు; మూఢ విశ్వాసమును కాదు. పరిశీలనా పరిశోధనలపైనను, అనుభవముల పైనను ఆధారపడి క్రమవిధానమున, శాస్త్రసమ్మతముగా గావింపఁబడిన స్థిరనిర్ణయమే సహేతుకమైన నిత్యసత్యము. ఇట్టి నిర్ణయములను విశాలదృష్టితో - విజ్ఞాన వివేకములతో నిశితముగ పరిశీలింపక, తమ తర్కవాదమునకు - మనస్సునకు అందుటలేదని వేగిరపాటుతో త్రోసిపుచ్చుచున్నారు. ఇట్టి భౌతిక వాదులకు మనోనేత్రము వికసింప లేదనియు, అంతకంటెను విశిష్టమగు దివ్య చక్షువు మూఁగునఁబడియున్నదనియు

మనము నిస్సంశయముగా జెప్పవచ్చును. ఇందువలన, ఇట్టివా నిర్ణయములు సార రహితములు, నిష్ప్రయోజనములు అ యెఱుంగ నగును.

ఈ యంశమును మనము మఱియొక మార్గమునగూ సులభముగా గ్రహింపవచ్చును. ఎట్లన :- శ్వాస, హృదయ స్పందనము - ఇవి రెండును ఒకే తావునుండి వెలువడుననియు పరస్పర సంబంధమును గలిగి యున్నవనియు మన మహర్షుల ఎప్పుడో నిర్ణయించిరి. ఈ నిర్ణయమును నేటి భౌతిక శాస్త్ర వేత్తలును అంగీకరించుచునే యున్నారు. నవీన వైద్యశాస్త్ర నిపుణులును శస్త్రములను సాధనములుగ నిడుకొని, ప్రయో ముల గావించి, ఈ సత్యమును మనకు ప్రత్యక్షముగ జూ ట్టుచునే యున్నారు. ఇది ప్రయోగాత్మకమైన ఫలితముగనుక అట్టి శస్త్రములను ప్రతి వ్యక్తియు, క్రమవిధానమున ప్రయో మొనర్చి, ఆ ఫలితములను ధ్రువపరచు కొనవచ్చును.

భగవన్నామ సంకీర్తనమును ఎడతెగక జేయువారు ఉచ్ఛ్వాస నిఃశ్వాసములను గావించుచునే యుందురు. వారి నుచ్చరింపఁబడు నామము ఎట్టి ప్రయత్నము లేకయే-శ్వాసతో సమ్మిళిత మగుచుండును. ఇట్లు నామము, ఉచ్ఛ్వాస నిఃశ్వా ములు అన్యోన్యముగ పెనవైచుకొని, వేరుపఱచుటకు వీల గాని విధమున నుండును. ఇట్లు రెండు పనులు ఏక కాలము నిరంతరాయముగ జరుగుచునే యుండును. ఈ రీతిగా ఎడతెగ

జరుగు నామసంకీర్తనమును 'అజపజప' మని భాగవతోత్త
ములు నుడువుచుందురు. ఈ స్థితిని బడసిన భక్తుడు - మన
స్సున కతీతమైన అనంతశక్తులను పొందుననియు, అనేక సిద్ధుల
నందగలఁడనియు, భగవంతుని ప్రత్యక్షముగ గాంచుచు, నిత్యా
నందము ననుభవించుచుండు ననియు భాగవతోత్తములు తమ
యనుభవములను దెలుపుచుందురు. మహాభక్త శిఖామణులగు
నిట్టి పరమ భాగవతోత్తములకును, భగవంతునకును ఎంతయో
సన్నిహిత సంబంధముండును. తా మెట్టి కర్మల నాచరించు
చున్నను - సర్వదా - సర్వత్ర భగవంతుని ప్రత్యక్షముగ గాం
చుచు పరమానందము ననుభవించుచుందురు. ఇట్టి స్థితిని బడ
యుటకు భక్తుని సర్వేంద్రియములును నిరంతర నామసంకీర్తన
ప్రభావమువలన పుటముబెట్టబడి పవిత్రతను పొందుచుండును.
భౌతిక చక్షువు దివ్యచక్షువుగ పరివర్తనముజెందును. మనస్సు
మలినరహితమగును. హృదయము వికసించును. విశ్వమంతయు
దివ్యముగా - ప్రేమ మయముగా - భగవన్మయముగా గోచ
రించును. అట్టి భక్తున కన్య మెద్దియు:
గాక - అట్టి భక్తుడు భగవదనుభూతిని బడసి, [illegible]
నందును. తానేమి గావించుచున్నను, భగవదాజ్ఞానుసారమే
గావించుచున్నట్లు సంభావించును. తన శరీరములోని ప్రత్యే
కాణువు నందును - సర్వత్ర భగవంతుని స్పర్శయే గోచరించును.
అతఁ డన్నింటియందును, అంతటను భగవంతునే సందర్శించును.
సంకీర్తనానంద జలధిలో దేలియాడు సాధకునకు సర్వము సం

తోషదాయకముగనే - పరమపావనముగనే-సర్వేశ్వర స్వరూపముగనే సాక్షాత్కరించును. ప్రతి శ్వాసతో భగవన్నామము మిళితమొనర్చి, నిరంతరాయముగ సంకీర్తన గావించుచుండుటచే నిట్టి అమృత ఫలములు లభించును. భక్తునకివి సహజానుభవములు; సర్వసామాన్యముగ జరుగుచుండు నిత్యకృత్యములు. అట్టి భక్తుఁడు తన యనుభూతులను పరులకు ప్రత్యక్షముగ జూపెట్టుచుండును. ఇవి సక్రమముగా ధ్రువపడు పఁజాలు సత్యము లెట్లగునని అనేకుల కాశ్చర్యమును గల్గింపవచ్చును. కాని, వీనిని జూపెట్టు మహనీయులు నేటికినిమనకు దర్శనమిచ్చుచునే యున్నారు. శ్రీరామకృష్ణ పరమహంస - వివేకానందస్వామికి భగవంతుని ప్రత్యక్షముగ జూపించెను. మనలో కొందఱు వారిని దర్శింపకపోవచ్చును. వారి యనుభూతులను గమనింపకపోవచ్చును; వారి ప్రభావమును గుర్తింపకపోవచ్చును, వారి యప్రాకృత స్థితిని తెలియఁజాలకపోవచ్చును; వారి దర్శనానుభవ ప్రభావాదుల నెఱుంగగోరు వారలకు పవిత్రమైన యంతఃకరణము, హృదయవికాసము, ఆత్మానుభవము నత్యావశ్యకములు.

సృష్టిలో నామరూపములు లోపించినచో మానవుని మనుగడ కుంటుపడును; కనుక, అవి యందఱకును అవశ్యాపేక్షితములు. చూడుఁడు :- రాముఁడు, కృష్ణుఁడు ప్రాణస్నేహితులు. 'కృష్ణా!' అని రాముడు పిలువగనే - 'ఆ?

ఇచ్చటనే ఉన్నాను' అని కృష్ణుఁడు సమాధాన మిచ్చును. ఈ కృష్ణుఁడెవరు? ఇతరుల నుండి భిన్నునిగసూచించు నామముతో పిలువఁబడు నీ కృష్ణుఁడు శరీరమా? అట్లగుచో - 'ఆఁ! ఇచ్చటనే ఉన్నాను' అను సమాధానము ప్రాణములేని శరీరము నుండి వచ్చునా? ఎన్నడును రానేరదు. అట్లుగాక, ప్రాణమే యిట్లు ప్రశ్నించునా? అట్లగుచో - ప్రాణమునకు నామము కలదా? శరీరముతోగాక, ప్రాణముతో మాత్రమే నామసంబంధము గలిగియున్నచో - శరీరము వీడిన ప్రాణము రాముని పిలుపున కేల సమాధానము నీయదు? నామమును ప్రకటించు సాధనమగు శరీరము, ప్రాణమునుండి వేరగుటవలననే ప్రాణము రాముని పిలుపునకు సమాధాన మొసఁగజాలదుగదా! ఒకవేళ సమాధాన మొసంగఁ జాలకున్నను - ప్రాణము రామునికడకే తెంచి, వానికి గన్పింపవచ్చునుగదా? అదియును అసంభవమనియే స్పష్టమగుచున్నది. ప్రాణమునకు కృష్ణుఁడను నామముండియున్నదన్నను, అది ప్రాణమునకు శరీరముతో సంబంధమున్నంతవఱకు మాత్రమే అన్వయించును. ప్రాణము శరీరమును వీడినంతనే, నామముతో తన సంబంధమును త్రెంచుకొనును. ప్రాణము, శరీరము ఇవి రెండును ఏకమై యున్నంతవఱకును నామ మన్వయించునని యిందువలన మనకు స్పష్టమగు చున్నది. నామి -నామముల సంబంధముకూడ నిట్టిదియే. కనుక, రాముఁడు కృష్ణుని ఎడతెగక పిలుచుచున్నచో-కృష్ణుఁడును - ఆఁ! నేనిచ్చటనే యున్నాను'-అని సమాధాన మిచ్చు

చునే యుండును. ఇది సహజసిద్ధము; నిత్యసత్యము. ఇట్లే ప్రతి శ్వాసతోఁ భగవన్నామ సంకీర్తనము గావించు భక్తుఁడును భగవంతుని సమాధానములను తా నొనరించు సంకీర్తనమున కుచిత ఫలితములను పొందుచుండును.

"అహం భక్తపరాధీనః అస్వతంత్ర ఇవ ద్విజ!"

అని అంబరీషోపాఖ్యానమున భగవానుఁడు దూర్వాసునితోఁ బలికినట్లు—భక్తపరాధీనుఁడగు భగవానుఁడు, ఇట్టి భక్తుల మనోరథముల నీడేర్చును. మధుర ఫలముల నందించును. పరమానందమును ప్రసాదించును. భక్తునకును – భగవానునకును గల అవినాభావ సంబంధము అనుభవైక వేద్యము.

శ్వాసకు – హృదయస్పందనమునకు – ప్రాణమే మూలాధారము. అయినను యోగాభ్యాసపరులై, సమాధి స్థితిలోఁ గల యోగులకు ఉచ్ఛ్వాస నిశ్వాసములుండవు; హృదయము స్పందింపదు. మరణ చిహ్నములను జూపెట్టు స్థితిని ప్రకటించుచుండును. కాని, అట్టి యోగుల శరీరము చెడిపోదు; దుర్వాసన వేయదు. అది శవమును కాదు. శరీరము యథాతథముగనే యుండును. శరీరమునందలి అవయవము లేవియు పనిజేయుచుండవు. ప్రాణమున్నట్లు దోపింపదు. అయినను అతఁడు సజీవముగ నున్నట్లే సంభావింపఁబడుచుండును. ఇది యోగాభ్యాస మూలమున నేర్పడు వాస్తవిక స్థితి.

యమము – నియమము – ఆసనము–ప్రాణాయామము–ప్రత్యాహారము – ధారణము – ధ్యానము – సమాధి అనునవి

అష్టాంగయోగములు. అహింస, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము, అపరిగ్రహము అనునవి యమ మని చెప్పఁబడును. ఈ యమమువలన చిత్తశుద్ధిగల్గును. శౌచము, సంతోషము, తపము, స్వాధ్యాయము, భగవదారాధనము అనునవి నియమ మని చెప్పఁబడును. ఈ నియమమువలన బాహ్యశుద్ధియు - అంతశ్శుద్ధియు నేర్పడును. వక్షమును, భుజములను, శిరస్సును నిశ్చలముగా నిటారుగనిలిపి, శరీరమును సక్రమవిధానమున నుంచుట ఆసనమనఁబడును. ఇందువలన, ఇంద్రియములన్నియు స్వాధీనము లగును. ప్రాణాయామ మనఁగా-ఉచ్ఛ్వాస నిశ్వాసములద్వారా ప్రాణగతిని వశమొనర్చుకొనుట. తత్ఫలితముగ నాడీశుద్ధి, చిత్తశుద్ధి గలుగును. ఇది - రేచక, పూరక, కుంభకము లని మూఁడు విధములు. రేచక మనఁగా - ఊపిరి విడచుట. పూరక మనఁగా-ఊపిరిపీల్చుకొనుట. కుంభక మనఁగా - ఊపిరి నిలుపుట. ఈ ప్రాణాయామమువలన భూమిపై ఆసీనుడైయున్న యోగి తేలికగ పైకి లేచుటకు తగిన శక్తియు, దివ్యానందమును లభించును. ప్రత్యాహారమనఁగా - ఇంద్రియములు తమ తమ విషయములను విసర్జించి, చిత్తముయొక్క స్వరూపమును పొందుట. హృదయ కమలము నందుగాని, శిరస్సునందలి సహస్రారకమలము నందుగాని మనస్సును నిలుపుట ధారణ మనఁబడును. దీనివలన, ఇంద్రియములన్నియు సంపూర్ణముగ వశము కాఁగలవు. అట్లు ఇంద్రియములన్నియు వశమైన పిమ్మట, ఏక భావప్రవాహరూపముగాఁగల్గు జ్ఞానమే ధ్యానము. సమాధి

యనఁగా-సర్వమును సర్వేశ్వరునకు సమర్పించుట. భగవంతుని శరణు పొందుటవలన ఇట్టి సమాధిస్థితి లభించును. బ్రహ్మానందానుభవమే దీనికి ఫలము.

పైన జెర్కొన్న కారణముల ననుసరించి – 'శ్వాస, హృదయస్పందనము ఆగిపోయినచో అది మరణమే యగు' నను నవీన భౌతిక శాస్త్రజ్ఞుల నిర్ణయము విఫల మగుచున్నది.

యోగి సమాధిగ్రస్తుఁడై నంతనే – ప్రాణము స్థూల సూక్ష్మశరీరముల నుండి కారణ శరీరమున కేఁగి, అట నిశ్చలముగా విలసిల్లుచుండును. అట్టి స్థితిలో జీవుఁడు కారణ శరీరముతో మాత్రమే సంబంధమును కలిగియున్నను, స్థూల సూక్ష్మ శరీరములను కలిపియుంచు కొలికి మాత్రము వీడియుండదు. ఇది మన భౌతిక చక్షువునకు గన్పింపకున్నంత మాత్రమున ఆ స్థితిని మన మేమాత్రమును సంశయింప నక్కఱలేదు. అది విధిగా నంగీకరింపవలసిన సూక్ష్మవిషయము. కనుక, మన స్థూల దృష్టికి యోగి మరణ చిహ్నములను గల్గియున్నవానివలె, మరణించెనను భావమును గల్గించు విధమున గన్పట్టుచున్నను అతని శరీరము అణుమాత్రమైనను చెక్కుచెదరక, చెడక, యథాతథముగనే యుండును. ఇది మనకు ప్రత్యక్షముగ గన్పట్టుచున్న సత్యము. అట్టి స్థితిలో-స్థూల శరీరము కారణశరీరమునకు వశ్యమై యుండును. కారణశరీరము మాత్రము స్థూల శరీరమునకు లొంగియుండదు. యోగమునందు కడపటి దశ సమాధిస్థితి యనియు – అట్టిస్థితికియ్యవి సహజ లక్షణములనియు ముందే

పేర్కొనబడినదిగదా! ఈ సమాధ్యవస్థలో ఉచ్ఛ్వాస నిశ్శ్వాసములు లేకున్నను, జీవుఁడు కారణశరీరమున ఆనందమనుభవించుచునే యుండును. ఇట్టి అపూర్వస్థితి భౌతికశాస్త్రవాదుల యూహాతీతము.

జీవుఁడు శరీరాంతర్వర్తియై యుండును. గావున, అట్టి స్థితిలో స్థూలశరీరము చెడదు. శ్వాసకు కారణము శరీరసంబంధమగుటవలన, అట్టి సంబంధ మున్నంతవఱకును స్థూలశరీరముపై తన శక్తిసామర్థ్యములను ప్రదర్శించుచునే యుండుననుట సుస్పష్టము.

నిరంతర భగవన్నామ స్మరణము – అజపజపము– కారణ సూక్ష్మ శరీరములపై తన ప్రభావమును ప్రదర్శించునట్లే–స్థూల శరీరముపైనను తన శక్తిని ప్రసరింపజేసి, దానిని స్వాధీనమొనరించుకొని, తన సంకల్పానుసారము ప్రవర్తింపజేయు చుండును. ఇదియే యోగశాస్త్రము మన కుపదేశించిన పరమ రహస్యము. ఇది మన పుణ్య భారత సీమకు మహర్షులు ప్రసాదించిన మహత్తర మహోజ్జ్వల దివ్య మార్గము.

మన శరీరములో ఊపిరితిత్తులు హృదయకోశము ఈ రెంటిని మించిన నరములు – నాడులు (వార్తావాహినులు) కలవని ఆయుర్వేద శాస్త్రము అతి ప్రాచీన కాలముననే అభివ్యక్తము గావించినది. ఈ నిర్ణయమును నవీన వైద్యశాస్త్రజ్ఞులును ఆమోదించుచునేయున్నారు. నరములు శరీరమునందు

తమ చర్యలను ప్రస్ఫుటింపఁజేయుచు, స్వీయ ప్రభావమును ప్రకటించుచుండుట అందఱకును అనుభవసిద్ధమైన యంశము. ఇంద్రియముల కందింపఁబడిన సందేశములను యథాతథముగ నరములు మనస్సున కందించును. అనంతరము బుద్ధి నిర్ణయములఁ గావించును. ఈ నిర్ణయములను నరములు మరల ఇంద్రియముల కందించి, కార్యరూపమును పొందించి, బాహ్యమునకు వ్యక్తమగు శ్వాసకంటెను, రక్తప్రసరణముకంటెను త్వరితగతిని కార్యనిర్వహణమునకు గడంగుచుండును. రక్తప్రవాహము హృదయస్పందనముపై నాధారపడియుండును. హృదయస్పందనము శ్వాసకంటెను వేగముగ తన చర్యలను కొనసాగించుచుండును. హృదయస్పందనమునకు వలయు ప్రోత్సాహము, ప్రేరణము ఊపిరితిత్తుల నుండియే లభించుచున్నను, శ్వాసగతికంటెను హృదయస్పందనమే త్వరితగతిని జరుగుచుండును. కనుక, శ్వాసకోశములందును, హృదయమునందును ఉత్పన్నములగు వ్యాధులు–నరముల వ్యాధులకంటెను శీఘ్రముగ నివారించుటకు సాధ్యమగునని ఆయుర్వేద వైద్యుల నిశ్చితాభిప్రాయము. నవీన వైద్యశాస్త్రజ్ఞులును ఈ యభిప్రాయముతో నేకీభవించుచునే యున్నారు. హృదయము, శ్వాసకోశములు గావించు క్రియలలో కంటెను – నరములు తమ తమ క్రియలలో ప్రగాఢముగ ననువర్తించుచుండుననియు, శరీర పోషణమునందును, పారిశుద్ధ్యమునందును శ్వాసనాళముల కంటెను – రక్తప్రసరణమునకంటెను నరములు అధిక ప్రాధాన్యము వహించియున్నట్లు మనకు సుస్పష్టమగుచున్నది.

నరములు భావనా ప్రపంచమున తమ ప్రభావమును బాగుగ ప్రకటించుచుండును. సూక్ష్మములును - మృదులములు నగు నీ నరములు మనస్సుతో సంబంధము గలిగియుండి, తంత్రులవలె మనస్సులో నుదయించు భావములను అటు నిటు నందించుచుండును. ఇందువలన నివి వార్తావాహకములని నుడువఁబడుచుండును. శ్వాస, రక్త ప్రసరణము : ఇవి రెండును కేవలము శరీర సంబంధములు. ఇవి క్రియా ప్రధానములేగాని, భావ ప్రధానములు కావు. ఇందువలన కర్మకంటెను భావ మతిముఖ్యమైన దనియు-సూక్ష్మమైనదనియు - కోమలమైన దనియు తెలియవలయును. భావమును వ్యక్తీకరించుట యన, మనస్సులో నుదయించిన భావమును బాహ్యప్రపంచమునకు వెలువరించుట యని తాత్పర్యము. అట్టి భావప్రకటనమునకు వాహనము (సాధనము) నామము. నామములేని భావమే యుండదనుట నిర్వివాదాంశము. ఆలోచనము జరుగుచున్నదన్న - భావము వెలువడుచున్నదన్న వెనువెంటనే దానికి నామమేర్పడి తీరును. ఇది అనివార్యము. మన మొనరించు ప్రతి కర్మకును, దాని ఫలితమునకు నామము అవశ్యము జోడింపఁబడియే యుండును. నామము లేని కర్మయు,. చర్యయు ఉండనే ఉండవు. కనుక, నరముల విధానము భావప్రకటనమునకు సంబంధించినదే యని మనము నిస్సంశయముగా నిర్ణయింపవచ్చును. సముచితమైన ఈనిర్ణయమును గుఱించి ప్రాజ్ఞులెవరును సంశయింపరు గదా!

బాహ్యప్రపంచమును, క్రియాప్రపంచమును మనము మనస్సు మూలముననే తెలియఁగలము. ఈ బాహ్యప్రపంచమును మొట్టమొదట మనస్సు నెదుటబెట్టునవి నరములే. అప్పుడు మనస్సు దానితత్త్వము నెఱింగి, ప్రకటనముగావించును. కనుక నరముల నిర్మాణము శరీరములోపల మిక్కిలి ప్రాధాన్యమును వహించియున్నట్లు మన మూహింపవచ్చును. ఇట్లు ప్రాముఖ్యమువహించిన నరముల చర్యలు – నామముయొక్క సహాకారమువలననే బహిర్గత మగుచుండును. నరములకును, నామమునకును ఇంతటి యవినాభావసంబంధ మున్నందుననే నామము లోపించినచో ప్రపంచపు టునికియే నశించును. ఇంద్రియములు తమతమ చర్యలను గావించుచుండుట మనకు అనుభవసిద్ధమైన విషయమేగదా! కన్ను చూచును. చెవి వినును. మనస్సు బుద్ధికి సందేశముల నందించును. బుద్ధిగావించిన నిర్ణయములను మనస్సునుండి ఇంద్రియములకు గొనివచ్చి, వాని క్రమచర్యలను నిర్ణీత విధానానుసారముగ నరములు నిర్వహించుట – నరములకు నామముతోఁగల యెడతెగని సంబంధము వలననేగదా!

పరిపూర్ణమగుఅనుభవము–ప్రకటనాశక్తి: ఇవి రెండును ామమునకు అత్యావశ్యకములు. ఇందే యొకటి లోపించినను, నామము మరుగునఁ బడియుండును. అప్పుడు, అనుభవమువంటి స్పందనమునకు – స్పర్శకు తుల్యమైనస్పర్శ కొఱకు అన్వేషణము

గావించును. తెలియనిదాని నెరుకపఱచు జ్ఞానము వికసించు పఱకును దానికి తుల్యమగు స్పర్శను గల్గించును. ఇట్టి నామము నుచ్చరించినంతనే, ఆశబ్దము చెవియందలి మద్దెలపొరవంటి చర్మపుపొరకు దగులును. వెన్వెంటనే ఆ శబ్దము నరముల మూలమున మనస్సున బ్రవేశించును. అట్టి నామమునందలి రూపమును మనస్సు చిత్రించుకొనును.

నామముతో లీనమైయుండు స్పర్శను గల్గించు శక్తి నరములకు గలదు. కనుక, మన బాహ్యస్థితికి - దృశ్యప్రపంచమునకు నరములే సంబంధమును గల్గించుచున్నట్లు తెలియవలయును. నామము మాత్రమే నరములపై క్రియను, ప్రతిక్రియను చేయఁగలదు. ఈ నామప్రభావము కర్మకంటెను మిన్నగా నుండును. బాహ్యకర్మ కంటెను నామమునకు సంబంధించిన చర్యలు-సూక్ష్మాతి సూక్ష్మములు. ఇందువలన, భగవన్నామము నుచ్చరించుచున్నంతనే - ఆ నామము శ్వాసతో మిళితమై, తనప్రభావమును నరములపై ప్రసరింపజేయును. భగవన్నామము శరీరమునందును, మనస్సునందును, బుద్ధియందును, సర్వేంద్రియము లందును, కల్మషమును తొలగించి, పవిత్రతన చేకూర్చును. కనుక, ఇది సత్కార్మానుష్ఠానమును, సదాచార సంపదను, సజ్జన సాంగత్యమును ప్రసాదించును. ఇట్లీనామము అంతటను, అన్నింటియందును తన ప్రభావమును ప్రకటించుచు యుండును. నామము నుచ్చరించువారి ప్రతికార్యము నందును

భగవన్నామము తన శక్తిని - ప్రభావమును ప్రదర్శించుచునే యుండును. ఈ నామోచ్చారణమువలన భక్తుడు అభ్యుదయ పథము నందుచు, పవిత్రతను - ఆధ్యాత్మిక దివ్యతేజమును - ఆత్మానుభూతిని పొందుచుండును. ఇట్టి దివ్యానుభూతులు బాహ్యప్రపంచమునకు గూడ వ్యక్తమగుచునే యుండును. కాఁబట్టి, భగవన్నామోచ్చారణముతో మిళితమగు శ్వాస - పవిత్రభావములను, పరమ శాంతిని, పరమానందమును ప్రసాదించుచుండునని తెలియవలెను. అదియునుఁగాక, భగవత్సాక్షాత్కారమునకు గూడ, ఉచ్ఛ్వాస నిశ్వాసములతో మేళవింపబడిన నామమే ప్రధాన కారణమని మనము సునాయాసముగ గ్రహింపవచ్చును. మానవుఁడు ఇతరోపాయముల కంటెను, భగవన్నామోచ్చారణము వలననే - అజప జపము వలననే భగవదనుగ్రహమును సులభముగా పొందఁ గలఁడు. ఇది నామ జప ప్రశస్తి - భాగవత మత పరమ రహస్యము. భక్తకోటి తరణమునకు సులభోపాయము. ఇట్టి సులభోపాయ వైభవము దశదిశల వ్యాప్తి గాంచి సకల జన సంక్షేమమునకు సాధకము కావలయును. అట్టి సాధన, సర్వేశ్వరానుగ్రహమును నరులకు ప్రసాదించును. భగవదనుగ్రహము భక్తుల మనః పద్మములను వికసింపఁజేయును; భౌతిక ప్రపంచముపై అఖండ విజయమును ప్రసాదించును; ముక్తి నొసంగును. భాగవత మతముగా ప్రసిద్ధి జెందిన వైష్ణవమతము ప్రబోధించు నిత్యసత్య మిదియే. ఇట్టి దివ్యశక్తులను - దివ్యానుభూతిని - దివ్యధామమును ప్రసాదిం

పంగల మహత్తర శక్తులును ఈ మతమున గలవు. ఇది భౌతిక శాస్త్ర సమ్మతమే గాక, తదతీతము కూడ. ఇట్టి అనంత దివ్య తేజః ప్రపూర్ణులగు మహర్షులు, యోగులు సుస్థిరముగ నిర్ణయించి, ఐక్యకంఠముతో నెలుగెత్తి చాటిన 'నరములు సూక్ష్మ శరీరసంబంధములు' అను ఆధ్యాత్మిక సత్యమును, నేటి భౌతిక శాస్త్రజ్ఞులు ఆమోదించుచుండుట ముదావహము.

యోగి - యమ నియమాది సాధనములతో శ్వాసను బంధించి, స్వాధీన మొనర్చుకొనును. వెన్నెముక యందుఁగల 'సుషుమ్న' యను నాడిద్వారా, గుప్తముగ చుట్టలు చుట్టుకొని యున్న కుండలినీ శక్తిని ప్రాణాయామముతో విజృంభింపఁ జేయును. తత్ఫలితముగ, యోగి సమాధి స్థితిని బడయును. వెన్నెముక యందుఁగల 'సుషుమ్న' నాడి మూలముననే నరముల నిర్మాణము జరుగుచున్నట్లు నవీన వైద్యశాస్త్రజ్ఞులును అంగీకరించుచునే యున్నారు. ఈ నరములకు కేంద్రస్థానము చిన్న మెదడు. ఇది శిరస్సునకు వెనుకవైపున నుండును. ఈ మెదడునందు నరముల చర్యలను కేంద్రీకరింప నగును. మఱియు వాని చర్యలను ఏకాగ్ర మొనరించి, వశము చేసికొని, మెదడు నందు లగ్నము చేయవలెను. అప్పుడు - సమాధిస్థితి సుసాధ్యమగును. ఇట్టి సమాధిస్థితిలో - శ్వాస, రక్తప్రవాహము ఆగిపోయి, నిశ్చలత నందినను - చర్య లన్నియు స్తంభింపఁ బడినను మరణించిన వానివలె బాహ్య ప్రపంచమునకు గన్పట్టినను,

యోగి – నిశ్చలమైన సమాధిస్థితిలో సజీవముగనే వెలుగొందు చుండును. అనఁగా – నరములకు సంబంధించిన బాహ్యాచర్యలు ఆగిపోయినను, అంతశ్చర్యలు మాత్రము యథావిధిగ కొనసాగు చునే యుండును. అప్పుడు కారణ శరీరమున నరముల అంతశ్చర్యలు స్థూలశరీరముతో కొలికిని వీడక, దానితో తమ సంబంధమును కలిగియే యుండును. ఇందువలన మరణము సంభవింపదు. ఈ కొలికి తెగిపోయినచో మరణము సంభవించును. పైన చెప్పఁబడిన్న ప్రయోగములు – ఫలితములు యోగాభ్యాసము వలననే చేకూరగలవు. అన్యథా అవి అసాధ్యములు; అసంభవములు. సమాధినిష్ఠులు – సిద్ధపురుషులు నగు నిట్టి యోగిపుంగవులు నేటికిని మన భారతదేశమున నెందఱో జీవించియే యున్నారు. వారిని మనము దర్శింపవచ్చును.

మన శరీము నందలి యే భాగమునఁ గల చైతన్యమునైనను స్తంభింపఁజేసి, స్పర్శజ్ఞానమును తాత్కాలికముగ నిలిపి వేయుటకు వైద్యశాస్త్ర నిపుణులు మత్తుమందులను ప్రయోగించుచుండుట ఎల్లఱకు తెలిసిన విషయమే. ఔషధ ప్రభావము లన నరములు స్తంభించి, శరీరము చైతన్యరహిత మగును. అనఁగా – ఆ భాగము తాత్కాలికముగా మరణించుటయని యర్థము. అయినను – ఆ శరీరములో మాత్రము ప్రాణము నిలిచియే యుండును. నరముల చలనము స్తంభించినంతనే – ఆ భాగము చైతన్య రహితమై, స్పర్శజ్ఞానమును నశింపఁజేసి

తాత్కాలిక మరణమునకు గురి గావించును. ఇట్లే యోగము కూడ ఇట్టి చర్యల నరికట్టగలదు.

మానవుడు మరణించిన వెంటనే ప్రాణి స్థూల శరీరమును వీడి, సూక్ష్మశరీమున ప్రవేశించును. తన సంచిత కర్మ ఫలములను కొంతకాల మనుభవించినను, సూక్ష్మశరీరమునందు కోర్కెల ప్రభావము ప్రబలినంతనే - వాని ఫలితముల ననుభవించును. ఉదాహరణము చూడుడు:- త్రాగుబోతు మరణించిన వెంటనే ప్రాణము సూక్ష్మశరీరమున బ్రవేశించి, ఇంకను త్రాగవలెనను ప్రబలవాంఛతో నిరంతరము బాధపడుచుండును. తన కోర్కెల నీడేర్చుకొనుట కావశ్యకమగు స్థూల శరీరము లేనందున తన వాంఛాసిద్ధికై ఆరాటపడుచు, బాధపడుచుండును. ఇట్లే కాముకుడును. ఇట్లు సూక్ష్మ శరీరమునందు గల జీవుని ప్రధాన వాంఛలు ఫలింపక, క్రమక్రమముగ క్షీణించి పోవుచుండును. అట్టి స్థితియందు జీవుడు సూక్ష్మ శరీరమును వీడి, మానసిక ప్రపంచమున ప్రవేశించును. ఇట - ప్రశాంతమగు సుఖజీవితమునే అతడనుభవించును. ఇట్లు మరణానంతరము సూక్ష్మాతిసూక్ష్మ మగు మానసిక ప్రపంచమున జీవుడు కొంతకాలము గడపి, పునర్జన్మము నందును. మానవుడు జీవించియున్నప్పుడే సూక్ష్మశరీరము నందు మానసిక ప్రపంచముపై నరములు తమ ప్రభావమును ప్రకటించునని ముందే పేర్కొనియుంటిమి.

ప్రకటనమునకు, స్పర్శకు ప్రధాన వాహనములుగా గల కోర్కెలు - వాని ప్రకటనార్థము సూక్ష్మ భావమునే ప్రధాన వాహనముగ స్వీకరించును. అటు పిమ్మట - వాని చర్యలును తీవ్రరూపము దాల్చి, అంతటను వ్యాపించును.

యోగాభ్యాసమున నుత్తీర్ణత నొందినవారికి చిత్తవృత్తిని నిరోధించు శక్తియు, ధారణాశక్తియు కలుగు నని యోగశాస్త్రము వక్కాణించుచున్నది. ఈ ధారణాశక్తి - మానసిక బాహ్యచర్యలను నిగ్రహించి, అంతశ్చర్యలకు రాజమార్గమును నిర్మించి విరాజిల్లఁ జేయును.

నరముల స్పర్శానుభవమువలన, మనస్సు తన చర్యలను-ఆలోచనలను గావించు చుండును. ఇట్లు నరములు సూక్ష్మ శరీరముపై తమశక్తిని, స్పర్శను ప్రదర్శింపఁ జేయుచు, స్థూల శరీరముతో సంబంధము గల కొలికిని తెగనీయక, తమ కార్యకలాపములను కొనసాగించుచునే యుండును. ఈ విషయమును అతి ప్రాచీనకాలముననే యోగము విస్పష్టము గావించెను. యోగులు దీనిని ఆచరణలో జూపెట్ట గల్గిరి. భౌతిక శాస్త్రము సైతము దీని నామోదించు టెంతయు ముదావహము.

కొన్ని సమయములలో వైద్యులు రోగులకు సూదిమందుల నుపయోగింతురు. ఇవి రెండు విధములుగా నుండును. కండరముల ద్వారా మందు నెక్కించుట ఒక విధము. దీనిని - 'ఇంట్రా మస్క్యులర్' అని యందురు. నరములద్వారా మందు

నెక్కించుట మఱియొక విధము. దీనిని - 'ఇంట్రావీనస్' అని యందురు. చిన్న నరముల నుండి సిరలద్వారా ప్రవేశింపఁజేయఁ బడిన మందు హృదయమునకుఁ జని, అటనుండి వ్యాధిగల ప్రాంతమునకు వ్యాపించును. ఇది మనకు అనుభవసిద్ధమైన విషయము. ఇట్లు శరీరములోనికి సూదిమందుల నెక్కించి, ఆ మందును రక్తముతో సమ్మిళిత మొనర్చి, ప్రసరింపఁజేయునట్లు- శ్వాసతో సైతము మందులను సమ్మిళిత మొనర్పవచ్చునుగదా! ఇదియును సాధ్యమే కాఁగలదు. ఈ విధానమునుగూడ వైద్య శాస్త్రవేత్తలు తమ ప్రయోగములచే నిరూపించుచునే యున్నారు. చూడుఁడు :-

లెక్సిన్ (Lexin) అను మందును శ్వాసతో బీల్చినయెడల, తేలుకుట్టిన విషము హరించుచున్నది. ఈ యౌషధమే కొన్ని సందర్భములలో పాముకాటుకుకూడ పనిచేయుచున్నది. 'క్లోరో ఫారం' అను మత్తుమందును శ్వాసతో బీల్చినచో - అది తాత్కాలికముగ శరీరము నంతయు చైతన్యరహితము గావించును. వైద్యుడు రోగి శరీరమును కత్తితో కోయుచున్నను, ఆ రోగికి - అంతకుముందు వైద్యుఁడు ప్రయోగించిన మత్తు మందు ప్రభావమువలన స్పర్శజ్ఞానము నశించియుండును గనుక, అప్పుడు ఏ మాత్రము బాధయు నుండదు. కాని, ఆ మత్తు మందు నందలి శక్తి యంతరించినంతనే - మత్తువీడి, స్పర్శజ్ఞానము కలిగినంతనే - ఆ శస్త్రచికిత్స మిక్కిలి బాధను కలిగిం

చును. మందును శ్వాసతో మిళితముగావించు రోగనివారణ సాధనములు చిరకాలానుభవములు. ఇట్లే శ్వాసతో భగవన్నామమును సమ్మిళిత మొనర్చుటయు, పైన చేర్కొనఁబడిన సూదిమందుల ప్రయోగము (Injections) వంటిదే గదా! కనుక, నామము శ్వాసతో మిళితమై, దివ్యఫలముల నొసంగగల దనుటలో నణుమాత్రము అసత్యము లేదుగదా!

అల్పజ్ఞులు కొందఱు అవివేకముతో ఈ యంశము నామోదింపకపోవచ్చును. అయినను అంతమాత్రమున సత్యము అసత్య మెన్నటికిని కాఁజాలదు. అది అనవరతము దివ్యముగ వెలుగొందుచునే యుండును. ప్రపంచ మున్నంతవఱకును – నామికి, నామమునకు నెడతెగని సంబంధ ముండియే తీరును. అనఁగా – భగవన్నామ సంకీర్తనమును గావించు భక్తునకును, భక్తపరాధీనుఁడగు భగవంతునకును ఏర్పడిన సంబంధము ఎన్నటికిని వీడిపోఁజాలదు. ఇది అవిభాజ్యము; అనివార్యము.

నామము నరముల యందు ఇంద్రియ పరిజ్ఞానమును గల్గించును. ఈ స్పర్శానుభవము మనస్సునకు గొంపోఁబడి, అట ప్రతిబింబించి, 'ప్రతిక్రియలు' అను సముచిత ఫలముల నొసంగును. ఇట్లే – పవిత్రమైన భగవన్నామముతో నిర్మలములైన స్పర్శలు నిరంతరము భక్తునియందు పరివ్యాప్త మగుచునే యుండును. ఇవి – అమూల్యఫలముల నందించుననుట నిస్సంశయము.

భగవన్నామోచ్చారణ గావించిన వెంటనే ఆ నామము శ్వాసతో సమ్మిళితమగును గనుక, అది అప్రయత్నముగా స్పర్శానుభవములను ఇంద్రియజ్ఞానమును మానసిక ప్రపంచమున, నరముల మూలమున నుదయింపఁజేయును. ఇవి నిర్మలములై, దివ్య ఫలములనందించి, నిత్యానందము నొసంగును. ఇది యిట్లుండ – 'నామమునకు శక్తి కలదా? శక్తి యున్నను ఆ శక్తి – మానవుని భౌతిక శరీరముపై తన ప్రభావమును ప్రదర్శించునా? అట్లు ప్రదర్శించినను అది ప్రయోజనకరమా?' ఇట్టి ప్రశ్నలను వేయుట – నేటి కాలమున, భౌతికశాస్త్రమే పరమ శరణ్యముగ భావించు నవ నాగరికులకు పరిపాటియైనది. కాని, ఇట్టి సంశయములకు సక్రమములగు తిన్నని సమాధానములు లేకపోలేదు. ఈ సంశయములను సమాధానపఱచుటకు ముందు – ప్రతి శ్వాసతో మిళిత మగు నామము – తిన్నగా భౌతిక శరీరమున కేగి, దానిపై తన శక్తిని ప్రకటించు విధానమును విశదము చేయు టావశ్యకము.

శ్వాసనాళములలోనికి పీల్చబడిన మందు – భౌతిక శరీరముపై తన శక్తిని ప్రసరించుట అనుభవసిద్ధమగు విషయమే గదా! అయినను – ఈ యంశమును మఱికొంత పరిశీలింతము.

ఊపిరితిత్తులద్వారా మన ముచ్ఛ్వసించు శ్వాసవాయువుతో సేవింపఁబడిన ఔషధము, ఆ శ్వాసలోఁగల ప్రాణవాయువుతో సమ్మిళిత మగును. ప్రాణవాయువు రక్తముతో

గలిసి, దానిని పరిశుద్ధము గావించు తరుణమున, ఊపిరితిత్తులలో ప్రవహించు రక్తముతో - ఔషధముతో మిళితమైన రక్తము సమ్మిళిత మగును. ఇది - మానవుని శారీరక నిర్మాణమునందు, సహజముగ స్వభావసిద్ధముగ జరుగుచుండు కార్యకలాపము.

అపరిశుద్ధ రక్తము హృదయమునందలి కుడిభాగమునకు సిరలద్వారా ప్రవహించి, అట నుండి ఊపిరితిత్తులలో ప్రవేశించి, అట గల ప్రాణవాయువుతో సమ్మిళితమై, మనము వెలుపలకు విడచు వాయువుతో బొగ్గుపులుసు వాయువును కలిపి, వెలుపలకు వెడలఁజేయును. మందు శక్తిగల దగుచో - అది ప్రాణవాయువుతో రక్తమున బ్రవేశించి, దానితో మిళితమై తన శక్తిని దానిపై ప్రసరింపజేయును. రక్తముతో ననుకూల సంబంధముగలిగి, ప్రాణవాయువు మిళితమగునట్లే - రక్తముతోఁ గలియు ఔషధము కూడ అనుకూల సంబంధమును గలిగియుండవలెను. బొగ్గుపులుసువాయువు రక్తమునకు ప్రతికూలము గనుక, అది వెలుపలకు వెడలగొట్టబడు చుండును. అట్లే - రక్తమునకు ప్రతికూలమగు ఔషధమును రక్తమునలో ప్రవేశింప నీయక, దానిని నిరోధించును. కాని, రక్తముకంటెను ఔషధమే మిక్కిలి శక్తిగలదగుచో - ఆ యౌషధము రక్తమును త్రోసి రాజని, బలవంతముగ రక్తనాళములందు ప్రవేశించును. విషప్రయోగ మిట్టిదియే. విషము రక్తమునకు

యున్నగ, ప్రబలమగు శక్తిని గలిగియున్నది. కనుక, అది రక్త నాళములలో బలవంతముగ ప్రవేశించి, మరణమును గల్గించును. ఏమాత్రము గాలి చొరరాని గదిలో బొగ్గుపులుసువాయువు వ్యాపించి, ఆ గదిలో నున్నవారి రక్తనాళములందు బలవంతముగ ప్రవేశించి, మరణమును జేకూర్చును. వాతావరణ మనుకూలముగ నున్న తరుణమున రక్తమే అట్టి విషములను తనలో లీన మొనర్చుకొనును. ప్రతికూల వాయువులను నిరాకరించుటకును, తన శక్తినంతయు నుపయోగించును. ప్రతికూల వాయువులు రక్తమునకంటెను అధిక శక్తిని గల్గియున్నపుడు- రక్తము వానికి లొంగిపోవును. అట్టి సమయములలో బాధ లేర్పడి, మరణము సంప్రాప్తించును. చతుర్విధ పురుసార్థ సాధనకు ఆరోగ్యమే మూలాధారము. ఆరోగ్య విహీనుడగు మానవుడు ఏ పురుషార్థమును సాధింపజాలడు. ఆరోగ్యము పరిశుద్ధ రక్తముపై నాధారపడి యుండును. ఆరోగ్యభాగ్యమందఱకును అత్యంత మభిలషణీయము. అది-పవిత్ర భావములను చేకూర్చి, పురుషార్థసాధనకు మిక్కిలిగ నుపకరించు వర ప్రసాదము.

నామి, నామము: ఇవి రెండును ఒకే వ్యక్తికి జెందినవి. ప్రాణవాయువు రక్తములో ప్రవేశించునట్లు - శ్వాసతో ఊపిరితిత్తు లందు ప్రవేశించు నామము రక్తముతో గలసి, దాని పరిశుద్ధ మొనరించును. కనుక, ప్రాణవాయువుకంటెను ప్రబలముగ నామము రక్తముతో ననుకూల సంబంధమును గలి

యుండి, అందు ప్రవేశించి, దానిని పవిత్రీకరించును. వాయువు కంటెను నామి ప్రబల మగు శక్తిగలిగియున్నట్లే - అధికశక్తిని నామము కలిగియుండును. ఇంజక్షనులద్వారా శ్వాసలోనికి ప్రవేశపెట్టఁబడిన ఔషధము - రక్తముతో ప్రత్యక్ష సంబంధ మును మాత్రమే కలిగియుండును. కాని, నామము తన శక్తిని ప్రత్యక్షముగను, పరోక్షముగను ప్రకటించు సామర్థ్యమును గలిగియుండి, తన ప్రభావమును ప్రస్ఫుట మొనర్చి, అమూల్య ఫలముల నొసంగును. నామము ప్రత్యక్షముగ నెట్లు తన ప్రభా వమును ప్రదర్శించునో - అను విశేషములు లోగడ పేర్కొ నఁ బడినవి. ఇఁక, ఆ నామము తన శక్తిని పరోక్షముగ నెట్లు ప్రదర్శింపఁగల్గునో ఆ యంశమును పరిశీలింతము.

హోమియోపతి వైద్యశాస్త్రము అమూల్యములైన అనేక ప్రయోగములను గావించుచు వాని ఫలితముల నెన్నిం టినో నిరూపించుచున్నది. మన దేశమున ఈ వైద్య చికిత్సా విధాన మీనాఁడు విశేషముగ వ్యాప్తికి వచ్చుచుండుట యెల్లరకును తెలిసిన విషయమే. ఈ చికిత్సా విధానమును వైద్యశాస్త్రవేత్త లనేకు లామోదించి, అభినందించుచునే యున్నారు. అల్లోపతివైద్యులు కొందఱు ఈ వైద్యచికిత్సా విధానము నామోదింప కున్నను, ఆంగ్లవైద్య చికిత్సావిధాన ముతో నివారణముగాని దారుణ దీర్ఘ వ్యాధు లనేకములు ఈ హోమియోపతి వైద్య చికిత్సా విధానముతో నివారింపఁబడు చుండుట లోకవిదితము. ఈ హోమియోపతి మందులు తమకు

వరప్రసాదములని కొందఱు రోగులు భావించుచునేయున్నారు. మందు ఎంత పలుచగా నున్న అది అంత యెక్కువగ శక్తిని గలిగి విశేష ఫలము నొసంగునని ఈ వైద్య శాస్త్రమునగల మూలసిద్ధాంతము. అట్టి పలుచని మందులు మిక్కిలి శక్తిమంత ములై, విశేష ఫలప్రదములై, విలసిల్లుచునే యున్నవి.

ఈ వైద్యశాస్త్రనిపుణులు పదిలక్షల రెట్లు పలుచదనము నకు తేఁబడిన మందును రోగి కుపయోగించి, దాని ఫలితము లకు సహనముతో కొంతకాలము వేచియుందురు. ఒక ప్రత్యే కౌషధమును తయారుగావించుటకై వినియోగింపఁబడు మాతృ ద్రావకము **(Mother Tincture)** ను రెండువందలరెట్లు పలుచదనము **(Dilute)**నకు దెచ్చినచో - ఆ మాతృద్రావకపు పూర్వస్వరూపము మాఱి, నిష్ప్రయోజనమగునని అల్లోపతి వైద్యులందురు. రసాయన శాస్త్రవేత్తలును ఇట్లే అను చున్నారు. ఇట్లు పలుచదనమునకు తేబడిన మందులు-దీర్ఘకాలిక వ్యాధులకు అద్భుతముగ పనిజేయునని హోమియోపతి వైద్య శాస్త్రము స్పష్ట మొనర్చుచున్నది. ఈ నిర్ణయమును హోమియోపతి వైద్యశాస్త్రవేత్తలు తమ యనుభవ మూల మున నిర్ధారణ మొనరించుకొని, అమూల్యములైన ఫలితము లను సాధించుచునే యున్నారు. ఇది ఇట్లుండ - మాతృద్రావక మును రోగులకు మందుగా నుపయోగించినచో - అది రోగ మును నివారింపఁగలదని పాశ్చాత్య వైద్య శాస్త్రజ్ఞులు **(Allopaths)** నిర్ణయించుచున్నారు.

దీనిని పలుచదనమునకు దేరాదని వీరి వాదము. ఈ నిర్ణయమును హోమియోపతి వైద్యశాస్త్ర వేత్తలు నిరాకరించి, పలుచని మందులే దీర్ఘకాలికములగు దారుణవ్యాధులను నివారింపగలవని ప్రత్యక్షముగ ఋజువుచేయుచునే యున్నారు. ఈ యంశమును మన మొకింత సూక్ష్మముగ పరిశీలింతము.

స్థూల శరీరమును వీడిన జీవుఁడు కారణ శరీరమున బ్రవేశించునని ముందు పేర్కొనఁ బడినదిగదా! ఈ సిద్ధాంతము కేవలము మానవులకేగాక, సర్వజీవులకును వర్తించును. అయినను- మానవులు క్రమపరిణామమున అన్ని రంగములలో ఉన్నతస్థితిని బడసినవా రగుటవలన పై యంశమును మానవులందు విశేషముగ గాంచగలము. ఇట్లే - స్థూల శరీరముపై కంటెను సూక్ష్మశరీరముపై విశేషముగ ఔషధము తన ప్రభావమును బాగుగ ప్రదర్శించి, వ్యాధులను నివారించు ననుట నిస్సంశయము.

ఒక ఔషధములోగల భౌతికసంబంధములైన మూల పదార్థములను మనము కనుగొనఁ జాలకున్నను, దాని ప్రభావమును మాత్రము కనుగొనవచ్చును. అది - సహజమగు తన యునికి కలిగియే యుండును. ఒక విషయమును ఇదమిత్థ మని నిర్వచించుటకు - కార్య కారణములు తద్విషయ సంబంధములై యుండవలయును. ఉదాహరణము చూడుఁడు :—

ఒకఁడు మఱియొకనిని చేతితో దెబ్బ కొట్టగలఁడుకాని, మాటతో దెబ్బ కొట్టలేఁడు గదా! ఉన్నతస్థాయిలో తన

శక్తిని ప్రకటింపఁజేయఁజాలునది-అవనతస్థితి యందును తన శక్తిని నిస్సంశయముగా ప్రకటింపఁగల్గును. అనఁగా-సూక్ష్మశరీరముపై పని జేయఁగలమందు-స్థూలశరీరము నందును తనశక్తి సామర్థ్యములను ప్రదర్శింపఁగలదు. కాని స్థూలశరీరమునందే తన శక్తిసామర్థ్యములను ప్రదర్శించు ఔషధము సూక్ష్మశరీరముపై తన శక్తిసామర్థ్యములను ప్రదర్శింపఁజాలకపోవచ్చును. ఈ యంశమును గుఱించి మఱికొంత నిశితముగా బరిశీలింతము.

ఒకనిని మఱియొకఁడు చేతితో కొట్టిన బాధకంటెను తిట్టుతో నధిక బాధను గల్గింపవచ్చును. దెబ్బ - భౌతికశరీరమునకు బాధగల్గింప, మాట - మనస్సునకును శరీరమునకునుగూడ బాధను గల్గించును. అగ్ని - పలుచన గావింపఁబడిన ఔషధము నందలి సూక్ష్మశక్తి, సూక్ష్మశరీరముపై పనిచేయుటయేగాక స్థూలశరీరముపైనను తనశక్తిని ప్రదర్శించును. ఇట్టి వివిధవైద్య విధానము లన్నింటికంటెను నామమునకుఁగల శక్తి సూక్ష్మాతి సూక్ష్మము. అతి ప్రతిభావంతము. ఈ నామశక్తి, ఔషధముల శక్తికంటెను విశేషఫలప్రదమై యున్నది.

"ఆర్తా విషణ్ణా శ్శిథిలా శ్చ భీతాః
ఘోరేషు చ వ్యాధిషు వర్తమానాః
సంకీర్త్య నారాయణ శబ్దమాత్రం
విముక్తదుఃఖా స్సుఖినో భవన్తి."

'దారుణములైన శారీరక వ్యాధులచే బాధపడువారును, దుర్భరములైన మానసిక బాధలచే క్రుంగి కృశించువారును,

నారాయణ నామసంకీర్తన మాత్రమున సర్వవిధ బాధలనుండి విముక్తులై, సుఖశాంతులను బడయగల'రని విష్ణు సహస్రనామ స్తోత్రము విశదము చేయుచున్నది. కనుక, నామము తన శక్తిని మనస్సుపై ప్రత్యక్షముగ ప్రకటించునని తెలియవలెను. శరీరముకంటెను మనస్సు సూక్ష్మమైనదిగనుక, నామము తన శక్తిని విశేషముగ ప్రదర్శించి, మహాఫలముల నొసంగును. మఱియు నామము మనస్సులో గాఢముగ హత్తుకొని, మధుర ములును - దివ్యములు నగు అమృత ఫలముల నందించుటయే గాక, శరీరముపైనను, తన శక్తిసామర్థ్యములను ప్రదర్శింపఁ జేయుచు, దాని కొక నూతన తేజమును ప్రసాదించి, సర్వ మును భగవన్మయ మొనరించును. ఇదియే నామము గావించు పరోక్షమగు చర్య. ఇట్లు నామము తన ప్రత్యక్ష పరోక్ష చర్యలను సర్వవ్యాప్తము లొనర్చి, బ్రహ్మానందము నందించును.

మనస్సులో వ్యాధిజనింపనిచో-శరీరమున వ్యాధియేర్పడ దని ప్రకృతి వైద్యశాస్త్రవేత్తలు నిర్ణయించిరి. కనుక, ఏ వ్యాధి నైనను నిర్మూలించుటకు ముందు - మనస్సున గల వ్యాధిని నివారించుటకై తగిన యుపాయ మాలోచించుట యుక్తము. ఈ ప్రకృతి వైద్యశాస్త్రవేత్తల నిర్ణయమును అతి ప్రాచీన ాలముననే ఆయుర్వేద శాస్త్రము ఎలుగెత్తి చాటినది. ఒకే ్యాధివలన బాధల ననుభవించు భిన్న మానవులకు, వారి వారి మానసికపరిస్థితుల ననుసరించి, భిన్న భిన్న ఔషధముల నుపయో గించిననే ప్రయోజనకరములగు ఫలితములు కలుగగలవనియు ఆయుర్వేదశాస్త్రము నొక్కి వక్కాణించుచున్నది. ఈ వివరణము

వలన భగవన్నామ ప్రభావము బాగుగా విశద మగుచున్నది గదా! నామసంకీర్తనమే పరమార్థముగా భావించిన భాగవత మతము శాస్త్రసమ్మతమని ఇంతకంటెను విశేషముగా వివరింప నేల? యోగశాస్త్రమునఁగల విలక్షణ విధానము భరతఖండ మున విశేషముగ వ్యాపించి, తన ప్రతిభను సంపూర్ణముగ ప్రపంచమునకు వెల్లడించెను. ఇందువలన, మానవుఁడు తనశక్తి సామర్థ్యములవలనగాక, నామసంకీర్తనమువలన లభించు దివ్య శక్తులవలననే భగవంతుని అవ్యాజ కరుణా కటాక్షమునకు పాత్రుఁడు కాఁగలఁడని స్పష్ట మగుచున్నది.

నామము నాదోద్భూతము. నాదము శబ్దమయము. ఈ శబ్దమే సకలజగ ద్వ్యాపారమునకును మూలాధారము. సర్వాంతర్యామి యగు పరబ్రహ్మమే అట్టి శబ్దమునకు మూలా ధారము. సృష్టికర్త యగు పరబ్రహ్మ మెట్లు అనాదియో - అట్లే, సృష్టి వ్యాపారమునకు మూలాధారమైన శబ్దముకూ అనాదిసిద్ధమే. పరబ్రహ్మ మెట్లు సర్వపదార్థము లందు వ్యాపించియుండెనో-అట్లే శబ్దముకూడ సర్వపదార్థములందు అను స్యూతముగ వ్యాపించియున్నది. పరబ్రహ్మ మెట్లు స ప్రకాశకుఁడో-అట్లే, శబ్దముకూడ సర్వప్రకాశము. బ్రహ్మమ లేక సృష్టిలో నేదియు ప్రకాశింపనేరనట్లే శబ్దములేక సృష్టిలో నే వ్యవహారమును సిద్ధింపనేరదు. ఏ వ్యవహారములేక, సృష్టి వ్యాపారము కొనసాగనేరదు. ప్రపంచపు టునికికి అంతర్యా స్వరూపముగాఁ గల బ్రహ్మమే యెట్లు కారణమగుచున్నదో. అట్లే, శబ్దముకూడ ప్రపంచపుటునికికి ఆధారభూతమై యలరారు

చున్నది. ఇందొకటి పరబ్రహ్మము. మఱియొకటి శబ్దబ్రహ్మము. అవిభాజ్యములైన యీ రెంటికినిఁగల అవినాభావసంబంధము నిత్యమై, శాశ్వతమై యలరారుచున్నది. కనుక, శబ్దబ్రహ్మమగు భగవన్నామమును అనన్యమైన భక్తిభావముతో సంకీర్తించిన గాని పరబ్రహ్మాభిధేయుఁడగు భగవానుడైన నారాయణుని కృపాకటాక్షము భక్తులపై ప్రసరింపఁజాలదు. భౌతికశాస్త్రఫలములైన ఔషధములకంటెను యోగశాస్త్ర సముద్భూతములైన నామ జపాది దివ్యౌషధములు సత్ఫలదాయకములెట్లగుచున్నవో గ్రహించితిమి. మానసిక వ్యాధులనే నిర్మూలించి, శారీరక వ్యాధులు సముత్పన్నములు గాకుండునట్లు శాశ్వతానందము చేకూర్చునట్టి నామ జప మహౌషధమహిమ సశాస్త్రీయముగ సమర్థింపబడినది. అనంతశక్తిసంపన్నమైన ఆదిదేవుని అపార కరుణాకటాక్ష ఫలముల నందించు దివ్యసాధనమగు భగవన్నామ సంకీర్తనము యోగకల్పతరువున పండిన మధుర ఫలము. తద్రసాస్వాదనము శాశ్వతానందప్రదము.

కనుక, పరమానందదాయకమగు నిట్టి భగవన్నామమును ప్రజలందరును సర్వకాల సర్వావస్థలందును సంకీర్తనమొనరించి, సర్వాంతర్యామియు, ఆనందమయుఁడు నగు ఆభగవానుని యనుగ్రహమును సంపూర్ణముగ బడయుదురుగాక! ఆయన యనుభూని పొందుదురుగాక! ఆయన సన్నిధిని సదా సుఖింతురుగాక!

— ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః —



ఓమ్

“తేజోఽసి తేజో మయి ధేహి
వీర్యమసి వీర్యం మయి ధేహి
బలమసి బలం మయి ధేహి
ఓజోఽసి ఓజో మయి ధేహి
మన్యురసి మన్యుం మయి ధేహి
సహోఽసి సహో మయి ధేహి”

# ఉజ్జ్వలనదీ ముఖము

ప్రకృతిమాత ప్రముఖప్రయోజనముల నెన్నింటినో తన యనుంగుబిడ్డల కనురాగ పూర్ణహృదయమున ప్రసాదించుచునే యున్నది. ఆమె కారుణ్యరసధారల దేలియాడని ప్రాణియే యుండదు. సుముఖముగనున్న ప్రకృతి ప్రభావముననే మన మెల్లరము జీవిత విధులను సక్రమముగ నిర్వహింపగలుగు చున్నాము.

మానవుడు మనుగడను కొనసాగించుట కుపాధిగ - ప్రకృతివరముగ - సంలబ్ధమైన వానిలో మహానది యొకటి. ఇది సజీవము. నిత్యప్రవాహ శీలము. దీని జన్మమే మహైశ్వర్య దాయకము. భూగర్భమునుండి ఊటగ - బుగ్గగ - నుత్స్రోత్తుగ నుబికివచ్చి సెలయేరుగ మారవచ్చును. కఱగినమంచు మహోన్నత పర్వతశిఖరపంక్తులనుండి దొరలుచు జలరూపముదాల్చి, ప్రవహించుచువచ్చి జలాశయముగా నుండవచ్చును. జన్మస్థానము నందూటగ స్రవించుచు క్రమముగ సాగిసాగి బృహత్స్వరూపమును ధరించి జలప్రవాహమై వర్ధిల్లవచ్చును. కాని! ఆ క్రమ వికాసము నిదమిత్థమని యెవ్వరును నిర్ణయింపజాలరు. అనుశాసన మొనర్చెడి ప్రకృతికే ఆ పరమరహస్యములు తెలియును. నదుల పుట్టుకనుగురించి యెవ్వరెట్లభి వర్ణించినప్పటికిని విధానమిదియే. గంగానదికి గంగోత్రి-యమునకు యమునోత్రి- కావేరికి తలకావేరి జన్మస్థానములని స్పష్టీకరింపబడెను. నిజమారయుచో నాయానదుల జన్మస్థానము లందానదుల స్వరూపము స్వల్పప్రమాణమునందున్నను ప్రవహించు తఱి మధ్యే మార్గమున పెక్కువాగులను వంకలను కలుపుకొని, నదములతో ఉపనదులతో పొత్తుబెట్టుకొని మహోద్ధృతాకృతిని ధరించి మహానదులుగ - జీవనదులుగ విరాజిల్లుచున్నవి.

దీనిని సృష్టి విచిత్రమందురో! ప్రకృతిమాతయొక్క మహామహిమ యందురో! ఒక మహానది గమనమును సాగించి

నచో - తాను పయనించిన ప్రాంతము నంతటిని సారవంత మొనర్చును. పలుప్రాంతములకు మధురజలధారల నందించును. క్షేత్రములనెన్నింటినో సస్యశ్యామలములు గావించి పంటలతో కళకళలాడించి కన్నులకింపు గూర్చును. మానవులకు - పశు పక్ష్యాదులకు - వేయేల ? సకల జీవకోటికి జీవితనిర్వహణావసర మునందీ జీవనదులెన్నియో విధముల సదాసహాకరించుచున్నవి. వాని సహజలక్షణమది. అట్లు ప్రవహించుటయందుగాని-ప్రాణి కోటికుపకరించుటయందుగాని నదులకు తమ ప్రయోజనము కొఱకైన ప్రత్యేకాకాంక్ష లేదు. స్వార్థమంతకన్నను లేదు. పరార్థమునకు పాటుపడవలెననెడి తహతహాయే మనకానదుల ప్రవాహమున దర్శనమిచ్చును.

నదుల జీవితమునకు మాత్రమే పరిమితమైన లక్ష్యము గాదిది. మహాత్ముల జీవితలీలకు సైతము నదుల గమనవైఖరి ప్రతిబింబమగుట కతన, మహాత్ముల జీవితములకు సైత మీలక్ష ణములన్నియు వర్తించునని యెఱుగవలసియున్నది.

పవిత్ర వ్యక్తుల జన్మలను గురించి యెన్నియో మహా సయ గాథలు నిగూఢములై నిలిచియున్నవి. వానిని గుర్తించి నపుడు సజ్జనవరేణ్యుల చరిత్రలు నదీప్రవాహముల తీరుతెన్నుల వలె పరమపావనములని మన మెరుగ గలుగుదుము.

మహనీయులు జన్మించినదాది - కాలధర్మమును జెందు వరకు వారు వారి జీవిత విధానములలో మాహాత్మ్యమునే వెల్ల

డించుచుందురు. ఉత్కృష్టతనే ధ్యేయముగ నెంతురు. వారి చర్యలలో నిత్య నూతనాధ్యాత్మిక తేజమే వెలుగొందుచుండును. ఒక్క మాటలో చెప్పవలెననిన - వారి భౌతిక జీవిత నిర్వాహణ కృషియంతయు దివ్యముగనే దీపించుచుండును.

దుఃఖములతో క్రుంగి కృశించు సాటి మానవుల నెల్లరను తమ దివ్యసందేశ నినాదములతో పులకితులజేసి సుఖజీవనుల గావించుటే పుణ్యపురుషుల లక్ష్యము. వీరు నిజముగ అమర జీవులు. వాస్తవముగ చిరంజీవులు.

సకల ప్రజాక్షేమముల నాశించి, మనుగడలను సర్వాంకితము గావింప సంసిద్ధులయిన వీరిని మానవమాత్రులుగ భావింపగలమా? వీరిలో గుప్తముగనున్న దైవాంశను లోకము సన్నుతింపక మానునా?

కాలక్రమమున మహాత్ములు కీర్తిశేషులు గావచ్చును. యశఃకాయులయిన వారందరు సకల మానవ మనోమందిరముల యందు నిత్యచైతన్య మయ తేజోరూపమున నిల్చియేయుందురు. కవి గత జీవుడు కావచ్చును. కావ్యమున కట్టి స్థితి యెన్నడును లేదు. ఈ దివ్యస్థితియే కవిని అమరజీవుల సంఖ్యలో నిల్పును. హాత్ముల రీతియు నట్టిదే. వారు జీవించియున్న కాలమున వించిన మహత్తర మానవసేవాదీక్ష-చూపిన మహోదార దృష్టి - ప్రదర్శించిన బృహత్తర పరోపకార వైఖరి వారి నమర జీవుల శ్రేణిలో నిల్పును. మహాపురుషుల కీర్తిచంద్రికల వెలుగు

జిలుగులు ధరాతల మహోన్నతికి నిత్యాధార భూతములై కాంతులీనుచునే యుండును. వారి అనుభూతులు - సదాచారములు - సత్సందేశములు పతితులను పావనుల నొనర్చుటలో దక్షతగలవి.

ధర్మమునకు హాని-గాని యేర్పడిన తటి తదుద్ధరణార్థమై-తత్సంరక్షణార్థమై మహాత్ములు వసుంధర యందవతరింతురని భారతీయుల ప్రగాఢ విశ్వాసము. ప్రపంచ ప్రముఖులు సమాదరించిన సత్యముగూడ నియ్యదియే.

దీనిని దృష్టియందుంచుకొని పరిశీలింప బూనుకొనిన తటి యెచటనో గిరిగర్భముల శిలాంతరాళముల సూక్ష్మరూపమున నుదయించి, దుర్గమారణ్యములను - నిమ్నోన్నత ప్రదేశములను, పుట్టలను - గుట్టలను దుర్వారశక్తితో నధిగమించి, తనతో ననుగమింప నర్హతగల సకల శక్తులతో చెలిమి గలిపి ఉరవడిని బెంచి - మహోజ్జ్వలరూపమును ధరించి - మహీతలమున గల యనంత పరిధి నాక్రమించి-సారవంతము గావించి-స్వర్ణమును బండించి - సఫలతను గడించి - సార్థకత నార్జించి-శాశ్వతత్వమును గడించిన నదీజీవితము మహాత్ముల జీవితము పగిది మనకు గోచరించును. నదీజీవితమువలె మహాత్ముని జీవితమును 'మాన్యము-ధన్యము'నని మన మెంచగలుగుదుము. మన మాతృభూమి చరిత్రకందని అతిప్రాచీనకాలము నుండియు నిట్టి మహాత్ములను - మహర్షులను - మహాత్యాగులను - మహా

యోగులను లోకకళ్యాణార్థము ప్రసాదించుచునే యున్నది. పరమహంసలకు పుట్టినిల్లుగ - ప్రచండ తపోయోగబల పరిపూర్ణులకు నిలయముగ - ప్రసన్నకారుణ్య భావనులకు నివాసభూమిగ - పావన మహాధ్యాత్మిక శక్తిసంపన్నులకు కేంద్రముగ భారతభూమి జగద్విదితమైన కీర్తి నెన్నడో సమార్జించుకొన్నది. నేటికిని అట్టి యుత్తమసంతతిని కడుపుపంటగ కని భారతమాత విశ్వవిఖ్యాతి నార్జించుచునే యున్నది.

ఈ మహత్త్వము మరియొక భూభాగమునకు లేదు. ప్రాచీన మహేతిహాసములందిట్టి మహోజ్జ్వల మనోబలసంపన్నులయిన పుణ్యమూర్తు లింకొక దేశమున గనిపింపరు. సత్యశివసుందర సందేశమందమలయానిలయములతో సకల సాధకబృందమున కానందమునే విందుగ నందింపజాలిన గురుదేవు లింకొక యెడ మనకు దర్శన మీయరు.

ఇది యీ దేశముయొక్క పవిత్రతకు చిహ్నము. ఇది యీ గడ్డకుమాత్రమే లభ్యపడిన మహాభాగ్యము. శ్రీ రామకృష్ణపరమహంస - వివేకానందస్వామి - రామతీర్థస్వామి - అరవిందయోగి - దయానందమహర్షి - గాంధీమహాత్ముడు మొదలయినవారీకోవకు జెందిన గణనీయులు.

వీరి మహోదయబలమున ప్రతితరములో భారతమాత జీవితమున నవోదయమగుచున్నది. ఉజ్జ్వలదీప్తులతో నాతల్లి నిలు

వెల్ల కళకళలాడుటకే మహనీయుల మనికియునుకులే మూల కారణములు.

వారి పలుకులు సుధల జిలికినవి. వారి కృత్యములు నిత్య సత్యములకు వ్యాఖ్యానములైనవి. వారు నడచిన బాటలు నిజముగ నమృతంపుటూటల నూరించినవి. వారి యడుగులు ప్రవిమలాధ్యాత్మిక భావామృతపు మడుగులయినవి. దివ్య తేజోవిలసితములైన వారి వదనములు భవ్య రుచిరకాంతిసదనము లయినవి. నిశితములైన వారి సమీక్షలు జాతీయుల మహోదర్శ జీవిత పాఠ్యమునకు పరీక్షలయినవి. వారి యాదేశములు భారతీయుల మహోదాత్తతను విశ్వవిశ్వాంతరాళములకే విశదీకరించెడి సందేశములయినవి. వారు జగతికి గురువులు - మానవతను పండించిన మహత్తర కల్పతరువులు.

వీరిలో శ్రీ రామకృష్ణపరమహంస అఖండజ్యోతిస్సదృశుడైన ఆత్మజ్ఞాన సంపన్నుడు. శ్రీ రామకృష్ణ మహావటవృక్షచ్ఛాయ నావిర్భవించిన మహనీయ మధురకల్పవృక్షమే వివేకానందస్వామి.

బాల్యమున నరేంద్రుడుగా వ్యవహరింపబడిన యొకానొక బాలకుడు కాలక్రమమునం దాత్మానుభూతి సంపన్నుడై - దివ్యతేజోమయుడై - జిజ్ఞాసువై - లౌకిక వేదనలతో పరితపించిపోయి శ్రీ రామకృష్ణ మహావటవృక్షపు నీడను సేదదేరి- జ్ఞానియై - మహాయోగియై - వివేకానంద నామమున యతిలో

కమునకే శాశ్వతాదర్శప్రాయుడై వెలుగొందినాడు. తాదృశ శిష్యరత్నమును విశ్వమునకు ప్రసాదించిన సంయమిచంద్రుడు శ్రీ రామకృష్ణపరమహంస.

వివేకానందుని విజ్ఞాన జలధారలతో నీసంత ప్రజగతి చల్లదనమును కొల్లగొన గల్గినది. ప్రత్యేక ప్రసంగ ప్రతిభతో - పరమ పూజ్యభావ సంతతితో విశ్వమునే విస్మయమున దేల్చి భారతమాతృ దివ్యసందేశమును వినిపించిన వివేకచూడామణియే వివేకానంద మహర్షి.

ఆయన జీవితకాలము పరిమితమైనట్టిదే యగుగాక! ఆయన యాధ్యాత్మిక రంగమునకు గావించిన సేవ అపరిమితమైనట్టిది. పిన్నవయస్సుననే భౌతికదేహము నీ మహాత్ముడు త్యజించినాడు. కాని యీ తపస్వికుల తిలకుని కీర్తికాయము శాశ్వతత్వమునంది సర్వదా ప్రతిభాసించుచుండును. నేటికిని వివేకానందుని సూక్తిసుధలు విశ్వమానవాళికి చైతన్యమును గూర్చుచునేయున్నవి. వివేకానంద సందేశ మొక మధురఫల సదృశము. తన్మధురఫల రుచు లీ నాటికిని - రేపటికిని జ్ఞాన పిపాసువుల దనుపుచునే యుండును.

"స్వామిజీ వాక్కులు ఆయన నోట వెలువడి ముప్పదేండ్లు వి. అవి తద్గ్రంథావళిలో వికీర్ణములై యున్నవి. కాని, నస్సైతము వానినంటినప్పుడు విద్యుచ్ఛక్తి చేతంబోలె నా దేహము జలదరించుచున్నది. ప్రత్యక్షముగ స్వామిజీ నోటినుండి

కణకణలాడు ఆ మాటలు విన్న శ్రోతలు ఎంత పరవశత నొందెడివారో, ఎంత ఉత్తేజిత లగుచుండెడివారో!" అనిన రోమైరోలా మహనీయుని వాక్కు నందతిశయోక్తి లేదు. ఇది సత్యసూక్తి.

మరణము లేని మానవోత్తము డా మహాయోగి. మహాత్ముల జీవితములు నిక్కముగ సూర్యోదయ సూర్యాస్తమయ సదృశములు. అవి నిరంతరనిస్తుల శోభాసంకలితములు – సర్వాఘనిర్మూలనైక దక్షములు – సకలసుఖప్రదములు – సంతతానందదాయకములు.

జీవితమును చాలించునాటికి నిండుగ నలుబదేండ్లేనియు లేని యీ పావనమూర్తి వేలకొలది సంవత్సరములవరకు సరిపడెడి దివ్యసందేశమును జాతి కందీయ గలిగినాడనినచో నయ్యది అప్రాకృత దివ్యమహిమ గాక యేమగును ?

ఆయన యంతరంగము భౌతికావరణముల కతీతమైనట్టిది. దివ్యత్వ సముద్భాసితమైనట్టిది. సర్వవిశ్వమును ప్రశాంతతలో నిమగ్న మొనర్పజాలినట్టిది. సజీవకృషి బలమున చైతన్యశక్తిని ప్రపంచమునందుద్దీప్త మొనర్పగల్గినట్టిది.

ఆయన యడుగుజాడలలో నడయాడ నేర్చిన ప్రియ శిష్యులెందరో యున్నారు. వారి యనుభూతులన్నియు మహత్తర మహిమోపేతములయిన మధురగాథలు. వివేకానంద గురుదేవుని మధురవాణికి వశులై ప్రియాతిప్రియ శిష్యులైన వారిలో ప్రముఖపాత్ర వహించిన అమెరికా మహిళ – సోదరి

క్రిష్టైన్ కన్య పలుకులలో వివేకానందుని మహోన్నతి యిట్లు విశదీకరింపబడినది.

"అపుడపుడు లోకములో దీర్ఘకాలాంతరమున - పరలోక సంచారిగనున్న యొకానొక మహావ్యక్తి యీ భూమిపై జన్మించును. తానే తెంచిన సుదూరదేశమునుండి ప్రతిష్ఠను - మహాశక్తిని - దివ్యకాంతిని ఈ దుఃఖమయలోకమునకు దనతో పాటుగా గొనితెచ్చును. ప్రజలతో నిట గలసిమెలసి తిరుగుచున్నప్పటికిని ఆమహావ్యక్తి శాశ్వతముగ-ప్రశాంతముగ నిట నుండుననుట కల్ల. ఆయన యొక పవిత్ర యాత్రికుడు. మీదు మిక్కిలి లోకమున కపరిచితుడు. ఇట నొక రాత్రికాలము మాత్రమే (స్వల్పకాలమే) యుండును. ప్రజల సుఖదుఃఖములలో భాగస్వామి యగును. సర్వదా తానెవరైనదియు నెట నుండి వచ్చినదియు విస్మరింపడు. తన దివ్యత్వమును సైతము మరువడు. తన యాత్రకుగల పరమలక్ష్యమును సదా స్మరించుచుండును. అటువంటి వ్యక్తిని నేను కన్నులార గాంచితిని. ఆ మహనీయుని వాణిని చెవులార వింటిని. ఆయన చరణముల హృదయపూర్వకముగ నర్చించితిని. నిండుభక్తితో నన్ను నేను ఆ మహనీయుని సేవల కంకితము గావించుకొంటిని. ఆయనన్యులతో పోల్చదగడు. సర్వసామాన్య సాంసారిక నియమముల కాయన యతీతుడు. ఆ మహనీయుడే వివేకానందస్వామి. ఈయన తనకు తానే యొక ప్రత్యేక సంస్థ. పరాశ్రయములో

పనిలేని దివ్యజ్యోతి. ఈయన యీ విశ్వమునకు జెందిన వ్యక్తి యేకాడు. తన విశిష్ట ప్రత్యేక సందేశము నీ లోకమున కందించు నిమిత్తము – ప్రత్యేకముగ నుత్తమలోకము నుండి యీ నేల కవతరించిన పుణ్యమూర్తి. ఈయన జన్మించిన దేశము ధన్యము. ఈ మహనీయుని కాలమున విశ్వమున జీవించియున్న ప్రజలందఱు ధన్యులు. ఈ మహితాత్ముని పాదపద్మములకు సేవలొనర్పగల్గిన యదృష్టవంతులే కొలదిమందియో ధన్యులు; ముమ్మాటికిని వారు ధన్యతములు" – వివేకానందుని గుఱించి యిట్టి యద్భుతభావము లొక అమెరికా ఖండపు వనితామణిలో నుత్పన్నము లైనవనినచో నామహనీయుని లోకోత్తర దివ్య శక్తి యెట్టిదో మన మూహింపవచ్చును.

ఈ మహనీయునిగూర్చి మఱికొందఱు విదేశ ప్రముఖు లెట్లు భావించిరో యిచట నుల్లేఖించుట సముచిత మను కొందును.

అమెరికాదేశ ప్రఖ్యాతక వయిత్రి శ్రీమతి ఎల్లాహీల్లర్ విల్కాక్స్ సతి వివేకానందస్వామి యుపన్యాసములను తాను ఆస్థతో వినుటకేగు చుండుటయే గాక తన భర్తను గూడ వెంట నిడుకొని పోవుచుండెడిదట. ఈ దంపతుల యనుభవములను గూర్చి ఆమె చిత్రించిన యద్భుత మహిమాన్విత వర్ణనము నాలింపుడు :– "వివేకానందస్వామి యుపన్యాసము ముగిసిన వెంటనే జీవిత జలధియందలి కల్లోలముల నెదుర్కొనబోవు

మాలో నొక క్రొత్తనమ్మకము - క్రొత్తబలము - క్రొత్త ధైర్యము - క్రొత్త శ్రద్ధ కలిగెడివి. ఒక్కొక్కప్పుడు వెతలచే ఆందోళనముచే నా భర్తకు రాత్రులందు నిద్రరాకుండెడిది. అంతట ఆయన నన్ను వెంటనిడుకొని స్వామిజీ యుపన్యాసము వినుటకు వెళ్లుచుండెడివాడు. అటనుండి మరలి శిశిరకాలాంధకారమున వీథిలో నడచివచ్చుచు నాతో 'సమాధానము కలిగినది. సర్వము సరియే. దేనిని గూర్చియు వెతజెంద నవసరము లేదు' అనెడివాడు. నేనును వికసించిన దృష్టితో - ఉన్నతి నందిన డెందముతో నా విధులను - వినోదములను నిర్వర్తించుకొనెడి దానను. అట్టిది వివేకానందస్వామి యందలి గురుశక్తి మహిమ. అట్టిది ఉద్దీప్త భావములను శ్రోతలలో ప్రసరింప జేయు వివేకానందుని ప్రతిభామయ దివ్యశక్తి మహిమ".

ఇట్లే మరియొక అమెరికా వాసిని జోసెఫైన్ మ్యాక్ లౌడ్ కన్య (Miss Josephine Mac Leod) పొందిన తన్మయతా వాక్కులను వినుడు:-"దాదాపుఇరువది మంది స్త్రీలును ఇరువురు ముగ్వురు పురుషులును సమావేశమైయున్న తనగదిలో తాను గూర్చుండి వారికి ప్రబోధ మొనర్చుచున్న వివేకానంద స్వామివారి సన్నిధికి నా సోదరితోగూడి 29-1-1895 న నే నేగి '. ఆగది శ్రోతలతోనిండి, క్రిక్కిరిసి యుండినది. కుర్చీలు తీసి కుబడినవి. నే నేగి మొదటి వరుసలో క్రింద కూర్చుంటిని. ఆయన ఒక మూల నిలువబడి యుండెను. అప్పుడేదో యొక

విషయమును గూర్చి ఆయన యుపన్యసించుచుండెను. ఆ విష యము నాకిపుడు బాగుగ జ్ఞప్తికి వచ్చుటలేదు. కాని నా కది సత్యముగనే తోచెను. ఆయన పలికిన ద్వితీయ వాక్యము కూడ సత్యమే. తృతీయ వాక్యమును సత్యమే. తదాది ఆయన యుప న్యాసములను ఏడు సంవత్సరములు శ్రద్ధగవింటిని. ఆయన పలుకులన్నియును నాకు సత్యములుగనే తోచినవి. ఆ క్షణము నుండి నా జీవిత మొక విభిన్నమైన – సూక్ష్మమైన అంతఃపరి వర్తనము బడసెను. అది నీవు అనంతములో నున్నట్లు అను భూతిని పొందజేయును. అది యెప్పటికిని మార్పును జెందలేదు, వర్ధిల్లనులేదు. నీవొకపరి గాంచిన మఱి మరపునకురాని సూర్య భగవానుని దర్శనమువంటి దది. ఆయన తన ప్రసంగములలో భౌతికములేదను దివ్యానుభూతిని మాకందించు చుండువాడు. అది యంతయు పవిత్రమే. దివ్యమే. తీక్ష్ణమైన – దేదీప్యమాన మైన కాంతి పుంజము వంటివాడు స్వామి. ఆ కాంతి క్షణికము కాదు. క్షీణించునది కాదు. సదా నిత్య శోభతో నుద్దీపించు చునే యుండును. శోభిల్లుచునే యుండును.”

ఆధ్యాత్మిక గురువుగ ఆంగ్లేయుల చిత్తమున స్వామిజీ ముద్రితుడైన రీతిని ఆయన ప్రియ శిష్యురాలు మార్గరెట్ నోబుల్ కన్య (సోదరి నివేదిత) యిట్లు వర్ణించెను :- “మాలో ననేకులకు స్వామిజీ సందేశము మిక్కుటముగ దప్పిగొన్నవానికి చల్లని నీరువలె పరమ నిర్వృతి దాయకముగ నుండెను. యూ

పులో గడచిన యర్ధ శతాబ్దకాలము మత విషయికమైన నిర్వే దముతో - సందేహముతో తలపోటెక్కి యుండెడిది. క్రైస్తవ సిద్ధాంతములలో విశ్వాసము మాకు సాధ్యము కాలేదు. మా మతములో నిజమనెడి బీజమును కప్పియుండిన సిద్ధాంతములనెడి పొట్టు నూడదీయుటకు నేడు మా చేతనున్న పరికరము వంటిది నాడు మాకు లేదాయెను. ఇట్టి మా తలంపులకు వేదాంతము నిరూపకముగ లభించినది. 'సోఽహమ్' దేవుడు నేనే! అని స్వామిజీ చెప్పినప్పుడు అది యింతకుమును పెన్నడును చెప్పబడ నిదైనను సదా తెలిసిన విషయమే యనిపించెను. ఐనను మును పటి యనుభూతులకెల్ల యుక్తిసహతను సమకూర్చుటకును - సేవాతృష్ణ కొక సమర్థనము నందించుటకును-విశ్వమాన వైక్య మును గూర్చి జ్ఞాపకము చేయుటకును నాడా వాక్యమావశ్యక మాయెను. పూర్వులనుండి మనకు సంక్రమించిన ఒక్క మహా ధనాగారమునకే - ఒక రొకమార్గమునను మఱొకరు మఱొక మార్గమునను - అందఱమును ప్రవేశించితిమి. ఈ విషయము మాకు తెలిసివచ్చినది."

అమెరికా వాసియైన హెచ్. జె. వ్యాన్ హ్యాగన్ (**H. J. Vann Hagon**) మహాశయుని నుడువుల నాలింపుడు: "అఖండ విజ్ఞాన ప్రేరితములగు వివేకానందుని యుపదేశములను వినిన కొలది వారిలోనుండి బయలు వెడలు దివ్యశక్తి తరంగ ములు ప్రసారమగుకొలది నాయందలి సంకుచిత భావములు

పటాపంచలై - ఆయన యుపదేశములు విందు భోజనములవలె నన్నానందింప జేయసాగినవి. ఆరోగ్యకరమగు నాహారము ఆకలిని - నిర్మలోదకము దప్పికను నివారించునట్లు వారి యుపదేశములు నన్ను సంతోషపెట్టుచుండెను. మానవహృదయమందు జనించు సందేశములను సంపూర్ణముగ నివారింపగలది - నిరంతరానందమున నుయ్యాలలూగించునది - ప్రపంచమున వేదాంతమత మొక్కటియే యని విశ్వాసము జనించినది. అట్టి వేదాంతమును సువిదితము చేయుటలో శ్రీ స్వామివారు సిద్ధసంకల్పులను విషయమును గ్రహించి, శ్రీవారి యుపదేశములే నాజీవితతరణోపాయము లని విశ్వసించితిని."

ఇక లాహోరుపట్టణమునందు వివేకానందస్వామి యుపన్యాసమును విన్న విశ్వవిఖ్యాత భారతదేశ సన్యాసి రామతీర్థస్వామి (అప్పటి కాయన సన్యాసాశ్రమమును స్వీకరింపలేదు) పలికిన పలుకులివి :- "శ్రోతలకు గాఢ తన్మయత కలిగెను. అట్టి వాతావరణమున శ్రోతలకు దేశకాలముల స్మృతియంతరించెను. ఒక్కొక్కప్పుడు విశ్వాత్మతోడి తమ ఐక్యము వారికి అనుభూతికి వచ్చెడిది."

నాటకమునగల పాత్రలన్నియు నెట్లు తమ ప్రత్యేకతను - సౌందర్యమును వ్యక్తీకరించుచుండునో! అట్లే వివేకానందుని నరజన్మ లీలాప్రదర్శనమునందును ప్రత్యేకత - విశిష్టత మనకు సుస్పష్టముగనే వ్యక్తమగును. గురుదేవుడగు శ్రీ రామకృష్ణ

పరమహంస తన ప్రియ శిష్యుడగు వివేకానందునిగూర్చి వ్యక్త పఱచిన భావములను గాంచుడు :— "నేనెన్నియో అద్భుత దృశ్యములను గాంచుచుండెడివాడను. ఒకపరి అఖండ సచ్చిదానంద దృశ్యము నొకదానిని గాంచితిని. అందు ఒక తెర యడ్డముగా గల యిరుతెగలవారిని గాంచితిని. ఒకప్రక్క కేదారు, ఛుని మొదలగు సాకారభగవంతుని విశ్వసించు భక్తులను గాంచితిని. రెండవప్రక్క ఎఱ్ఱని యిటుకరాతి కణమయముగా ప్రదీపించుచున్న యొక గుట్టను గాంచితిని. నరేంద్రుడు దాని మధ్య సమాధిగ్రస్తుడై యుండెను. అట్టి సమాధిస్థితిలో నున్న వానిని నేను 'నరేంద్రా' యని పిలిచితిని. వెంటనే యాయన తన నయనములను కొంచెముగ తెఱచెను. అప్పు డాయన యింకొకరూపమున సిమ్లా పట్టణమున గల యొక కాయస్థ కుటుంబమున జన్మించినట్లు నేను అనుభూతిని పొందితిని. తత్ క్షణమే నేను దివ్యమాతతో (కాళికాదేవితో) అమ్మా! ఆయనను మాయతో గప్పుము. లేనిచో ఆయన తన భౌతిక దేహమును సమాధిలోనే చాలించును."

వివేకానందుని జననమున కర్థమేమి? అది యెట్లు తటస్థించినది? ఏల? అనెడి యంశములను సర్వజ్ఞుడగు శ్రీ రామకృష్ణపరమహంస మనకు విస్పష్టముగనే వివరించినాడు :- "ఒక స్వబాలుని ప్రార్థనానుసారముగ తపస్సునందున్న యొకమహర్షి భూలోకము నందవతరించెను." ఇవి శ్రీ రామకృష్ణపరమహంస

వాక్యములు. ఆ దివ్యబాలుడే శ్రీ రామకృష్ణపరమహంస. ఆ మహర్షియే వివేకానందస్వామి. పరమహంస వివరణ సారమిది. ఎట్టి యద్భుతము ? ఎంతటి యదృష్టము ?

వేయేల ? అజ్ఞానాంధకారమును పారద్రోలి దివ్య జ్ఞానము దీపింపజేయు మహత్తర శక్తిసామర్థ్యములుగల ఆ మహాతపస్వి - ఆ పరమయోగి - ఆ వివేకానందస్వామి ముఖకమలమునుండి వెలువడిన పరమ పావనములగు పలుకులనే శ్రద్ధాభక్తులతో వినుడు :- "నేను ఉపన్యాసవేదికపై నెక్కినంతనే ఒక శక్తి నాలో నావహించెడిది. దాని ప్రభావమున వేలకొలది శ్రోతలచే అహంకార మమకారములనెడి కారాగార కుడ్యములను పడగొట్టించుటకును - మాయను తరలింపజేయగలందులకును నేను పల్కు ఒక్కమాట చాలుననిపించెడిది."

ఇట్టి మహనీయుని మహామహిమలను గుఱించి యెంతగ వివరించినను తృప్తికలుగదు. ఒక్కమాటలో - సర్వమానవులకు పవిత్రప్రబోధములను గావించి, వారి నుద్ధరింప దివినుండి భువికి దిగివచ్చిన సిద్ధపురుషుడు వివేకానందస్వామి. ఈ యోగి పుంగవుని బోధనలనుండి వెలువడు వెలుగు సంశయాంధకారములను పటాపంచలు గావించుచుండెడిది. అది శ్రోతలకు పరిపూర్ణ విశ్వాసమును గలిగించి, ఉత్తమ పరివర్తనము నుద్దీపింపజేసెడిది. మానవుల చిత్తవృత్తులను విస్పష్టముగ గాంచి గ్రాహ్యపఱచుకొని వారి జీవితములను కలవరపఱచు సమస్యలకు నిర్దుష్ట

పరిష్కారములను విప్పిచెప్పెడి విమలాంతర్దృష్టిగల మహాయోగి యాయన. ఆయన పద్ధతులు సాదర ప్రేమానుభూతిమయములే కాని దోషోద్ఘాటన సమన్వితములు కావు. ఆయన భావములు వివేకవంతములు - సహనసఖ్యసంభరితములు - ప్రేమపూరితములు - విశాల విశ్వవ్యాప్తములు. ఆయన చేష్టలు నిర్మాణవంతములు - సేవాత్యాగమయములు - పరార్థ పరమార్థదాయకములు - మధురరస ఫలప్రసారితములు. అంతేకాని వినాశవంతములు కావు. విచ్ఛిన్నకరములు కావు. అహంకార మమకారావిర్భూతములు కావు. అనర్థదాయకములు కావు. సంకుచిత స్వార్థపూరితములు కావు. ఈర్ష్యాద్వేష విషయములు కావు.

సంతానప్రాప్తి కొఱకు భువనేశ్వరీదేవి ప్రార్థించి ప్రార్థించి చాలకాలమునకు నరేంద్రుని గనెను. బాల్యముననే దుడుకు చేష్టలను గావించుట - విడ్డూరముల బలుకుట తిలకించి బిడ్డను గుఱించి తల్లి విస్తుపోవుచుండెడిది. తన బిడ్డ మానవ మాత్రుడు కాడనియు - శివునికడ గల భూతగణములందొకడనియు భావించెడిదట.

బిడ్డ ఆటలాడుచు - పాటలు పాడుచు-అల్లరిచేయుచు స్వేచ్ఛగ దిరుగుచున్నను విద్యార్జనమున జూపెడి శ్రద్ధను గని విస్తుపోవు చుండెడిదట. జ్ఞానాభివృద్ధి యగుట గాంచి సంతసించుచుండెడిదట.

నియమ నిగ్రహములతో - ధ్యాననిష్ఠలతో - ధారణా శక్తి సంపదలతో నరేంద్రుడు జీవితము నందెదురైన క్లిష్టసమస్యల నన్నింటిని పరిష్కరించుకొని యోగజీవితము నలవఱచుకొనినాడు. వయస్సు వచ్చిన కొలది నరేంద్రునిలో తీవ్రాలోచన లుదయించినవి. వాదోపవాదములతో కాలమును గడపుటాయన కెంతో యిష్టము. భగవంతుడు లేడనెడి విపరీతనాస్తిక వాదము వంకకుసైత మాయన మనస్సు కొంతకాలము మొగ్గకపోలేదు. భిన్న విభిన్న సంఘర్షణల తాకిడికి దట్టుకొనుచు - తీవ్రాందోళనలకు గుఱియగుచు-మానసిక వ్యధలతో గ్రుమ్గుచు- కర్తవ్యమును గుర్తింపనేరక తహతహ జెందిన సమయము గూడ నరేంద్రుని జీవితమున లేకపోలేదు.

అట్టి తరి నరేంద్రునిపై ననుకొనకయే యొక దివ్యామృత వర్షము కురిసినది. అది మహాదృష్టము. దివ్యశక్తి ప్రేరణగల నరేంద్రుని యాకాంక్ష లాయనను శ్రీరామకృష్ణ పరమహంస సన్నిధికి జేర్చినవి. అది నిక్కముగ భారతజాతి జీవితముననే యొక యెన్నికగన్న సుముహూర్తము.

శ్రీరామకృష్ణ పరమహంస మూర్తీభవించిన దివ్యత్వముగ నరేంద్రునకు దోచెను. శాంతి స్వరూపుడుగ-పూర్ణపురుషుడుగ మనుగడను సాగించి కాళీమాతను ప్రత్యక్షము గావించుకొన గల్గిన పవిత్ర సాధక శేఖరు డా మహనీయుడు. దివ్యానుభూతి సంపద విశేషముగా గల తపస్వి. ఇక వివేకానందుడో!

తుపానువలె చెలరేగుచున్న భావసంఘర్షణల మధ్య నిలిచి - తర్జన భర్జనలలో తగ్గిస మ్రుగ్గిస లగుచున్న శిష్యవతంసుండు.

వీరిరువురి సన్నివేశము భగవన్నియమమే యనక తప్పదు. ఒకరిపై మరియొకరి శక్తి ప్రసరింపబడుటచే ఒకరిని మరొక రాకర్షించుకొనగలిగిరి. ఇదియును దైవసంకల్పమనియే యను కొనవలయును. దివ్యశక్తి ప్రభావముల ప్రసారమున లభ్యపడిన మహత్తర ఫలమిది.

శ్రీరామకృష్ణ పరమహంస శిష్యత్వ మబ్బుటతో నరేంద్రుడు వివేకానంద నామాంకితు డైనాడు. ఆశయములు సిద్ధించిన తటి అంతరంగము గంగవలె పొంగును. మనస్సు మయూరమై నృత్యమొనర్చును. ఊహాలు విహాయస వీధుల విహరించును. గురుదేవుని నియమబద్ధ శిక్షణలో వివేకానందుడు మనస్వి, తేజస్వియైనాడు. పరమహంస నోట వెలువడిన ప్రతి పలుకు వివేకానందుని హృదయక్షేత్రమునబడి - ముత్తెపు చిప్పలో బడిన స్వాతివాన చినుకువలె విలువగల ముత్యమై వెలుగు లీనసాగినది.

ఆధ్యాత్మిక రంగమున దనయంతస్తు నాయన బాగుగ పెంపొందించుకొన్నాడు. తీరని సందియము లెన్నియో గురుదేవుని సన్నిధిలో శిష్యుడు నివృత్తి గావించుకొనగలిగినాడు. భావసంపదకు పుష్టి యేర్పడినది. నిర్ణయములకు స్థిరత కుదిరినది.

వాక్కునకు పదను సిద్ధించినది. వివేకానందుడు ప్రవిమలాధ్యాత్మిక భావప్రబోధకుడై భాసిల్లినాడు.

ఈ శక్తులన్నియు వివేకానందుడు భారతదేశమందున్న రోజులలో విశ్వరూపమును దాల్చలేదు. కావలసిన కలిమిని బలిమిని పెంపొందించుకొనినవి. 1893 వ సంవత్సరమున షికాగో విశ్వమత పరిషన్మహాసభకు బయలుదేరుటతోడ వివేకానందుని యందణగియున్న మహత్తర శక్తులన్నియు నొక్క మారుగ రెక్కలు విప్పుకొని విశృంఖలములై విహరింప సాగినవి. అది దివ్యశక్తుల వికాస విలాసము. అమెరికా యందడుగిడిన మరుక్షణము నుండియు – తాను మహోజ్జ్వల భారత సంస్కృతికి ప్రతినిధిననియు – తన్మహిమలను ఖండాంతరముల వెదజల్లుటకై వచ్చిన ఆర్ష సిద్ధాంత ప్రవక్త ననియు సంభావింప సాగినాడు. ఆ సంభావన కనుగుణముగ వ్యవహరింప వలయుననెడి దీక్షయు ఘనీభవించినది. తదనుగుణమైన యాత్మశక్తియు వెల్లివిరిసినది ఇది యంతయు వివేకానందుని తీర్చిదిద్దిన గురుదేవుని యనుగ్రహబలమే. ఆబలము వలననే వివేకానందుని కన్నియు ననుకులము లయినవి.

కుటుంబ సదాచార సంప్రదాయ శక్తి – తల్లి యిచ్చిన సముచిత శిక్షణ – సుకృతవశమున గడించిన విద్యాబలము నిశ్చలముగ సాగిన సాధనా విశేషము–ప్రకృతి సిద్ధముగ నబ్బిన తార్కిక వైదుష్యము – శ్రీరామకృష్ణ పరమహంస దివ్యా

ర్వాద మహిమ - వినిర్మల మనోద్రఢిమ - సహృదయులైన మిత్రుల శుభాకాంక్షల మహిమ సర్వము గలిసివచ్చినవి. వివేకానందస్వామి మత పరిషన్మహాసభలో విశ్వరూపము నావిష్కరించుటకు దోడ్పడినవి.

వేదికపై నిల్చియున్నపు డాయన చూపరులకు మానవ మాత్రుడుగఁ దోచియుండలేదేమో! మహర్షుల యాత్మబల ప్రతిబింబముగా - సర్వశాస్త్రముల సారమునకు ప్రతీకగా - భారతీయ తత్త్వ పాండిత్యమునకు సజీవచిహ్నముగా - అనర్గళ గంగా ప్రవాహవేగ సదృశ వాగ్ధారా పాతమునకు ప్రత్యక్ష స్వరూపముగా - సునిశిత విపుల హైందవ విజ్ఞానదీపికగా వివేకానందుడు సభాసదుల కందరికి సాక్షాత్కరించి యుండవచ్చును. ప్రశాంత ప్రసన్న గంభీర గళమున నిబ్బరముగ నిగమార్థముల నెల్ల నిరుపమాన వచోధోరణితో వివరించెడు వివేకానందుని గని చికాగో సభ విస్మయమున మునిగిపోయెను. సమున్నత కాషాయాంబరధారియై - విస్తృత ఫాలఫలకమున కుంకుమ తిలకము దివ్యదీధితుల నొలుకపోయుచుండ - తీక్ష్ణరోచుల వెలిగ్రక్కు నయనద్వంద్వమున భారతీయ పవిత్రసంస్కృతి ప్రజ్వలించుచుండ - రసవన్మనోహరగళ గంభీరధ్వానులతో స్వామి న సిద్ధాంత విజయదుందుభి నాసభలో ప్రతిధ్వనింపజేసినాడు.

ఇంద్రియలోలతకు లొంగి - స్వైరవిహారముల సాగించుచు సగర్వముగ సంచరించుచున్న పాశ్చాత్య దేశములకు

కనువిప్పు గలుగు పగిది ధీరునివలె దివ్యభారత సనాతన సందేశ మహిమల నేకరువుపెట్టుచున్న వివేకానందుని మూర్తినిగని - వాణినివిని - కాదనుటకు - వాదనసేయుటకు శక్తి చాలక శిర ములు వంచి సభాసదులెల్లరు వినమ్రులయిరి.

"జీవితమునకు మూలము దివ్యత్వము. బ్రహ్మానుభూతి. ఇవి విశ్వశాంతిని జగత్ కళ్యాణమును జేకూర్చును. భౌతిక భోగ లాలసత నరులను పశుతుల్యుల గావించును. విశ్వసంక్షోభమును ఘటించును. లోకకళ్యాణమున కడ్డుగ నిలుచును.

"సోదరులారా! బ్రహ్మానుభూతికి కృషిని కొనసాగిం పుడు. దివ్యత్వమును గడింపుడు." వివేకానందు డిట్లెత్తి చాటుతటి - విదేశీయుల భావనాపరంపరలు ప్రక్షాళితములై పవిత్రములయి యుండవచ్చును? మనయూహల కందెడి యం ములా యివి? శ్రీరామకృష్ణపరమహంస వివేకానందుని హ్ర యక్షేత్రమున విత్తిన విత్తనములన్నియు విశ్వము నందంతట వెదజల్లబడుట కచట నాందీప్రస్తావన జరిగినమాట మాత్ర తథ్యము. పవిత్ర భారతసందేశము నలుదెసలకు బ్రసారమొన దీక్షవహించిన వివేకానందుని కార్యక్రమమున కచట ప్రారం త్సవము గావింపబడిన మాటమాత్రము వాస్తవము. జీవి నీకార్యకలాపము నిమిత్తమే ముడుపుగట్టి వివేకానంద మహోద్యమమును నడిపించినది తొమ్మిది సంవత్సరముల స కాలపరిమితియే కావచ్చును. కాని, తదితరులు తొమ్మిదివ

యేండ్లలో సాధింపలేని అపూర్వవిజయముల నన్నింటి నాయన యీ సంక్షిప్త సమయముననే జయప్రదముగ సాధింపగలిగి నాడనినచో వివేకానందు డెట్లు కారణజన్ముడో! మన కవగత మగును.

ఆయన నిశ్చలభావన హిమాలయ సదృశము. ఆయన సందేశ శ్రవణముతో పలువురు పాశ్చాత్యప్రముఖులే ఆయనకు శిష్యులయినారు. చక్కని తోటమాలిపగిది నెన్నియో ప్రయోగముల నొనర్చి - ఆధ్యాత్మికభావ బీజములను ప్రజాహృదయ కేదారములలో విత్తి, పాదులుగట్టి, నీరుతోడి, ఎరువుచల్లి, మొలకలెత్తించి, పుష్పించి ఫలించునట్లొనర్చిన ఘనత యీ మహనీయునకే దక్కినది.

ఇట్టి యద్భుతమహిమల బ్రదర్శించిన యీ సాధుపుంగవుడు మహాత్ముడుగాక - దివ్యమూర్తిగాక మరి యెవరు? ఆయన యక్లేశముగ సాధించి పరిష్కరించిన సమస్యల వెనుక గల దివ్యత్వమును గుర్తింపగలవా రెందరుందురు? వర్ణింపగల వారి సంఖ్య యెంత?

యోగివాక్కు బ్రహ్మవాక్కుగదా! ఆయన పల్కిన దెన్నడును రిత్తవోలేదు. చేపట్టని మానవసేవా కార్యక్రమ మాయనయెడ వెదకినను గన్పట్టదు. పూనుకొని ఫలింపజేయ లేని యంశమాయన యనుభవమునందే లేదు. ఆయన దివ్య వాణి సర్వమును జక్కదిద్దగల పరుసవేది. ఆయన విశాల విశ్వ

ప్రేమస్వరూపుడు. విశ్వప్రేమికుడై విశ్వకళ్యాణసాధకమతమున కాయన ప్రవక్తగ నిలిచినాడు. పోల్చుటకేని మఱియొక రట్టి వారు దృగ్గోచరమగుదురా? మానవుల నందఱను సమదృష్టితో తిలకించుట, మానవసేవను మాధవసేవగ నెంచుట, వివేకానందుని సిద్ధాంతములలో నగ్రేసరములు. ఎటనున్న వారినేని దేశ జాతి కుల వర్ణ మత వివక్షత లేక యామహనీయుడు ప్రేమించి నాడు. ఎల్లరపై ప్రేమవర్షమును గురిపించి వారిని తనియింప జేసినాడు.

"మానవుడుదివ్యుడు. పుట్టుపాపిగాడు. అమృతపుత్రుడు." స్త్రీ పురుషులకందరి కాయన సమముగ నందించిన సందేశసార మిది. వేదార్థ సంభృతమైన యీప్రబోధము వివేకానందుని విశాలదృష్టిని మహత్తర పరిజ్ఞానశక్తిని జాటుటలేదా? మాన వుల నాయన మమతల స్వప్నమునుండి మేల్కొల్పినాడు. తాత్త్విక ప్రబోధములతో సర్వమానవులను జాగ్రదవస్థకు గొనితెచ్చినాడు. తన చరణములను గట్టిగ నేలపై మోపియే దివ్యలోకములను సహచరులకు—ననుయాయులకు జూపెట్టజాలిన దివ్యదృష్టి సంపన్నుడాయోగిపుంగవుడు. లోకమంతయు దేవ దేవునిసృష్టి. కావుననే యిందు సర్వత్ర దివ్యత్వమే తొణికిస లాడుచుండును. దానిని బాగుగ నుద్బుద్ధమొనర్చుకొని నరుడు దివ్యుడగుటకు జతనములు సాగింపవలయునని దృఢముగ విశ్వ

సించి యెల్లర కారహస్యములను వినిపించిన వివేకమూర్తియే వివేకానందస్వామి. జ్ఞాన ప్రజ్ఞానములను విరివిగ ప్రపంచము నకు బంచిపెట్టిన జ్ఞానయోగి. అన్నదానము, వైద్యసేవ మొద లయిన పుణ్యకార్యక్రమములతో బాటుగ జ్ఞానదానమునుగూడ గావించిన కర్మయోగి వివేకానందుడు. అజ్ఞులు "జీవుడు - జీవులు" అని భావించిన ప్రాణికోటిని భగవంతునిగనే భావించి - ఆరాధించిన పవిత్ర భక్తియోగి. సర్వమును సముచితముగ సమన్వయించి - సమీకరించి ఏకత్వమును నెలకొల్పిన రాజయోగి. నరసేవయే నారాయణ పూజగ నెంచి అజ్ఞాన నారాయణులను - దరిద్ర నారాయణులను - దీన నారాయణులను - వేయేల సర్వసామాన్య ప్రజలను సేవింప సంకల్పించిన మహర్షి. ఉన్నత సత్యములను సమాక ళించుకొని, జీర్ణించుకొని, వాని నాచరణము నందిడుకొని, భగవదనుభూతి నందుకొనిన మహాత్ముడు. తన యుద్దీపనశక్తి ఫలితముగ దివ్యచక్షువు నావిష్కరించుకొని, త్రికాలజ్ఞుడుగ, తన దివ్య సందేశమును నిర్భయముగ - నిర్దుష్టముగ విశ్వమున కందించిన యోగిపుంగవుడు.

గురుదేవుని పేర శ్రీరామకృష్ణ మఠమును - రామకృష్ణ సేవాశ్రమములను స్థాపించి, వానిద్వారా విశ్వమునకు ఉత్తమ సందేశములను అందించుటకు నిరంతరము యత్నము సాగించిన దివ్యుడాయన.

దివ్యత్వమును ప్రసాదించుట, దివ్యదృష్టి నలవరచుట, మానవసేవ గావించుట యీ పవిత్ర సంస్థల పరమ లక్ష్యములు. యువకులకు చక్కని సుశిక్షణ యిచ్చి వారిని సన్యాస దీక్షితు లను గావించి 'మానవసేవయే మాధవసేవ' యనెడి దివ్యాదర్శ మును నిండు భక్తితో నిరంతర మారాధించిన ప్రాజ్ఞుడు వివేకా నందుడు. నేటికిని ఆయన యనుయాయులు వేదాంత ప్రబోధ సరళిని వాడ వాడలకు గొనిపోవుచునేయున్నారు.

శ్రీ వివేకానందుడు పెనుతుపానువలె వీచి తన జీవిత కాలమున సంఘమునగల కల్మషమును క్షాళన మొనర్చి విజృం భించి విజయపరంపరలను సాధించి, విద్యాధికులమని విఱ్ఱవీగెడి ఆంగ్ల మానస పుత్రుల కన్నులు తెఱపించి, మహోత్కృష్టమైన ఋషి జీవితధర్మమును ప్రబోధించి యెల్లర ధన్యుల గావించినాడు. విశ్వకల్యాణమును - శాంతిని లక్ష్యముగ నిడుకొని యీ మహ నీయుడు సాగించిన వేదాంత జైత్ర యాత్రను గని నిఖిల విశ్వము నివ్వెర వోయినది. భౌతిక దేహమును సర్వవిధముల మాతృదేశ కైంకర్యమునందు ధన్యమొనర్చుకొనుటకై యత్నిం చిన మహాత్ము డాయన. ఆ వాణి నలుదెసల నేటికిని ప్రతిధ్వ నించుచునేయున్నది. ఆ పలుకులగల పరమార్థము నమలుపఱ చుటకు మనల సదా ప్రోత్సహించుచునేయున్నది. నిత్యసత్యమై దేదీప్యమానముగ వెలుగొందుచునేయున్నది.

సకల పాశ్చాత్యలోక సంస్తుతులనంది జయపతాకల నెగురవైచి వేదాంత దివ్యరథము నప్రతిహతముగ నడుపుకొనుచు వచ్చిన యీ భారతీయ యోగికుల చూడామణి 1902 జూలై 4వ తేదీని కాలధర్మమునందువరకు సోదర సన్యాసులతో సంతోషముగ కాలము గడుపుచునే యున్నాడు. పాఠములను ప్రవచించుచునేయున్నాడు. ఒకనాటి ప్రశాంత సాయం సమయమున శిష్యులతో గలిసి విశ్రాంతికొరకు నగరమును వదలి కొంత దూరము నడచివచ్చి ధ్యాననిష్ఠాపరుడై నిశ్చలయోగము నాశ్రయించి అనాయాసముగ భౌతిక దేహమును పరిత్యజించినాడు.

ఖండ ఖండాన్తరములలో మారుమ్రోగిన భారతీయ వేదాన్త సరస్వతి నాడు ఖిన్నవదనమున మూగవోయినది. ప్రకృతినే మురియించి – ప్రజానీక సమారాధనమున పారవశ్యము ననుభవించి – బ్రహ్మాండ పరివ్యాప్త సనాతన ధర్మభావనకు మూర్తిగా నిల్చిన యొక పుణ్యమూర్తి నాడు కీర్తిశేషుడైనాడు.

రామకృష్ణ భావనందనమున వేదాంత కల్పతరువు కూలిపోయినది. భారతీయుల రాజయోగి అస్తమించినాడు. ఉత్తుంగ తరంగ కల్లోలములతో, స్వచ్ఛ శీతలజలములతో నిర్మల నిత్యవాహినిగ ప్రవహించెడి గంగామహానదివలె నా మహనీయు డెన్నియో ఊషరక్షేత్రములను సారవంతమొనర్చినాడు. నేటికిని

ఆ మహాత్ముని భావజలధారలు దుర్గమారణ్య సదృశ పాషండ హృదయములను సైతము పునీత మొనర్చుచునే యున్నవి.

వియన్నదీ మహోదకధారలవలె వివేకానందుని పలుకులు భారతీయులకు - తారకమంత్రములు - పరమపావనములు నయినవి. ఆయన శాంతిదాత. సత్యదూత. ఆయన అందించిన జ్ఞానజ్యోతి దివ్యము; అప్రతిహతము.

ఉత్తమాదర్శములను - ఉన్నతభావములను - ఉత్తేజన మహితములును ఉత్సాహకరములును నగు భావఫలములను - మధురాతిమధుర సందేశములను - కల్పవృక్షమువలె, కామధేనువువలె విశ్వమునకు వివేకానంద హృదయము సదా ప్రసాదించుచునే యుండును.

ఆయన జాతీయతా వికాసమును గలుగజేసిన దివ్యతేజోమూర్తి. భారతీయ స్త్రీ పురుషులెల్లరు వివేకానంద విజ్ఞాన జ్యోతికి సంబంధించిన శాశ్వతకాంతులగాంచి ముగ్ధులై జోహారులర్పించుచున్నారు. భారతమాత తన పవిత్రతను సముద్దీప్త మొనర్చుకొనుచు, మహోన్నతస్థానము నధిరోహించి యెల్లర సమారాధనముల నందుకొనుచున్నది. పతితుల నెల్లర సముద్ధరింప కంకణము గట్టుకొనిన వివేకానందస్వామి జీవితము నిక్కముగ మహోజ్జ్వల నదీముఖము. మానవుల నాత్మవిశ్వాసపరులనుగ తీర్చిదిద్దుటకు సర్వవిధముల నుపయోగపడిన దివ్యజీవిత మాయనది. సేవాత్యాగములనే జీవిత లక్ష్యములుగ నిడుకొన

వలయుననునది వివేకానందుని జీవిత సందేశము. విశ్వమునకే శిరోభూషణముగ వెలుగొందిన మనుగడ యీ మహనీయునిది.

అనుష్ఠాన వేదాంతమే - భగవదనుభూతియే మానవునేనాటికేని దరిజేర్పగలదనియు - తరణోపాయము జూపగలదనియు వివేకానందు డెల్లెత్తి చాటినాడు. ఈర్ష్యా ద్వేషములు సంకుచిత భావములు విస్మరించి సహనమును, సహకార భావమును, ప్రేమను, పెంపొందించుకొనవలయుననియు జాతి కాసంయమి చంద్రుడు హితబోధ గావించెను. సర్వమతములవారును పరస్పర స్నేహభావముతో మెలగుట నేర్చి విశ్వమత స్థాపనకు దోడ్పడవలయునని వివేకానందుని నిర్ణయము. మానవాళి యీ మహనీయుని శిష్టబోధలను శిరమునదాల్చి నేటికిని మెలగుచున్నది. రేపటికి నట్లే మెలగ గలదు.

శివానుగ్రహ బలమున భువనేశ్వరీ హృదయ శిఖరసీమల నుండి పవిత్ర భారతభూమిపై నరేంద్ర నామక మహోజ్జ్వల నదీ ముఖ మొక్క పెట్టున దూకినది. ప్రసిద్ధులకు - ప్రతిభావంతులకు నిలయమైన వంగరాష్ట్రమును - కలకత్తా నగరమును దిగ్భ్రాంతిలోముంచి దీప్తిమంతముగ విరాజిల్లినది. రామకృష్ణ గురుదేవ భావజలధి యొసగిన బలమున బాగుగ పుంజుకొనినది. శిష్యమానస కేదారముల బంగారు పంటల పండించినది.

అది భౌతిక భావముల వేడిమితో బీటలు వాఱి-భోగలాలస వృష్టితో సెగల-పొగల వెలిగ్రక్కుచున్న పశ్చిమఖండ వాసుల

హృదయ భూభాగములపై సువ్యాప్తిగ బ్రవహించి-ఆర్ద్రిమొనరించి - భారతీయతత్త్వ బీజములు మొలకలెత్తుటకు - భగవద్భక్తి సస్యములు పండుటకు దోహద మొనర్చినది.

ఊబుకలతో - పరుగులతో తాను కలుషితముగాక - సకల ప్రదేశముల కలుషములను సంక్షాళన మొనర్చి - అడ్డుకట్టల నధిగమించి - సేతువులను జిందర వందర గావించి-భారతీయ దివ్యభావ తేజములు తన యూహాలనెడి తాళప్రమాణ తరంగములపై ధవళ బ్రహ్మజ్ఞాన కాంతులను బ్రసరింపజేయుచుండ, నిర్నిరోధముగ విశ్వమునందంతట బ్రవహించినది.

ఆర్ష సంస్కృతి - శాస్త్రసంపద నిర్దేశించిన తెలుగున అనంతుని యనంత దయారస సముద్రమున గలిసి, జీవాత్మ పరమాత్మని జేరినట్లు మురిసినది.

అహో! ఏమి యీ మహోజ్జ్వల ముఖగమన వైభవము! తరతరములందట్టి నదియొకటియున్న జాలదా! భారతము తరించుటకు-విశ్వము సముద్ధరింపబడుటకు మనమా మహోజ్జ్వలనది గమనము సాగించిన పుణ్యపరిసరములకు జెందినవార మనుకొనుట వలననే యొడలు పులకరించు చున్నదే! మనసు మయూరమై నర్తించుచున్నదే! మహాభాగ్యము. మహాదృష్టము.

ఉజ్జ్వల గంగానదీ ముఖభాగమువలె పావనమై - మహామహిమాన్వితమై - మాననీయమై - మహత్తరలక్ష్య సంభరితమై యలరారిన వివేకానందస్వామి జీవితము తరములు గడచి

సను - యుగములు దాటినను మన కనులముందు దివ్యకాంతుల దేజరిల్లుచునే యుండును.

ఆ పావన సిద్ధాన్త జలధారలగ్రోలి సకల భారతము సంబరముల గొల్లగొనుచునే యుండును. నిఖిల విశ్వము నిరుపమానందము నందుకొనుచునే యుండును.

— ఓం శాంతిః శాంతిః శాంతిః —





జూపిటర్ ప్రింటింగ్ ప్రెస్, గుంటూరు - 2 ఫోన్ : 21907